# పృథ్వీ భాగవతము.

## (పృథ్వీరాజ ప్రబంధము)

రచయిత:

విద్వాన్ బీర్నీడి ప్రసన్న,

వినుకొండ.

**1966.**



# కృతిస్వామి.



అద్భుతమ్ములగు నూహాభరమ్ములఁ బిల్కు। కునునోపని బెడంగు తెనుగు శిరము
ముక్కుఁగన్నులు దివ్యముగఁ దీర్చినట్లుండి। పౌరుష శ్రీ నుట్టిపడెడు మోము
సిరియుం గవుంగలించె నన రుద్రాక్షన। నలరు సన్నని పైఁడిగొలుసు గళము
బొడవు, బొడవునకొప్పెడు ద్రఢిమయు దబ్బ। పండువన్నియనుండు నిండుమేనుఁ॥
జనపదమ్మున సాహితీ పథములందు। నన్నయా? తిక్కనా? బోతనా? యటనెడు।
విభ్రమమున దర్శనమిచ్చు విశ్వనాథ। సత్యనారాయణ సుకవి చక్రవర్తి॥

( కృతిస్కంధము 11వ పుట చివరిసీసము )

# పరిచయము

డాక్టర్ శ్రీ దివాకర్ల వేంకటావధాని,
(యం. ఏ. ఆనర్సు) పి. హెచ్. డి.

కొన్ని నెలల క్రింద నాకు మధుమాసము కావ్యము టపాలో వచ్చినది. దానిని తెఱచి చూతునుగదా అందు మొదటనే గురువర్యులు శ్రీ విశ్వనాథకవి సమ్రాట్టులు వ్రాసిన పరిచయము కనిపించినది. వారందా కావ్యమునగల వ్యంగ్య సౌందర్యములు పదప్రయోగ రచనా పాటవములు ప్రదర్శించి కావ్యకర్త మహాకవియని నిరూపించిరి. ఆ పరిచయము చదివిన పిమ్మట కావ్యమును చదవకుండ నుండలేక పోతిని. కావ్య పఠనానంతరము శ్రీ గురువుగారి పరిచయ వాక్యములందలి ప్రత్యక్షరము పరమ సత్యమై భాసించినది. తరువాత కవిగారికి కావ్యమందినదని తెల్పుచు నా సంతోషము కూడ వెల్లడింపవలెనను కొంటిని. కావ్యమందెచ్చటను వారి చిరునామా కానరాలేదు. అందుచే నుత్తరము వ్రాయుట కుపేక్షించి యూరకుంటిని. పక్షము రోజులక్రింద ఆ కవిగారే యీ పృథ్వీభాగవతమును బంపుచు దీనికి నన్ను పీఠిక వ్రాయుమని కోరియుండిరి. అంత మహాకవి కావ్యమునకు నా పీఠిక యేలయని భావించియు వారి కోరిక కాదనలేక యీ నాలుగు వాక్యములను వ్రాయ సాహసించితిని. ఈ పని వెనుకటి నా యుపేక్షవలన వారికి గలిగి

యుండు కోపము నుపశమింపజేసి పశ్చాత్తాప పూర్వకముగా క్షమనర్థించుటకై కావించు యత్నము లేశమాత్రమే.

ఏతత్కావ్యకర్త శ్రీ బీర్నీడి ప్రసన్నగారు. కవి కుటుంబమునకుఁ జెందినవారు. ఆంధ్రవిశారద బిరుదాంచితులైన వారి తండ్రిగారు శ్రీ కృష్ణదేవరాయ ప్రబంధరాజమును రచించినారఁట. వారి సోదరులందఱును కవులే. పరంపరాసిద్ధమైన కవితా ప్రతిభకు తోడువారు విద్వత్పరీక్షయందుత్తీర్ణులై తగిన పాండిత్యమును గూడ సంతరించుకొన్నారు. తెలుఁగుతనము వారికి నిసర్గసిద్ధము. దానికి విశాలమైన జాతీయ భావము వన్నె కలిగించినది. ఆ రెండు భావముల దోహదముచే పెంపొంది వారి కవితాలత పూచిన సురభి కుసుమరాజ మీ పృథ్వీభాగవత కావ్యము.

ఈ కావ్యము నందలి వస్తువు సంయుక్తా పృథ్వీరాజుల వృత్తాంతము. కవిగారు దీనికి పృథ్వీభాగవతమని పేరు పెట్టినారు. భారతదేశమందు వెలసిన మహారాజ పురందరులలో పృథ్వీరాజొక్కఁడు. అతని పరాక్రమమౌదార్యము లసాధారణము లైనవి. మహమ్మదుఘోరీని పలుసారులోడించి పరాక్రమమును, ప్రాణములతో విడిచిపెట్టి యౌదార్యమును ప్రదర్శించిన ప్రభువరేణ్యుఁడాతఁడు. అందుచే నీ కావ్యమునకు పృథ్వీభారతమను పేరుపెట్టి యుండినచో శివభారతనామము విన్న వారి కంతగా వింతకలుగక యుండెడిది. కాని కవిగారు దీనిని భాగవతమని పేర్కొన్నారు. అందుకు పోతన్నగారి భాగవతముపై వారికిఁగల యాదర విశేషమొక కారణమై

మున చిత్రనడిపిన దౌత్యము స్వయంవరాగత వివిధనర
పాల వర్ణనము యుద్ధానంతర వస్త్ర వర్ణనము, జయచంద్రుని
పశ్చాత్తాపము వారు కావించిన కల్పనలలో ముఖ్యములైనవి.
రాజపుత్రవీరుల పరాక్రమము వర్ణించునప్పుడు వారెంత
యుప్పొంగుదురో వారియందలి యనైక్యమును సూచించు
నప్పుడంత క్రుంగిపోయినట్లు కన్పింతురు. చెఱసాలలో సంయుక్త
యురిపోసికొనుటకు యత్నించుట సరిగా నా సమయమునకే
పృథ్వీరాజచ్ఛటికేగి యామెను రక్షించుట, సంయుక్తా పృథ్వీ
రాజులు కారాగారమునుండి బయటికి కరుదేరఁగనే చిత్ర
యెదురై వారిని పుష్పమాలికాలంకృతులఁ గావించుట,
సంయుక్త మగవేషముతోఁ దండ్రి కడకేగి యైక్యమువలని
లాభములు వివరించుట చాందుభట్టు వృత్తాంతము ఈకావ్యము
నందలి కథ కింతిం తనరానివన్నె చేకూర్చినవి. ఘోరీ, పృథ్వీ
రాజు, సంయుక్తాది రాజకాంతలు, జయచంద్రుఁడు మున్నగు
వారందఱును కావ్యాంతమున మృంతినందుటచేఁ గావ్యము
విషాద మయముగ ముగిసినది. భారత దేశమందలి
రాజవర్యుల పరస్పర ద్వేషమును, అనైక్యమును ఈ
విషాదాంతతకుఁ గారణములు. అనైక్యము దుష్ఫలి
తములను వర్ణించుటతోఁ గావ్యము నారంభించుటయేకాక
కవిగారు సంయుక్తచేఁగూడ దానివలని చేటులు చక్కఁగా
విశదీకరింపజేసినారు. చివరికిఁ గావ్యమును "హైందవావని
యైకమత్యంబు కొఱకుఁ గన్న కొడుకుల కెల్ల నుగరముఁ జూచి
అడుగుకొనుచున్న దిప్పుడు నరసినారె" యను ప్రబోధముతో
ముగించినారు. అనైక్యములఁ దొలగించి యైక్యసంపదతో

నలరారవలెనని కవిగారాంధ్రుల కీ కావ్యముద్వారా చిరస్మర ణీయము శిరోధార్యమునగు నుత్తమ సందేశము నొసంగి నారు.

ఈ కావ్యమునందలి వర్ణనలు క్రొత్త ప్రాతల మేలు కలయికతోఁ గూడి కవిగారి భావనాబలమును, సూక్ష్మ పరిశీలనమును లెస్సగా వ్యక్తము చేయుచున్నవి. స్వరూప స్కంధమునందలి సంయుక్త విరహ వర్ణనమును, కోకిలాదు ల యుపాలంభములును, చెలుల వనవిహారమును ప్రబంధము లందలి విరహ వర్ణనమును తలఁపునకుఁ దెచ్చుచున్నవి. "ఒక భామ చరణాహతి కశోకము రహించి యొకనాతి మృదుగీతి కొకటి పూచి" యను పద్యమున దోహదక్రియలు సూచింపఁ బడినవి. చిత్రస్కంధమున భారతసాధ్వీ సుగుణములును, మహిమాను భావములును నిపుణముగా వర్ణింపబడినవి. సంయుక్త విద్యజ్జనులు మెచ్చుకొన భారతసాధ్వీ మహామహి మనుగూర్చి దివ్యమైన కావ్యము రచించినదఁట! అందలి పద్య ములే సందర్భానుగుణముగాఁ గవిగారు. మాఱువేషమున నున్న చిత్రచేఁ జెప్పించినారు. భారతసాధ్వీ పవిత్ర శీలమును విశదీకరించుటలో వారు చూపిన యభినివేశ మెంతయు మెచ్చుకొనదగియున్నది. కావ్యమునం దెడనెడవారు సూర్యోదయాస్తమయములను జ్యోత్స్నాంధకారములను సంగ్రహముగఁ గథా సంబంధులుగను వర్ణించియున్నారు. స్వరూప స్కంధము నందలి (పుట 10, 11) వర్ష శరదృతువుల వర్ణనము ఈఋతువుల స్వరూపలక్షణములను వివరించుచు

నతిమనోహరము గానున్నవి. పృథ్వీరాజు సంయుక్తను కారాగృహవిముక్తి నొనరింప ఢిల్లీనుండి బయలుదేఱిన నాఁటిరాత్రి పదాఱు కళలతోఁ బ్రకాశించిన పున్నమచంద్రుని వర్ణన (81 పుట) సహజమును భావబంధురమునునై యొప్పారుచున్నది. చంద్రుఁడు "అర్క-మేఘముల దయకు నందఁబోని కటికి నిరుపేద గుడిసెలఁ గనికరించె" అనుట కవిగారికి దీనుల యెడగల సానుభూతి మయమైన హృదయమును సూచించుచున్నది. పృథ్వీరాజు కావించిన సంయుక్త వర్ణనము (పుట 91, 92) ఔచిత్యబంధురమై యొకవంక నామె యప్రతిమాన సౌందర్యమును వేఱొకవంక పృథ్వీరాజున కామె యెడఁగల పవిత్ర ప్రేమను లెస్సగాఁ జాటుచున్నది. సంయుక్త కావించిన కృష్ణోపాలంభన మందలి "జలముల మంచు బంగల బుడబుడలలోఁ గూర్మంబు నడకల గోనబు చూపి" (పుట 88) యను సీసము మత్స్య కూర్మాద్యవతారములను ధ్వనింప జేయుచు పరమ ప్రౌఢముగానున్నది. సంయుక్తా పృథ్వీరాజుల వివాహము జయచంద్రుని విరుద్ధ భావముచే వైభవముగా జరుగుట కవకాశము లేక పోయినది. ఆ మహారాజు సంయుక్తతో నశ్వమునధిష్ఠించి యరుగు నప్పుడు లతలు పుష్పాక్షతలను జల్లియు, శుక శారికాది ద్విజ సంతతులాశీర్వాదములఁ గురియించియు కోకిలలు పెండ్లి పాటలు పాడియు, నళులును దరంగిణులును శుభతూర్యనాదములను బరగించియు నాలోపమును బూరించినవి. "బలు కొండ సఖునెక్కి గల గల ప్రవహించు సెలయేటి ప్రియురాలి వలపుచూపి (పుట 98) యనుసీసము పృథ్వీరాజు ప్రణయ

హృదయమునుబట్టి చూపుచున్నది. అతఁడు ప్రేయసికి కురుక్షేత్రమును వర్ణించి చూపుచుఁబోవుచుండ నతని చంక నుండిన పిడిబాకు జాఱిపోయెను. అది యాతఁడు గమనింపనే లేదు. అప్పుడు సంయుక్తకుఁ గారణములేకుండనే యేదియో భయముప్పతిల్లెను. ఇది ముందు జరుగఁబోవు విషాద పరిణామమునకు సూచనగా నున్నది. ఘోరీ సేనలు కనోజిపై దండెత్తిన సమయమున సూర్యుఁడస్తమించెను. చీకట్లు నల్దెసలఁ గ్రమ్మెను. ఆకసమునఁ గాఱుమొయిళ్ళు వ్యాపించి కుంభవృష్టి కురిసెను. ఆ వర్షమును సంగ్రామ దృశ్యముతో బోల్చుచు కవిగారు రచించిన సీసము (పుట 134) భావనిర్భరమై యప్పటి భయంకర సన్నివేశమును సాక్షాత్కరింప జేయుచున్నది. ఆ వర్షము "పోరిలో రాసుతులఁ గోలుపోయి యంటుఁబడ్డ భారతాంబను శుచిపరచిపోవ నభ్రగంగయే దిగివచ్చినట్లుండెను." ననియు నప్పుడు భరతమాత యాశౌచంబుఁబాపుకొనఁగ దానమాడిన దొడ్డ ముత్తైదువట్టు లుండె ననియుఁ జెప్పుట కవిగారి భావనా సౌష్ఠవమునకు బరాకాష్ఠ. స్వయంవర స్కంధమున స్వయంవరాగత వివిధ దేశావనీపాలుర రూపగుణశీల వర్ణనమున్నది. ఈ వర్ణనము నడుమ నవయుగలంబోదరరాఘవుని ప్రసక్తికలదు. ఇందుఁ జక్కని హాస్యరసము సిందారియున్నది. ఈ హాస్యముతోఁ బాటిది కార్యారంభమునం దవశ్యకర్తవ్యమైన శాంభవి తనయుని స్మరణమునకుం గూడఁ దావొసంగి సంప్రదాయమును బోషించుచున్నది. చిత్ర యందలి రాజులను వర్ణించి యతి సమర్థుఁడును ధనశేకూల ధరుఁడునైన యొక వృద్ధుని సం

యుక్తకు జూపి యతనికి నమస్కరింపుమని హెచ్చరించెను. ఆ వృద్ధుఁడు సామాన్యుఁడుగాఁడు. అతడు పరమేశ్వరవరకృపఁ బ్రసన్న విజయాల దొడ్డగాఁగన్న సంతోష విభుఁడు. విశ్వనాథవారి శాశ్వత భక్తుఁడు. సంయుక్తకు వరుసకు దాత కాదగినవాఁడు ఈ వర్ణనలోఁ గవిగారి యాత్మవృత్తాంతము చక్కగా వ్యంజిత మగుచున్నది. ఇచ్చటి పదములందలి యర్థాంతర స్ఫురణ కవిగారి రచనాప్రౌఢికి దార్కాణము. ఈ వృద్ధుని పిమ్మట నీళ్లకూర్పానపునీచు వర్ణన మున్నది. అతఁడధరమందుఁ దేనె యంటిగిలోఁ విషంబు గల మహాపాతకుఁడు. ఇతఁడుకూడ నెవ్వరోకాని కవిగారితో సంబంధము కలవాఁడే. ఇట్లు కథాసందర్భమున నాత్మీయాంశద్యోతకములగు విషయములఁ జొప్పించుట కవిగారి యసాధారణ ప్రతిభాపాటవమునకు దార్కాణమై యానందము గొల్పుచున్నది.

ఈ కావ్యమునందుఁబాత్ర పోషణమునఁ గవిగారు చూపిన నేర్పు ప్రశంసా పాత్రముగా నున్నది పృథ్వీరాజసామాన్య పరాక్రమౌదార్యముల కాలవాలమైనవాఁడు. ఏకపత్నీ వ్రతమునందును, పరకాంతా పరాఙ్ముఖత్వమునందును శ్రీరామచంద్రుని కెనయైనవాఁడు, అడవిలో, చిత్రకును అతనికి జరిగిన సంభాషణ మిందుకు సాక్ష్యము. కన్నులకు గంతలు కట్టుకొని సప్తభాండములను గొట్టునట్లు నటించుచు శబ్దమునుబట్టి ఘోరీతల నెగురఁగొట్టుట యతని ధనుర్విద్యావైశారద్యమునకు నిదర్శనము. సంయుక్త పవిత్ర ప్రేమకు బట్టుగొమ్మ. ఆ ప్రేమచేఁ బ్రేరితమై యామె

తండ్రి భావమునకు విరుద్ధముగ జంకక పృథ్వీరాజు ప్రతిమ మెడలో స్వయంవర కుసుమమాలికవేసి తన హృదయ నైశ్చలమును సాక్షీత్వమును జాటినది. మగవేషమున దండ్రికడ కరిగి యైక్య సందేశము నొసంగుటయు యుద్ధమునం దొక సందర్భమునఁ బతి ప్రాణములఁగాపాడుటయు నామె ధైర్యసాహసములను జెప్పక చెప్పుచున్నవి. యుద్ధమునఁ బతి మరణించిన సమయముననే యంతిపురమున నామె యసువుల వీడుట దివ్యమైనది. చిత్ర యువతియయ్యు నామె వేషాంతరమును స్వీకరించి పృథ్వీరాజు కడకరిగి యతని హృదయము నెఱింగి వచ్చుట యామె సఖీ ప్రేమనేకాక సాహసమునుగూడ జాటుచున్నది. సంయుక్తా పృథ్వీరాజులు చెఱసాల విడచి యరుగు నప్పుడామె యెదురై పల్కినపల్కులామె హృదయ పాత్రమున నిండారియున్న సఖీప్రేమ నొల్కబోయుచున్నది. చాందుభట్టు కవియేకాక కార్య దక్షుఁడు. అతఁడు చూపిన రాజభక్తి యప్రతిమానమైనది. జయచంద్రుడు పృథ్వీరాజునెడఁగల ద్వేషభావముచేఁ దన కూఁతు సౌఖ్యమునుగాని తన దేశాభ్యుదయమును గాని పరికింపక ఘోరీ సాహ్వానించి పరమ నైచ్యమును బ్రదర్శించినాఁడు. ఆత్మజయను ననురాగమిసుమంతయు లేక కారాగృహమున బంధించినాఁడు. కూఁతురువచ్చి యైక్యమును బోధించినప్పుడాతఁడామె మాటలు పెడచెవినిబెట్టినాఁడు. ఘోరీ సేనలు కనోజిపైబడినప్పుడు కాని యా మాటలందలి యాథార్థ్య మతనికి బోధపడినదికాదు. చివరికతఁడు తనతప్పును గ్రహించి పశ్చాత్తప్తుఁడై పొంగి పొరలివచ్చుచున్న గంగానదిలోఁబడి

యసువులు విడచినాఁడు. కావ్యాంతమున నతఁడు వ్యక్తము చేసిన పశ్చాత్తాప మనెడి యగ్ని యాతఁడు పూర్వమొనరించిన పాపమునంతను భస్మసాత్కృతము కావించి యాతని భవిష్యద్భారత భూపాలురకైక్య సందేశము నొసంగుసదుపదేష్టగా దీర్చిదిద్దినది.

"మేలౌగాపుత్ర! నీకు సోదరులకున్ మిమ్మొప్పు ద్వేషించుచున్
మీలోనున్న విభిన్న భావములు భస్మీభూతమౌగాత! యీ
కాలంబందుమహోగ్రమౌ సుదయతోఁగంజాప్తుఁడుద్భాతుఁడై
శ్రీలోమన్ దలరొద్దగాత! జనయిత్రీ! నేఁ బ్రయాణించెదన్"

అనునది భరతమాతను గూర్చి యాతని తుది ఆకాంక్ష.

ఈ కావ్యము వీరకరుణ శృంగార రసప్రవాహములకుఁ గూడలియైన ప్రయాగ. స్వరూప ప్రణయ స్కంధములందు వరుసగా విప్రలంభ శృంగారములు పోషింపబడినవి. రణ స్కంధమున వీర రౌద్రములును, నిర్యాణ స్కంధమున కరుణమును గాసిపించుచున్నవి. హాస్య బీభత్సము లుకూడ నొండు రెండుచోట్ల నున్నవికాని వాని నంతగాఁబరిగణింప నక్కఱ లేదు. చిత్ర మూరువేషమున సంయుక్తను పృథ్వీరాజును గాంచి ప్రసంగిచి నప్పటి సందర్భములు రూపకోచితములై రమణీయములుగా నున్నవి.

ఇంక నీకావ్యమునందలి శైలిని గూర్చి రెండుమాటలు చెప్పి విరమింతును. కవిగారు ప్రతిభావంతులు. ప్రతిభాను

గుణములైన వ్యత్యస్త్యాభాసములుకూడ వారికిగలవు. వారి భావనాశక్తిపరిపక్వమైనది. వారుకావించిన వివిధవర్ణనలయందు శక్తి మహత్త్వము సర్వతోముఖముగా గోచరించును. వారి వర్ణన లన్నియు కథాసందర్భమున కనుకూలము లును ఔచిత్య పూరితములై యింపునింపుచుండును. శృంగార మును వీరివలె నిగ్రహావంతముగను ఔచిత్యపూరితముగను వర్ణించునేర్పు ఇతరులయం దరుదుగా గానిపించును. లలిత జాతీయ పదప్రయోగకౌశలము వారికి సహజసిద్ధము. అనవసర సమాసాడంబరమునకై ప్రయత్నింపక వీరుమృదుమధుర పద విన్యాసముతోడనే నిశితములైన భావములను గూడ జక్కగా వ్యక్తముచేయ యత్నింతురు. అందుచే వారి పద్యము లన్నియు ధారాశుద్ధి సంభరితములై చదివిన కొలది చదువ వలెనను నుత్కంఠ కలిగించుచుండును. కుంఠితగతిగల పద్య మొక్కటియు వారిరచనలో గోచరింపదు. "దొంగుర్లుగూసి", "గెలుపుల వింతలాడి", "నోరుండ నాలుకదీసినాడు" "వలపు రాపిళ్ళు" మున్నగుప్రయోగములు వారికి తెలుగుభాషపైగల యధికారమును జాటుచున్నవి. చాందుభట్టుచేతను మహమ్మ దీయుల చేతను హిందూస్థానీ పలికించుట సందర్భోచిత ముగానున్నది. రణస్కంధమున మరణోన్ముఖులైన హిందూ మహమ్మదీయ యోధులకు జరిగిన సంభాషణమును స్వయంవరమున జయచంద్ర సంయుక్తలకు జరిగినసంభాషణ మును చితాగ్ని సంయుక్తా పృథ్వీరాజులకు జరిగిన సంభాషణ ములును సహజములును సరసములునై యొప్పారుచున్నవి. కవిగా రచ్చటచ్చట వాడిన "కారే కవితా కళాఢ్యులుచిత

వ్యాపార పారాయణుల్" – "ఎవఁడు దొరకు నవకాశమును కడద్రోసికొనును?" "ప్రియులు దరిలేని యప్పుడా పెరిమ లేమొ! చెంత నిలుచున్న యప్పుడీ సిగ్గులేమొ!" – "వనమే జీవన మెండమావులు సుమీ వాంఛా నిరూఢార్థముల్!" – "చెలాయించదె రౌతు మెత్తనగు నేనియు గుఱ్ఱము మూఁడు గాళ్ళతో?" – "గ్రీష్మములోఁ గిలికి గాలితోడ్పడిన సామ్యం బయ్యె సినాఁటికిన్" – "మనసులేనట్టి ప్రతిమఁదెచ్చితివది యద్ది, ప్రతిమ లేనట్టి మనసుఁదెచ్చితివినీవు" – "వట్టితలఁపు బొమ్మకుఁదాళిఁ గట్టెదే[illegible]?" మున్నగు వాక్యములు వారి లోకజ్ఞతను. భాషామర్మజ్ఞతను వ్యక్తము చేయుచున్నవి. సహజ సరళముగా రచన సాగించినను పేలత్వమునకుఁ జోటీయక ప్రౌఢ సుందరముగా దానిని వెలయించు ప్రజ్ఞ కవిగారికి వశ నితరుల కెందఱికో యలవడని యపూర్వ కౌశలము. కొన్ని కథా భాగములును గంభీర భావములును వ్యంగ్యములు కావించి పఠితుల కానందము చూఱయిచ్చుట వారి కావ్యమునఁ బెక్కుచోట్ల కానుపించును.

మొత్తముమీఁద రచనా కౌశలములో భావగాంభీర్యములో పదప్రయోగ పాటవములో రసపాత్ర పోషణములో నీకావ్య ముదాత్తమై ప్రశంసాపాత్రముగా నున్నది. అచ్చటచ్చట స్వాతంత్ర ప్రయోగము లొండు రెండున్నను అవి రసమునకు భంగకరములుగా లేవు. కవిగారు కావ్యమును గురువుగారి కంకితముచేయు సంకల్పము వెల్లడించినారు. అది

యొంతయో యుచితముగా నున్నది. అప్పుడు శ్రీనాథు డన్నట్లు.

"కలుగు బదియూఱు వన్నె బంగారమునకు
బద్మరాగంబుతోడి సంపర్కలబ్ధి"

హైదరాబాదు. }
11-1-67. } (Sd.) దివాకర్ల వేంకటావధాని.

# సత్యసూక్తి

శ్రీ ముద్దులపల్లి సత్యనారాయణశాస్త్రి,
ఆంధ్రాధ్యాపకులు,
యస్. యస్. యన్. కళాశాల,
నరసరావుపేట.

"రతిరీతిపీతవసనా ప్రియేవ శుద్ధాఽపి వాఙ్మదే సరసా ;
విరసా సాలంకృతిరపి న రోచతే సాలభంజీవ"

ఈ సుధామయోక్తిని యొక సరససహృదయుఁడు వచించినాఁడు. ఇది త్రికాలబాధ్యమైన సత్యసూక్తి. హృదయ శూన్యమగు యాకృతి కెన్ని భూషణము లున్నను నవి భీషణములే. సరసహృదయ యగు లేజవ్వని కయ్యవి విభూషణములై విశేష విచ్ఛిత్తిని చేకూర్చును. ప్రణయరస నిర్భరయగు కాంత రతివేళల భూషణ హీనయయ్యు నైజములగు హావభావ విలాసముల చేఁతనే ప్రియు నలరింపఁ జాలును. విరసయగు కాంత బహుభూషణముల భూషితయయ్యు ప్రియ హృదయము ప్రణయ డోలికల తెమల్పఁ జాలదు. ఒక్కటే రసవత్కావ్యము సహృదయ హృదయానందము చేకూర్పఁ జాలును. పైపెచ్చు రసనిర్భరకు నిరాభరణతయే విశేషసౌందర్య సంధాయక మనుట నిర్వివాదము. ఈ దృష్టితోడనే యొక మహాకవి "అకుంకుమ కలంకితోజ్జ్వల కపోల ముత్ప్రేక్షితే నిరాభరణ సుందర శ్రవణపాశముగ్ధం ముఖమ్" అని నిసర్గసౌందర్య మాధురిని సూచించినాఁడు.

ఈ మాధురి కావ్యగతమై యొప్పుట కంతరంగ బహిరంగములగు రస-భావ-శబ్ద సంఘటనల యానుపూర్వి సమైక్యము ముఖ్యకారణము. ఇది నిర్దుష్టమై విస్పష్టమై పటిష్ఠమై యవభాసించుటకు రచయిత లేఖిని లోని విలక్షణ చైతన్యశక్తియే నిమిత్తము. నాదసౌష్ఠవము గల శబ్దముల నేరికొని వానిమూలమున తనహార్దభావములను వ్యక్తీకరింపఁజేయు నైంద్రజాలికశక్తి యొకానొక కవికి

మాత్రమే వాగ్దేవి నేకరించి సమర్పించును. అదియే మహాకవిత్వ ప్రసిద్ధి నిమిత్తమై సర్వసహృదయ హృదయాకర్షణ చణమై చెన్నారును. ఈ విషయము నొక నాదబ్రహ్మవేత్త "రమణీయాతిపరా-కృతిం బొలుచు వర్ణశ్రేణీ వీణానులాపము వేఁగ గతగించి యందు నిజబింబంబొప్ప యచ్ఛామృతత్వము నాత్మప్రతిపాదకత్వమును తదర్థాళియందెల్ల పూర్ణము గావించెడి వాణీ ......" యని వచించి నాఁడు. ఇట్టివాణి దివ్యవీణాలాపము వలె పాఠకశ్రోతృ సమ్మోహకమై యొప్పుట రససిద్ధుల కనుభవైక వేద్యము. ఇట్టికావ్యమే శ్రావ్యమై భావ్యమై, యొప్పును. ఇట్టికావ్యమును గూర్చియే యిట నీప్రయత్నము.

"కిం కవే స్తస్య కావ్యేన కిం కాండేన ధనుష్మతః పరస్య హృదయే లగ్నం న ఘూర్ణయతి య చ్ఛిరః"

ఒకానొక శబ్దబ్రహ్మవేత్త హృదయోద్గీర్ణమగు నీసూక్తి సత్కావ్యలక్షణము సిద్ధాంతీకరించుటకు సర్వథా సమర్థము. ఎందరెందరెన్ని కావ్యలక్షణములు చెప్పినను, పైవచనములకు కాదను లాక్షణికు లుండరు. కవులుండరు. సహృదయు లుండరు. విమర్శకు లుండరు. హృదయస్పందన చేయఁజాలని కావ్యము-తంత్రులు తెగిన వీణియ రంధ్రములు మూసిన వేణువు. లావణ్య శూన్యమగు లాసకి. అనఁగా వికలత-విలుప్త-విశూన్యతలు మూఁడును ఫల విషయమున సమానములే యనుట. వైకల్య-లోప-శూన్యతలు పొసగకుండ వస్తు నిర్మాణముగావించుట కవిధర్మము. అట్టినిర్మాణము నిగళిత వేద్యాంతరమగు సలక్షితజాగృతిపైననే యాధారపడి యుండును. ఆజాగృతి ప్రాభిజ్ఞాని కరములోని కల్పవృక్షము. అది శక్తియను నాలవాలమున ముద్భవించి, సంయమన మను నాలంబనము నంటికొనలు పాగుచుండును. ఈ సూత్రమును పురస్కరించుకొనియే పెద్దలు కవిని ఋషి యనిరి. "నా నృషిః కురుతే కావ్యమ్" యనియును సుదారముగ నుద్ఘోషించిరి.

అట్టిజాగృతి నివాతదీపమువలె వెలుఁగొందుచున్నచో కావ్యము సచేతనమై సచేతస్స్పందనము చేయఁగలదు. లేనిచో లేదు. కాని యది ప్రతికవికిని సొంతసొమ్ము కాదు. అది జన్మాంతరసంస్కారలభ్యము. సముదాత్తపుణ్యఫలము. అదియే సుకవిత్వమునకు మూలబీజము. అదియున్ననాఁడు పురుషకార మెంతయైన రాణించును. సద్బీజవంతుఁడగు హాలికుని సత్క్షేత్రకృషి సమగ్రఫలము నందించుటయు, శ్రోతృహృదయసంతృప్తిని జేకూర్చుటయు సహజాదృష్టమే కదా !

అస్థితి యప్రవ్యక్తమైన వాఁడు తపాయోపేయములకు నైక్య ముండదు. కనుకనే యధికవ్యుత్పన్నులను కొందఱు రచయితల రచనలు మందకొడిగ నుండుటయు, నంతగా ననుకొనబడని కొంతమంది రచనలు జీవసత్వములతో పాఠకహృదయక్షేత్రములపై లంఘింపఁగల జాంఘికతనొప్పారుటయు తటస్థించుచున్నది. ఈ రహస్యము నిష్పక్షపాతులగు సహృదయులకు సార్వత్రిక సత్యము. కావుననే యాయుదారాశయులు సజీవకావ్యముల నాలోకించినపుడు పరవశులై యానందింతురు. తత్కర్తలకు గజోత్సవములు గావింపవలెననియు, కనకాభిషేకములు చేయింపవలెననియు నుబ్బూతలూగుదురు. సపక్షపాతులగు సహృదయులకు కిది యేకాంతసత్యము. పాపము వారు తదానందమును బహిర్గతము చేయఁజాలరు ఏలకో లోలోన గ్రుక్కుకొందురు. ప్రారబ్ధములోని వైచిత్ర్యమన్న నిట్టిదే. అస్తు. ప్రకృతము ననుసరింతము.

ఈ ప్రసన్నకవిగారి ప్రముఖరచనలలో నీ పృథ్వీభాగవతము రెండవ కావ్యము. మొదటిది మధుమానము. కవిగారి కోర్కెను పురస్కరించుకొని ఈ రెండింటిని ప్రథమమున నాపాతముగఁ జదివితిని. పిమ్మట వారి కోర్కెని పురస్కరించుకొని యామూలచూడము పఠించిని చదువునపుడు కవివ్యుత్పన్నతను పరిశీలింపు తలంపు నా మనస్సున గల్గినది. చదువుచుండ నదేదో యొక శక్తి నా మనోగతిని విరోధించి దాని కానందపరివేషము నల్లసాగినది. పరిశీలనదృష్టి పరాస్తమైనది అటనట పెదవివిరువబోగా నది కొరుకుడు బడినది. నరసత్వము వ్యేత్తుగా నలిముకొని తల యూపించినది. అంతర్వాణి యిది రసవత్కావ్యము. సత్కావ్య మనిపదేపదే పలికినది. ఇట్టి సమ్మోహన వాసనారహస్యమే కావ్యమున కుండవలసిన ప్రాణధర్మమని లాక్షణిక వాక్కుల యుద్ఘోషలు వినిపించినవి. అంత "గుణాః పూజాస్థానం - గుణిషు నచ లింగం నచవయః" యను ప్రాక్తన కరుణకవి సందేశము సాక్షాత్కరించినది. ఈ పృథ్వీభాగవతమున రసవత్కావ్య ప్రాణధర్మము క్షీరనవనీతన్యాయమున నభివ్యక్తమై యలరారుచున్నదని పదేపదే యనుభవమునకు రా సాగినది కనుకనే యీ పృథ్వీభాగవతము మహాకావ్యమనియు కావ్యకర్త మహాకవియనియు నిశ్చయించి యీ 'సత్యసూక్తి'ని సహృదయ సమక్షమునందుంచుటకు సంకల్పించితిని.

ఇందలి కథ చారిత్రకము. చరిత్రనుండి యీ కథారేఖను గైకొని యీ తత్కవి ప్రసన్నదృష్టిలో తన మనీషకుఁదోచిన రసపుంజమలిచి యీ కావ్యమును సంతరించినాఁడు. తన కవనరమణితోచిన వర్ణనల నాక్రమించి యీ కావ్యసుందరిని చిత్రించినాఁడు. అవి-ఇవి యెంతవరకు సముచితములు? రచనరీతి యెట్టిది?

మడికారపుమాట యేమి? కావ్యాంగములెల్ల నిట నెంతవఱకు నిర్వ్యూఢములు? ఆత్మధర్మ మెట్లున్నది? ఇత్యాది విషయముల మాత్రము స్థాలీపులాక న్యాయమున స్పృశించుటయే యిట నా కర్తవ్యము.

## చారిత్రక కథ :

భారతదేశపు టుత్తరభాగము వీరవరులకు కాణాచి. అందుఁ జనప్రఖ్యులు సానఁదీరిన జాతిరత్నములు. వానిలో పృథ్వీరాజొక సముజ్జ్వలవజ్రము. ఢిల్లీ రాజధాని. కనోజీ (కాన్యకుబ్జ) నగరాధిపుఁడైన జయచంద్రునకుఁ బృథ్వీరాజనిన గిట్టదు. కాని జయచంద్రు నేకైక పుత్రిక సంయుక్త యీ ఢిల్లీ నాయకుని వలచినది. అతఁడును నీమెను ప్రేమించినాఁడు.

సంయుక్త నెచ్చెలి 'చిత్ర'. ఈమె సార్థకనామధేయ. మౌనివేషముఁ దాల్చి యశ్వము నధిష్ఠించి మృగయావిహార తత్పరుఁడైన పృథ్వీరాజును కానలోఁ గలిసినది. సంభాషణ సాగించి, యాతనికి సంయుక్తపై గల ప్రగాఢ ప్రేమను గ్రహించినది. మఱలివచ్చి సంయుక్తకు సర్వము వివరించి యామెను సంతసిల్లఁ జేసినది.

జయచంద్రుఁడు పుత్రికకు వివాహముఁ జేయఁబూని స్వయంవరము సాటినాఁడు. రాజులెల్ల రేతెంచిరి. పృథ్వీరాజు నవమానింపు తలంపుతో నాఁటి ప్రతికృతి ద్వారము కడ నుంపఁబడెను. స్వయంవరము సాగినది. చివఱకు స్వయం వరదామము ప్రతిమకంఠమునే కైసేసినది. రాజు లేగిరి. అప్పటి పితాపుత్రికలు హర్షశోక ప్రహ్లాదులు. ఫలితము సంయుక్తను కృష్ణజన్మస్థానము. అది పృథ్వీభాగవతము కొంతసార్థకత సాధించినది.

స్వయంవర వృత్తాంతమెల్ల పృథ్వీరాజు చెవిఁజేరినది విసిగి వేసారి విలపించి - విలపించి కారాగారముననే యాత్మార్పణకు సన్నద్ధయైన సంయుక్త రుక్మిణీ కళ్యాణపురీతితో ఢిల్లీచేరి మహారాణియైనది.

పుత్రికాపహరణమునకుఁ గుపితుఁడైన జయచంద్రుఁడు స్వయముగ సాధింపలేక పృథ్వీరాజుచే పూర్వ మేడు మాఱు లోడింపఁబడిన మహమ్మదు ఘోరీని పురికొల్పినాఁడు. ఇట్లు కలిసిన యీ యుభయుల సైన్యములు పృథ్వీరాజును బంధించినవి.

పృథ్వీరాజు నొద్ద ఆస్థానకవి చాంద్‌భట్టు. తమరాజును రక్షింపనెంచి యాతఁడు ఫకీరువేషమున ఘోరీని సమీపించినాఁడు. ఢిల్లీపతి శరవిద్యానైపుణ్యమును వీక్షించి యానందించుఁడని యుద్బోధించినాఁడు. సప్తఘట భేదన విద్యాప్రదర్శనకై తవమున చెఱసాలనుండి పృథ్వీరాజును సభకురప్పించి ధనుర్బాణము చేతికప్పించి సంజ్ఞ చేసినాఁడు. ఆసప్త ఘటములతో సహా ఘోరీ శీర్షము సైతము నొక్క వ్రేటుననే డుల్లినది. మహమ్మదీయుల శత్రుస్పర్శ దోషము నంటకమునుపే యాతని యాత్మశస్త్రము పృథ్వీరాజును స్వర్గసీమకుఁ జేర్చినది. ఆవార్తవినిన సంయుక్త శయ్యనుండియే సహధర్మచారిణియై పతి ననుగమించినది. ఢిల్లీ రాజ్యము మహమ్మదీయుల వశమైనది.

ఆ యపూర్వ కృతజ్ఞులు ఘోరీ మరణమునకు యుద్ధము పురికొల్పిన జయచంద్రుఁడే కారకుడని యెంచి యాతనిని సైత మంత మొందింప నాయత్తులైరి. ఆవార్త విన్న జయచంద్రుఁడు లజ్జతోఁ దాను మాతృదేశమును మహమ్మదీయుల పాలు జేసినందుకు పశ్చాత్తాపమునందును గంగలోఁబడి మరణించినాఁడు. ఇదియే చారిత్రక వస్తువు.

కవి సృష్టి :

సముద్యద్యౌవనయగు సంయుక్త నుద్యానవనవిహారమునకు చెలులు తోడ్కొని పోవు ఘట్టము స్వయంవరస్కంధమున ప్రత్యేకముగ కవిప్రతిభోల్లిఖితము. సముచిత కల్పనము. పూర్వానురాగ విప్రలంభదశలో కాలయాపనమును, కామశాంతిని ప్రయోజనములుగా నెంచి యుపవనవిహారము ప్రాగ్వమరీతి పూర్వకవుల యనూచానపద్ధతి మఱియు మహాకావ్య లక్షణములలో నొకటి. ఇట్టి యీ విహారమును రంగభూమిగాఁ జేసికొని యీ కవి లేఖినీశక్తి యెట సాధించిన భంగిమములు పెక్కులు. వీనిమూలమున కథకు వింతసోయగము చేకూరినది. వాకోవాక్యచాతురి ముద్దులొల్కినది. మధురాధరల చేష్టావిలాస వైభవములు కన్నులకు కట్టినవి. స్మరసంతాప పరితప్త హృదయ యగు నాయిక మౌగ్ధ్యదౌర్బల్యములపై దుష్య పతిశీలాదు లిందు సరసముగా దూషణ భూషణములద్వారా గోచరింపఁ జేయఁబడినవి. పలుకుబడిలోని మార్దవము తెల్లమైనది.

మధుమాసధర్మ మువ్వెత్తుగా నలముకొనియున్న ఆయుపవనమున శుకపికాదులసందడి యధికముగ నుంటయుఁ దన్మూలమున నా నవవిరహోత్కంఠిత హృదయ మద్దీప్తమై భరింపరాకుండుటయు తెలుపుచు నా మధురవాణి యుల్లసిల్లును.

"కోకిలా! యూరక కూసెద వేటికే యిగురాకు మేతకే యింత పొగరు?
జుమ్ముజుమ్మన యింత శ్రుతి యేటికే తేఁటి? యేలచిచ్చుపు కూటి కింత బిగువు?
ఇరుకులాడైన వేళ మీకింత చెలిమి? వలపు చవులూర చిలుక గోర్వంకలార?"

ఈ సుకుమార దూషణరీతి ప్రకృతిలోని నైజతత్త్వమును వెలార్చుచు వ్యక్తి హృదయములోని క్షోభమును స్ఫురింపఁ జేయుచున్నది. ఇంతియేగాక "ఇరుకులా ..... లార" అన్న పాదముల కవిహృదయములోని క్షోభము సైతము కమనీయముగ ధ్వనించిపోవుచున్నది. సమర్థుఁడగు కవి యిట్లే తన మనోబాధలను వెలయించుచు నుపదేశముల నొసంగును. ఇటనాతిర్యక్కులను జూచియైన కులకల్లోలముల మాని చెలిమితో కలిమిని సాధింపుఁ డని ఈ ప్రసన్న కవి హార్దముటగ వచించుట కమనీయము.

"చలువ వెన్నెలలోనె మంటలను రేఁగి
చంపు చున్నాఁడు పాంథులఁ జందమామ
మేనమామయ్య బాలె ప్రసూనబాణ!
వచ్చినది నీకు జగమిఁకే వలన బ్రతుకు?"

పైదూషణరీతి వేఱు. ఈ పద్యములోని దూషణ రీతి వేఱు. చంద్రుఁడు పైకి చల్లగఁ గన్పించుచునే విగూఢముగ బాధించు చుండెనఁట. అతని మేనల్లుఁడును అట్లే చేయుచున్నాడట ఆ కైతవాపకృతి "ప్రసూనబాణ!" అను పదము చేతనే ఇట సూచింపఁబడినది. పైకి చల్లని సుకుమార సుమములనే బాణములుగ ప్రయోగించు చున్నాడు. ఇదియే మన్మథుని మోసము. చేయఁదలచిన యుపకృతినో! యపకృతినో యథాతథముగ చేయకఁ అంతరుష్టం బహిశ్శీతమ్మను వర్తతి దుర్జన లక్షణము ప్రమాదకరము మేనమామ బాలువచ్చుట లోకసహజమే, ఇట్లే కవివాగ్వైఖరి కావ్యధర్మమును లోకధర్మమును విశదీకరించుచుండును.

కేవలదూషణము కార్యకారి కాదని యనుభవమునఁ దలంచినాఁడో యా ఆయువుల భేదోపాయమున కార్యసాధన కిట్లు కడంగినది.

"జగమాతలెలెడి నల్లని చల్లనయ్య ముద్దుపట్టని మృదువైన పుష్పబాణ!
విషముతోఁ బుట్టినట్టి యావిధుని తోడ చెలిమియా నీకు?, అని.

ఈ పద్యములోని మాధురి యనందము. నాయిక విరహవేదనావైక్లబ్యమును బహువిధంగులతో సుకుమారముగ వెలయించు శక్తి యీకవిలోనిది కపూర్వము.

ఇందలి మధుకరదూషణ మతిమధురమ్మై. కావ్యనామమును సాధింపఁ జాలినదై, సాగింపఁబడినది, ఒకమచ్చు.

"తిరిగుదే నీకు లేకున్న భ్రమరరాజ!
మురళి కృష్ణునితో నిన్ను బోల్పవచ్చు
నీ కుసుమ విహారమును నీ నీలిమేయిని
నీ మధుర ఝంకృతిని బట్టి నిక్కముగ"

ఈ సానునయ హితోపదేశము [illegible]రవము ఒక్కదోషముచే బహుగుణములు గణనకురాక కాలగర్భమునఁ గలసిన యాస్త్రిని గూర్చిన కవియార్తి యిం దొకించుక వ్యక్తమగుచున్నది.

"ఈ వనబృందావని యీ పూవులు గోపికలు నీవుపానరుచిమధురా
రావము వేణువినాదము మీవును మరందకృష్ణుఁడవె యళీ!"

ఆ భాగవతమున ఆర్తలగు గోపికలు అళిని కృష్ణదూతగా భావింపగా నిట నీ విరహార్త యళిని కృష్ణుండవనియే సమర్థించుచుఁబొగడినది. అళిల కనర్థములు బాపుకొనుట కనునయము మించిన యా యుపమయుండదు. ఇందలి సాదృశ్యభావన కావ్యనామమును సమర్థించినది. ఒకేమార్గమున పెక్కు ప్రయోజనముల సాధించు జాగృతి యిక్కవిసొమ్ము.

"ఈ పూలవాహ్యాళి యేలీల ప్రాప్తించె . ...
రంగులవికసించి రమ్మనునొకపువ్వు సురభిళించియొక్క సుమమువిలాసు....
జపములేమిపల్కి జమ్మించితివో భృంగ! పూలతోనె నీకు ప్రొద్దుపోవు"

మధుకరమును గూర్చిన యీ సాధువాదము ఈ కాంతా.కవులకు ప్రకృతి యందుగల యత్యంతాభిరుచిని ప్రకటించుచున్నది ఈకవి ప్రకృతిసౌందర్యాభిమాని లలితకళోపాసకుఁడు.

కాంతల విలాస చేష్టలలోని సౌకుమార్యమును, పద్యములలోని సోయగమును నొకించుక చూతము.

“అన్యథా శరణం నాస్తి త్వమేవ శరణం మమ” అని యనిపించుకొనును. ఆ
వి తన నైజమూర్తిని జూపి మఱింత వైచిత్రిని చేకూర్చు . తాఁజేసిన
(తలను, సాధించిన కార్యములను క్రమముగ వినిపించి విశేషవిచి  త భావహిల్లో
యము. ఈ రీతిగ నాయికయగు సంయుక్త హృదయమునకును, సామాజికుల
స్వాంతములకును, వైచిత్రిని చేకూర్చిన చిత్ర సర్వవిధముల చిత్రమే. ఇట్టి చిత్ర
చిత్ర రచనాతత్పరయగు నాయికతోఁ జేసిన సంభాషణమేగాన ఈ ప్రబంధము
సత్యముగ చిత్రప్రబంధమే. ఇట్టి సంకల్పముతోఁడనే రచయిత తన రచనను
సార్థకముగ సర్వత్ర సాగించినట్లు తోచెడిని.

ధర్మపరాయణులు, ధర్మప్రవక్తలు, ధర్మమూర్తులు నగుమునులు
సద్ధర్మముల సాధువాదము సేయుచు సంభాషించుట పరిపాటి. తమవక్తవ్యాంశము
నెడ కర్తవ్యాంశము నెడ నెదుటివారికి విశ్వాసము కల్గించుటకై నారదాదులట్లు
సాధువాదపూర్వకముగా-అనఁగా నెదుటివారిని పొగడుచు సంభాషించుట సుపరి
చితమే కదా! అట్లే యిట చిత్రమౌనియగు చిత్ర ప్రప్రథమున భారత సాధ్వీమణుల
సంకీర్తనము సేయుట యెంతేని సందర్భసముచితమును, సహజముగనే పతి
వ్రతయు, దృఢదీక్షావతియు నగు సంయుక్తను మఱింతగా తద్గుణములయెడ
ప్రతిష్ఠించుటకు సాధనమును నై యీకా  మునకు విశుద్ధశోభను జేకూర్చినది.
స్వకృతకార్యమును నైతము స్మరణకుఁదె  టచిత్త విస్మృతికిని ఆత్మతృప్తికిని
హేతువై భావిఫలసిద్ధియెడ విశ్వాసము నొద ంచును. ఈయుద్దేశ మీ కల్పనయం
దవల్పము.

ఆ వేషమునకు, ఆ సందర్భమునకు తగువుగా “బాలా! నే సాధువికాగ్ని
ద్యోతనుఁడఁ గుతూహలమున నూతన రుక్మిణీ రమాకృష్ణ స్పృహరులకు సన్ని
హిత మొనర్పఁ జరింతున్” అని తననామ మడిగిన సంయుక్తకు చిత్ర సమాధా
నించిన రీతి నాయికానాయకుల యుత్కర్షను బోషించుచు కాఁగల కాంతాపహర
ణము సముచితమే యని సమర్థించుచు భావికార్యపరిణామమును సూచింపఁజాల
నది. మఱియు కావ్యనామమును సమర్థించినది. ఇట్లే యీ సత్కవి కల్పన మెచ్చుటను
వట్టిపోకసాంద్రమై, స్నిగ్ధమైయుండుట సంస్తవనీయము. తాఁ గల్పించిన కల్ప
నము, మలచిన మలపు నెల్ల కథావైచిత్రికిని, పాత్రల విశిష్టతకును రసపుష్టికిని
సాధనము కావించుటకంటె నన్యభూషణమును కావ్యకన్యకకు కవి వేఱొండు
కావించుట కష్టము.

మృగయా విహారతత్పరుఁడై యున్న నాయకుని వాలకమును ధాత్రీస్తిమితలోచనాదులద్వారా గమనించియు, నా యాఖేటకములోని జంకుఁగొంకులను, సంకోచవ్యాకోచములను నుత్ప్రేక్షించియు "అధిప! జోహరు లెక్కిన హయముపైనె యాతప మ్మేలా! యందుకు హేతు వేమొ? ." అని ప్రశ్నించిన చిత్రధోరణి శుచిముఖిధోరణి నధిగమించినది. "స్వధర్మ నిర్వహణార్థముగాని, కాలక్షేపార్థముగాని తాఁ గావించు మృగయలోనైతము విరహిహృదయములోని వైలక్ష్య-వైలక్షణ్యము లనపాయములు" అను కాముక మన స్తత్వము నీకవి "శ్యామా స్వంగం చకితహరిణీ ప్రేక్షణే దృష్టిపాతం గండచ్ఛాయాం శశిని శిఖినాం బర్హభారేషు కేశాన్" అని పల్కించిన కవికులగురుని రీతిగా నాయకుని ముఖముననే "కన్నె జంపుకురులందున్న"ననెను... ఇత్యాదిగా పల్కించినరీతి కావ్యకళాసౌందర్యమున కెంతేని సాధనము. నాయకుఁడు తనతో నన్నట్లు చిత్ర యేకాంతమువఁగాంతతో వచించిన కథాకథన వైఖరియు మిక్కిలి మనోజ్ఞమే.

అప్పట్టుననే రాజా రసార్ద్రచిత్తమును గుర్తించిన చిత్ర తన సముద్ద్యోతనోన్మేషస్ఫుర ద్భ్రూపమును జూపి రాజాపై తనవలపు నొలగబోయుటయు, ఈ మిధ్యావయాధిని కాపత్యప్రవరుఁడు తన మనోనిశ్చయమును జెప్పుటయు, మిక్కిలి హృదయంగమములు. శూర్పణఖమూలమున రామహృదయములోని యేకపత్నీరతిని నిర్మథించి చూపిన యాకవి చిత్రమూలమున పృథ్వీరాజ హృదయశుద్ధిని ప్రకటించి నాయకుని సుగుణమునకును, సుదాత్రియగు చిత్రలోని జాణతనమునకును విశేషోత్కర్షను సాధించినాఁడు. సన్నివేశ మర్మజ్ఞులగు సహృదయుల కీసన్నివేశము మిక్కిలి ప్రశంస్యము.

చిత్ర చాతుర్యమునేగాని చారుత్వము నిట వర్ణింపఁ బనిలేదు. కాని యింత సాధింపనున్న చిత్ర మూర్తి యెట్టిది? అంతటి యతిలోకసుందరి యగు సంయుక్త సఖిత్వమున కనురూపయేనా? యను కొండకపారకసంశయమును.

"దేవతా కాంతవె నీవు తీపులాడి?
నీవు విద్యుల్లతాంగివే నీరజాక్షి?
ఈవని కుమారివే నీవు తీవెబోఁడి?
అద్భుత మ్మగుచుండె నిన్నరయుచుండ" అను నీ పద్యము తీర్చివైచినది. అందును నీ నాయకుని ముఖముననే పల్కించుటలో చిత్ర సౌందర్యసందోహము సూత్రప్రాయముగ వర్ణింపఁబడినది. అడుగడుగున కవియొక్క సముచిత సంయమనము జాగృతియు నిర్వాహ్యమున గోచరించుట గుర్తింపదగిన విషయము.

## 11

పృథ్వీరాజు బాహ్యసౌందర్యమును మాత్రము వినియు, చిత్రములం జూచియు, 'కన్యా వరయతే రూపం' మ్మన్నరీతిగ వలచిన సంయుక్త కప్రత్యక్షమైన రాజహృదయ మప్రత్యక్షమే "రాజానో బహువల్లభాః, రత్నహారీతుపార్థివః" అను నానుడుల మూలమున "తన మనోదయితునకు బహుకాంతాభిరతియుండ" దని చదువుకొన్న సంయుక్త తలంప వీలులేదు. అట్టి శంకయు మా స్త్రీహృదయమున నుండనేయుండును. కాని యది ప్రణయోల్బణతచే విహితము. విహితమైన వస్తువు విధానావసరమున గోచరింపవచ్చును. అది సర్వబంధుపరిత్యాగ పూర్వకముగ కల్యాణసిద్ధికి కాంక్షించు కామిని కామకళకు కళంకము. అనగా వివాహగతి స్థాయికి విరోధియనుట దాని నీకవి చిత్రచేసిన పరీక్షద్వారా తొలగించి, నాయికాలంబనమగు రతిస్థాయిని నిష్కళంకముగ పోషించుట లక్షణజ్ఞులు విశేషముగ గుర్తింపదగిన విషయము.

అట్లు రాజహృదయశుద్ధిని, సంయుక్తపైగల ప్రణయసిద్ధిని గుర్తించిన చిత్ర సంయుక్తతో,

"అనుకొన్న యన్ని పనులా
యెను, శ్రమదీతె, విశ్రవేష మేలా తుదము
ట్టిన నాటకమున? కైపో
యిన పెండిలికి మటిమేళమేలా?" ..... యనిపల్కినపలుకు లుచితముగా మధులిహప్రాయులగు నాయకుల దృఢప్రణయపరీక్షయే కళ్యాణ కావ్యమునకును, తద్భవసిద్ధికిని, మకుట మని తెల్పెడిని.

"సఖులను రక్షింపలేని సఖ్యంబేలా?" యని కవి చిత్ర కావించిన కార్యములోని సాహసమును సమర్థించుచు, సఖ్యధర్మమును చాటినాడు. ఇట్లీ స్కంధము ప్రతి సన్నివేశభవ్యము.

ఇక స్వయంవరస్కంధ మంతయు కవికల్పితమే యనవలయును. ఏలయన చరిత్ర "స్వయంవరము జరిగెను. సంయుక్త పృథ్వీరాజు ప్రతిమ కంఠమునందే పూమాల వేసినది. క్రుద్ధుడైన తండ్రి పుత్రికి కారాగారశిక్ష విధించెను" అనిమాత్రమే చెప్పును. ఇందు విస్తరింపబడిన స్వయంవర చిత్రణము, అందలిరాజుల వర్ణనము, పితాపుత్రికల సంభాషణము, మొదలగు విషయములెల్ల కల్పితములే.

స్వయంవర మంటప మలంకరింపఁబడియుండెను. సమాగతులగు రాజులెల్ల రాసీనులై యుండిరి. సభమట ముఖద్వారమున పృథ్వీరాజు ప్రతిమ నిల్పఁబడినది. అంతఃపురమున కాంతలు రాకుమారి నలంకరించి పెండ్లికళ దిద్దిరి. స్వయంవర సమయ మాసన్న మగుచుండెను. అమ్మహోత్సవావలోకన కుతూహలలగు కాంత లంతఃపురవాతాయనములనుండి స్వయంవరసభను తిలకించుచుండిరి. ప్రథమముననే వారికొక లంబోదరుఁడు ప్రత్యక్షమైనాఁడు. ఆ విస్మృత కృత్రిమముగా యౌవనలక్షణములను, సౌందర్యసంపదను, సంతరించుకొన్న కొందఱు గోచరించిరి. ఆ పైని పెక్కుదేశముల రాజులు కన్పించిరి. వారివారిని గూర్చియా యంతఃపురకాంతలు సరస-హాస-కుతూహలములపెలుచ సంభాషించు కొనుచుండిరి పేరుపెట్టి. వ్రేలజూపి గుర్తించుచుండిరి. అంత నృపకుమారికా గమనము సూచింపుచునొక పరిచారిక కాంస్యఘంట ప్రయోగించినది. రాజుల కాళులు గుబ్బటిల్లినవి. సంయుక్త సభాంగణమున వరణస్రజమును జేకొని సాక్షాత్కరించినది. జయచంద్రుఁడంతఁ గూఁతుఁగాంచి సభాభిముఖుఁడై వినతిగావించినాఁడు. వెంటనే రాజుల పరిచయము చేయుటకై చిత్ర సంయుక్తననుగమించుచుఁ దన బాధ్యతను నిర్వహించినది. ఇది ఇందు చిత్రింపఁబడిన స్వయంవరోత్సవ నిర్వహణరీతి.

ప్రథమముననే లంబోదరవర్ణనము సరసహాస్యముతో నుపక్రమింపఁబడుట మిక్కిలి సముచితము శుభస్కరము. హర్షదాయకము. "తుండము నేక దంతమును దొంపు వీపులు లేవుగాని.... . అతఁడచ్చ మామాతనయుండు గాఁడె" అని స్వయంవర కావ్యము నుపక్రమించుటలో కవి తన యుద్దేశమును "తెలిసియే ప్రవేశపెట్టితి రెలుక రవుతుసామి నహహ! యేసవికైనన్ దొలుతగ శాంభవి తనయుని తలఁచుకొనుట యార్యసంప్రదాయమె యవుగా" అని సూచించినాఁడు. కాఁగా ఈకావ్య నిర్మాణములోని విధాన మెల్ల విశృంఖలముగ సాగినదికాదు. నిర్యుక్తముగ నుద్దిష్టమైనదనియే యోచింపవలయునని నా యభిమతము. ఈ స్వయంవర వర్ణనములో శిల్పసాక్షాత్కారమున్నది. ఇది కవి శక్తి సంపదచేతను, క్రమవిధానముచేతను- గుదుకొనినది. అచేతనమగు స్వయంవర మంటపము కంటె యందలి చేతనప్రకృతులను, వారి వివిధ భంగిమములను విలక్షణముగ నంతఃపురకాంతల స్వచ్ఛందసంభాషణ మూలమున వర్ణించుటలో వస్తుసాక్షాత్కార మమందముగా నుద్భాసించినది. కవి పలుజాడల నెఱిఁగిన మాత్మకుఁడు. ఎచ్చట నేయొంపు నొంపవలెనో, యేమల్పు మలపవలెనో, యే పలుకు పల్కవలెనో! గుర్తించిన కళాతపస్వి, కావుననే యీకావ్య కథావిధాన మెల్ల ప్రేలుమావరానిదై విలసిల్లినది.

పరిచారిక గంట ప్రయోగించుటయు, సంయుక్త చిత్రా సంయుక్తయై స్వయంవర మంటపప్రాంగణమున నిల్చుటయు, కన్యాపితయగు జయచంద్రుఁడు స్వయంవరాగతుల నుద్దేశించి.

> మెచ్చు ప్రియమ్మతో నిసుక వేసిన రాలక యుండునట్లు నా
> యిచ్చెనబొమ్మ వేడుకకు వచ్చిననన్ గృపసేయ నున్నయో
> సచ్చవి విల్తులార! హిమవత్కరులార! వసంతులార! పెం
> పెచ్చిన మీ చరిత్రలకి వే వికసించిన నా సుమాంజలుల్''

చూడుఁడీ ధోరణులు :

ఇత్యాదిగా పల్కుటయు ఔచితిని పోషించుచు హృదయంగమముగ నున్నవి. జయచంద్రుఁడు రాజులనుద్దేశించి చేసిన వినతివచనములు కన్యాపితకుండ వలసిన విధేయతనేగాక శాల్యవాదిలక్షణమున కాదర్శము లనకతప్పదు.

పిమ్మట చిత్ర యపరసునందవోలె నీయలిన వేందుమతికి ఆయా రాజుల పరిచయము చేయురీతి కాళిదాసుని యడుగుజాడలలో నడచినను గ్రొం గ్రొత్తసోయగముల సంతరించుకొనుచునే సాగిపోయినది.

> ''అతఁడగాధ సత్వమగధాధిపుఁడో మధురాధరోష్ఠి! వి
> ఖ్యాతకళావ్యయాప్తుఁడు జగమ్మున నీ ధరణీశు ప్రోలధా
> త్రీ తరుణీశులెల్లరును రిక్కలు రిక్తలు వానిపొందు నీ
> చేతము సమ్మతింప వికసించుచు పుష్పమరందభోగముల్''

ఇట కళానిధిరూపుఁడు - రిక్కలు, - వికసించుచు - పుష్పమరంద భోగముల్. అను పదములు సాభిప్రాయములు. ఇచట విల్లు చెప్పి - చివర .. .... ఇనుని కొలకు వేచు వనజాత మిందుని నుతుల నేతిసుంత యొల్లనట్లు" అని సంయుక్తను గూర్చి చెప్పుటలో కవి జాగరూకత యెంత సునిశితమో సహృదయులు గమనింతురుగాక.

''అంగనృపాలుఁ డీతఁడు సురాంగన లీవప మోహనాంగు నాలింగన చుంబనక్రియకు లేఖలు వ్రాయుచునుందు రెప్పుడో! బంగరుబొమ్మ! .. ......" ఇత్యాదివిచిత్ర పరిచయవాక్యములు సౌముఖ్యవైముఖ్యములకు రెంటికిని సాదృశ్య

ముఱుఁగనే భాసించు చుండును, ఇట వ్రాయుచు నుండును. ఆమాట బాలరాజుపైనను, చిత్రపైనను సంయుక్త కీసడింపు నొదవించునవి. కాని వెంబడినే "... ఎవ్వడో! బంగరుబొమ్మ ....'' ఇత్యాదిశేషభాగ మా యీసడింపును దొలఁగింప జాలినది. ఇట్లుచిత్రసాభిప్రాయ మధుర సంభాషణక్రమము కవి సాధించిన క్రొత్త సోయగము.

"....సంధ్యను విప్రాతటవీతరంగలలితోద్యానోత్స వోల్లాసముల్"
"... సరిగనొండొరుఁ జేరె నానరవిజాక్షి హంసి పద్మాంతరము చేరునట్లదోఁప"
"స్రోతకర్దమా కొండలఁ దొలఁగిపాఱి వారిధిఁ జేర నేగు స్రవంతిభాతి''

ఇత్యాది మహాకవిభావములను సులలితరీతితో భావించి యాదరించుట యే తత్కావ్యకర్తకు కవి కులగురువుపై గల భక్తికి నిదర్శనము.

పుత్రా దిచ్ఛే త్పరాజయ మ్మను న్యాయమున జనకుఁడు పుత్రుని యతిశయము నపేక్షించు ధన్యుఁడు. పుత్రులకు ప్రేమనిధియగు ప్రత్యక్షదైవము. అట్టిదైవ మీ కవి కీకావ్యరచనా కాలమునకు పరోక్షత నందెను. మఱియు నాయన సుకవి. యశస్వి, రసజ్ఞుఁడు. నేఁడున్నచో నెంతయానందించునో! పాప మీ కవి కాభాగ్యములేదు "పుత్ర వత్సలు లగు పితరులు పరలోక గతులయ్యు పుత్రుల యభ్యుదయముఁ గాంచుదురు, ఆనందింతురు. వీరొసంగు నుపహారముల గ్రహింతురు." ఈ శాస్త్రవిశ్వాసము చొప్పుననే శుభకార్యములందు నాంది యేర్పడినది. ఈ శాస్త్రమర్యాదను పాటించుచునే గాఁబో పితృభక్తుఁడు స్వర్గతలమునుండి స్వయంవరమునకుఁ దండ్రిని రప్పించి తన కృతికన్యచేఁ బ్రణతు లర్పింపఁ జేసినాఁడు. ఎంతటియౌచితి! స్వయంవరస్కంధములోని యేబది యేడవ పద్యము నొకమారు భావింపుఁడు. ఈ పద్యము నద్దమువచ్చిన యశ్రువులఁ దుడుచుకొనుచునే ఈ కవి వ్రాసియుండును. తన కత్యంత భక్తి-వాత్సల్య విధానములైన జననీ-సోదరుల నైతము స్మరించి కొంత శాంతినందినాఁడు.

"విశ్వనాథవారి శాశ్వత భక్తుండు
రమణి! నీ స్వయంవరమ్ము నరయఁ
దరలి వచ్చువాఁడు తాత కావలె నీకు
మ్రొక్కు కొ మ్మభీష్ట భూపుఁడమరు'' అనుచు చిత్ర సంయుక్తకు చెప్పినట్లె తానును తన కృతిసుతకు చెప్పినాఁడు. ఆ మ్రొక్కుఫలితముగా సంయుక్త కభీష్టభూపుఁడు లభించినట్లె కృతికన్యకును సకల భూపసమ్మాన వీయుఁడగు

భూసురోత్తముఁడు పతియై ఫలించినాఁడు. పాపము "పీల కూర్పావేశ్య నూనర వెల్లి" యెవరో! నిష్ఫలములును కేవలమూర్ఖజన సహజములును నగు నీర్ష్యా ద్వేషముల మూలమున సుధామధురభాషిణియు ప్రసన్న హృదయయు నగు చిత్ర నోటనైతము పరుషవాక్కులఁ బల్కించినాఁడు. అస్తు.

ఆత్మశత్రువును వరించిన యాత్మజపై నాపాతమునఁ దండ్రి యుగ్రుఁడగుట, ఆపైని బుజ్జగించుట, కూఁతు సమాధానించుట మొదలగు ఘట్టము లెల్ల మిక్కిలి సముచితరీతితో నడచి యీ కావ్యశ్రీకి కనకాభరణములవలె నున్నవి. కాఁగా నీ స్వయంవరస్కంధమున కవి కావించిన సన్నివేశము లుదాత్తభావనా ఫలము లనుట నిర్వివాదము.



ప్రణయస్కంధమున జయచంద్రుని చేఁతకు పృథ్వీరాజు వెగడొంది "..దర్పమునై నవలీల సెచ్చెలిం దెచ్చెద భీష్మకాత్మజను దెచ్చిన నంద కుమారు కైవడిన్" అని కార్యనిశ్చయము చేసికొనుట, కారా నిబద్ధ యగు సంయుక్త దైవ ప్రార్థన సేయుట, కారాగారమునుండి తరలి పోవు నా ప్రణయ దంపతులకు చిత్ర జాతిపూదండ లొసంగుట, మొదలగు సన్నివేశములు ప్రణయ దీపదీప్తికిఁ స్నేహపూరములవలె నున్నవి.

ఉదాత్తుఁడగు నాయకుఁడు శత్రుకృతాపరాధమున " . గ్రీష్మములోఁ గిరికి గాలితోఁ ద్రవడిన" చందానప్రజ్వలించుట మిక్కిలి వీరత్వ ప్రోచిత లక్షణము. పౌరుషమున రుషను దీర్చుకొని కార్యము సాధింప నెంచుట నాయకునకు భూషణమే కదా!. అబలయగు కాంత తండ్రి చేఁతకు వగచుచు నాయన నేమియు ననవొల్లకే సంకల్పసిద్ధికై రుక్మిణివలె "అన్యథా శరణం నాస్తి త్వమేవ శరణం మమ" యని ప్రసన్న యగుట యామె యోగ్యతకు చిహ్నము. స్నేహమూర్తియగు చిత్ర సర్వసంవిధానమును గావించి, వేచియుండి, ఫలసిద్ధి కాలమున కలియవచ్చి మాలతీ మాలికలతో కళ్యాణము కావించి స్నేహార్ద్రనయనయై వీడ్కోలొసంగుట సఖీధర్మనిర్వహణకు పరసీమ. ఈ రీతిగా నీ స్కంధమునందలి సన్నివేశము లీకావ్యమునందలి ప్రధానపాత్రలగు పృథ్వీరాజ-సంయుక్తా-చిత్రల సుగుణోత్కర్షకు మూలములై ప్రణయరసమునకు ప్రాణములై తనరారుచున్నవి.

ఇది కేవలము 'ప్రణయ' స్కంధమే కాదు. పరికృష్టమగు నయ స్కంధమును, నగును. "ప్రశమాభరణం పరాక్రమః" అను న్యాయమున "....కృపతోఁ గనుమూయుచు నింతదాక సైరించుచు...." మన్న పృథ్వీరాజు

స మనోహారిని బంధించి యవమానించిన కారణమున "....ఇపుడన్న క్షత్త్రదర్ప లాహిత కాహారంబయ్యెడుగాక శాత్రవ చమూ ప్రాణానిల వ్రాతముల్" అని జృంభించుట యర్థాంగిపైఁగల ప్రకృష్ట ప్రేమ లక్షణమువలె సుక్షత్రియుని నయ ర్మలక్షణమును నగును. అస్వతంత్ర యగు నబల క్లిష్టసమయములఁ బాధను భరింపఁజాలక, వికలహృదయయై, యార్తయై. దైవమును నుతించి ఫలముగానక విలపించి విలపించి ప్రాణములు వీడ నుద్యమించుట ప్రగాఢ ప్రణయలక్షణమే కాదు. "ఉల్లము ఱక్కె నెవ్వగల కోటరి నే మరణంబు గోరినం జెల్లదె? .." యని పల్కిన క యమ్మ సీతమ్మ సిద్ధాంతము వెంట ప్రకృష్టనయమును నగును. విపుణయు - ను యునగు చిత్ర అప్పటి కవే కళ్యాణసంభారములని తలంచి" యెంత కాల డియో తన నెచ్చెలి కళ్యాణోత్సవదర్శనమునకై కనిపెట్టు కొనియున్న కన్నుల శాకళ్యాణము నంతమాత్రమున కావించి చూపుట, స్నేహా త్మకమగు నిండు ప్రణయలక్షణమే కాదు, త్కృష్ట నయలక్షణమును నగును, ఇట్టి ప్రణయస్నిగ్ధయు నీతిజ్ఞయు కనుకనే యా త్ర పుష్పమాలాలంకృతులగు నా దంపతులఁగాంచి. "నేఁ గదా కనంబడియె త్రములున్న ఫలంబు నేడెపో! పైఁడికి తావియబ్బినది...." ఇత్యాదిగా పొంగిపోయినది. మఱియు,

"ఒక లేశంబు పథంబు తప్పని ప్రపంచోద్దీ తార ప్రసి
ద్ధ కులోద్భూతవు కోరుకున్న విలసత్ క్ష్మాభ రించె మీ
యకలంకాన్వయకీర్తి మిన్నులొరయన్ ఖ్యా యింక రా
జకుమారీ! యనసూయవై; సుమతివై; సావి ; సీతవై"

"పగతుని భూములెవ్వి మగువా! తెలవాలుఁగనుండె మంచుఁగాఁ
దగ దిటఁ దప్పుకోవలయు దాయల మీసదిగన్న నుచ్చులోఁ
దగిలిన పావురమ్ముల విధమ్మగుఁ జల్లగ బోయిరందు."
ఇత్యాదిగా ధర్మనయబోధ కావించినది. కావున నీప్రబంధ మువయవిధముల నన్వర్థము. ప్రతి విషయస్నిగ్ధము.

సంయుక్త పురుషవేషము నూని ఖడ్గపాణియై తండ్రిని చేరి చేసిన ధర్మ ప్రబోధము. రణరంగమునకు జొచ్చి వీరావేశమున శత్రుసేనలఁ జెండు కత్తి నెత్తిన శత్రుకుమారకను ఖండించి తనపతిని కాపాడిన వీరకార్యము. యుద్ధ ప్రబోధము. వికలాంగుల సంభాషణము. అనునవి రణస్కంధమునందలి విశే ములు. వీనిలో మొదటివి రెండును కథానాయికయందలి యుత్తమ గుణములను ంపఁ జాలియున్నవి. రణజ్వాలలు పెల్లెగసి స్వపక్ష పరపక్షముల దహింప నాల్కలు

బాచు సమయమున రక్తపాతమునాపి. మాతృదేశరక్షణ సేయుటకై సంయుక్త యట్లు సాహసించి. వ్యామోహియైన తండ్రికి హితమును వచించుట యామె యున్నతాశయములను దెల్పుచున్నది. మాతృదేశభక్తిని జాటుచున్నది. అది యెల్ల నమ్మకాఁగా రణమును జొచ్చి. వీరపత్నియైన యా కాంత వీరవనితయై భర్తను ప్రమాదము నుండి కాపాడుట యామె రణకౌశల శౌర్యసాహసముల దెల్పెడివి. ఇట్లు పై రెండు సన్నివేశములును కావ్యనాయికకుపస్కారములై యొప్పినవి.

పితాపతుల కైకమత్యము చేకూర్చి. మాతృదేశము గాపాడ యత్నించిన యీకాంత తన ప్రథమయత్నము విఫలము కాఁగా చరమధర్మముగా పతిని రక్షించుకొన్నది. ఇంతకంటె తత్కాలమున కర్తవ్యాంతరము లేదు. తన మూలమున నుత్పన్నమైన యీ సంక్షోభము నాపుటకై సంయుక్త చేసిన యత్నము సర్వసమ్మతము. ప్రీతివంతము. ధర్మశాస్త్రము.

"ఏమి ప్రళయంబు మూడునో యెరుగరాదు!

పుణ్యమూర్తికి భారతభూమి కింక?" అని మాతృభూమి భవిష్యత్తుకై పడిన యారాటము.

"....పిభేదముల వచ్చి వికావిక లౌచు వ్యాఘ్రిచేఁబడి నశియించినట్టి వృషభంబులగాధ నెఱుంగలేవొకో!" అని స్వకులకలహము వినాశకరమని పొందిన సంతాపము.

"ఇంతకు నొక్కమాట వినుఁ దేఁ దమయల్లుచేత నీకు మ్రొక్కింతుఁ బ్రశస్తికి వెలిగింతుఁ బ్రభుత్వమెల్ల ధార వోయింతు సుఖంబునింతు పిత! యిప్పటికేవియు కమత్య మావంత వహింపుమయ్య పగవారికి గుండెలు కూలిపోయెడిన్" అని చేసి వినయ వివేక సాహసౌదార్యవంతమగు సంభాషణము.

"ఇంచుక భావభేదమున నే మెపుడేనియు నీకు నెగ్గు గావించినచో క్షమించుము క్షమించ ననర్హులమైతిమేని ..." ఇత్యాదిగా చేసికొన్న ప్రార్థనము.

"నీవున్ దానొక క్షత్రజాతి యొకక్షోణిన్ బుట్టిరే! యిర్వురన్
శైవుండెవ్వఁడు? వైష్ణవుండెవఁడు? పచ్ఛోరంబుతో నాతఁడే
నీపై యందఱు నొక్కకుండ కుడుపున్ మెక్కంగ సఖ్యంబుగన్
యావద్భారత మొక్క కేతనపుఁజాయన్ నిల్వఁ గొల్వందుమా! ...." అని పల్కిన శాంతి కాముకతయు నీ కథానాయిక కనర్ఘభూషణములై యాధునికాంగనల కుపదేశములై యలరారుచున్నవి.

క్షతగాత్రుల సంవాదము. హైందవుల యుద్ధప్రబోధములు రణ సముల్బణ తను వీరాగ్రేసరుల యుత్సాహ ధర్మదీక్షలను దెల్పుచు రసమునకును కథకును వైచిత్రిని చేకూర్చుచున్నవి. ఈరీతిగా కవి సమకూర్చిన యిందలి కూర్పులీ కావ్య కాంతకు రత్నభూషలై రాణించుచున్న వని పాఠకులకు వేఱుగఁ జెప్పఁబనిలేదు.

నిర్వాణస్కంధ మన్నివిధముల నద్భుతావహము. ఇందు చాందుభట్టు పాత్ర కీలకము. ఈ యాస్థానపండితుని మూలమున శత్రువులఁ జేఁజిక్కిన పృథ్వీరాజు విముక్తుఁడై శత్రువును బరిమార్చి, యాత్మార్పణము కావించుకొని విజయ వీర స్వర్గముల నందఁగల్గినాఁడు. వీర-రౌద్ర-భయానక బీభత్సరసముల యథాయోగ ముగా రణస్కంధమున ప్రదర్శించిన యాకవి నిర్వాణస్కంధమున నద్భుతరస మును బోషించి "కార్యో నిర్వహణే ద్భుతః" అను నియమమును పాటించినట్లు గోచరించెడిని.

తమచేఁ జిక్కిన పృథ్వీరాజును సంహరించి తమ కసిని తీర్చుకొను తీరు లకై తురుష్కులు యోచించుచుండ 'ఛాం'మ్మను ధ్వని వినిపించుటయు. అది క్రమముగా పికక్వాణ , వీణాలాపమై. వేణునాదమై. విలసిల్లుటయు. "... ఆహ్లాహో బిసిబి— ...." యంచు కాబూల్ భిక్షుకవేషమున చాందుభట్టు హఠాత్తుగా ఘోరీ యా నమునఁ బ్రవేశించుటయు మొదలగు రీతియెల్ల విస్మయ వితర్కముల దెచ్చించు ధకు చమత్కృతిని చేకూర్చినది. అప్పటి యా సన్ని వేశము భావికార్యసంభావన కందనిదై "ఎప్పుడేమిజరుగునో! ఏది యెట్లు మారునో!" అను నుత్కలికోద్వేగపూల పాఠకహృదయముల నాటగల్గి విస్మయ భావసిద్ధికే మార్గమై వెలసినది.

"ఆర్జవం హి కుటిలేషు న నీతిః" అను నీతి ననుసరించి వివేకియగు చాందుభట్టు తనప్రభునిచే శత్రుని చంపించినరీతి తత్కాలోచితమైన ధర్మమే యని పించినది. ఇందు చాందుభట్టు వ్యూహారచనాకౌశలము, పృథ్వీరాజు లోకోత్తర ధానుష్కత, ప్రతినాయకుఁడగు ఘోరీ మతిమాంద్యము, వ్యక్తము సేయఁబడినవి.

శత్రువులు జయచంద్రుని బంధించుయత్నముఁ దాఁ జేసిన దేశద్రోహమునకు ప్రతిఫలము సుగుణ యగు సుత చేసినహితమును పెడచెవిని బెట్టినందులకు ప్రాయ శ్చిత్తము. స్వపక్ష పరపక్ష విర్ధామథాములైన నాటిఖానుల కృతఘ్నతాస్వార్థము లకు పతాకము. అట్లు శత్రుసంభావితుఁడైన జయచంద్రుని యంత మన్యథాజరుగ నుండగ నాహైందవప్రభుని పశ్చాత్తాపమున విశుద్ధునిగావించి జాహ్నవీసేచనమున

స్వర్గముఁ జేర్చినరీతి కవియొక్క హైందవజాతి ధర్మప్రవణమైన అర్థాంతరాత్మను వెనోళ్ళఁజాటుచున్నది.

వెయ్యేల! యీనిర్యాణ స్కంధమందలి ప్రత్యంశమును కవితూచి, తలయూచి, చిత్రించినట్లే గోచరించుచున్నది. ఖానులు జయచంద్రుని సైతము శత్రువుగాభావించి బంధింపనుంకిలచుట, అప్పట్టున సైనసూర్యాస్తమయము, కుంభవృష్టి, జయచంద్రుని మనఃపరినామ పశ్చాత్తాపదైన్యములు, అన్నియు సందర్భసుందరములై కావ్యమునకు విచిత్రభూషలై రసమునకు పోషకములై చెన్నారినవి. ఈరీతిగా కవి కావించిన శిల్ప మనల్ప ప్రయోజనవంతమై యిట ఫలసల్లిన దనుట నిర్వివాదము.

మఱియు సమ్యగ్దృష్టితో పరిశీలించిన నీ కావ్యమునఁ బెక్కు రహస్యములు తోపఁగలవు.

మొదటి పద్యములో 'శ్రీమత్' అను పదముచే నాయికా నాయకుల కళ్యాణము, 'వీరరస' పదముచే నిందలి ప్రధానాంగరసము, 'ఉర్వీభార' అను శబ్దముచే నాయకుని రాజ్యభారధూర్వహతము వ్యోమాగ్రంబుల కెక్క.., అను మాటలచే నాయకాదుల వీరస్వర్గప్రాప్తియు 'దుర్జయజయ' శబ్దముచే నప్పటి పరిస్థితిలో నజేయుడై యున్న 'ఘోరీ'ని కడుసామర్థ్యముచేఁ గడితేర్చి నాయకుడు జయముఁగాంచుటయు, నిత్యాది కావ్యార్థసంపత్తి సూచితమైనది.

"వీరరస - ఉర్వీభార - రవిచంద్ర - రాజన్య - జయజయ - సుత్రామైశ్వర్య - వజ్రవైదూర్య" అను నీ మహార్థమంగళశబ్దము లీకావ్యారంభమున నిబద్ధములై కావ్యముఖమునకు సత్సంప్రదాయ పాటవమును జేకూర్చినవి. మఱియు ప్రస్తుత వస్తు రస నాయకుల కనుకూలములై యౌచితీసంవాదకములై యొప్పియున్నవి.

రెండవ పద్యమున మఱియొక విశేషము.

రవిచంద్ర వంశము లందుదయించిన రాజపుత్రు లంభోరుహ లోచనులిట, 'అంభోరుహ' పదము పద్మ- కైరవములకు రెంటికిని వర్తించును. పై రెండును రవిచంద్రులకు ప్రియములు. వారిని జూచి యివి వికసించును. వీని వికాసమువలన వారానందింతురు ఇట్టి చమత్కారవ్యక్తి.

'అంభోరుహలోచన' లగుటచేతనే 'భువనమోహను' లైరి.

"రూపమే వాస్యైత న్మహిమానం వ్యాచష్టే" అను శ్రుతిహితముగా ఆ దాస్వన్మూర్తులు దయామయులై ఆర్తరక్షణోదారు లగుట సముచితమేకదా! అట్లని శౌర్యహీనులు అనరాదు వారు 'శాత్రవ విదారణ దారుణశాతఖడ్గ శృంగారులు' ఈరీతిగా పూర్వోత్తర పదవిన్యాసములోని కార్యకారణ స్ఫురణము

పైనం జెప్పంబడిన గుణోదారులైన రాజు ఉదయించి 'ఈ భారతోర్వర'ను 'రత్నగర్భ'ను గావించిరంట. ఎంత సముచిత భావనమో! చూడుడు. 'ఉర్వరా సర్వసస్యాఢ్యా' ఈభూమి యాదినుండియు సర్వసస్యాఢ్యయైన యన్నపూర్ణ ఈ వీర రత్నములుదయించిన పిమ్మట 'రత్నగర్భ' యను సార్థకనామమును వహించినది. ఇట్టి యర్థవ్యక్తీకరణశక్తి.

"వాని విచ్చుకత్తి వాదరతళుకులో వెలుగుచుండు నాజి విజయలక్ష్మి
వాని సద్గుణమ్ము స్వార్థపూరితమౌచు, మోహరమున కెవుడు పొరలిపోదు"

అని ఒకే పద్యములో నాయకుని సాంయుగీనతా సంయమముల చెప్పుటలోని లాఘవము.

కార్యసిద్ధిని నిశ్చయించి కౌతుకమున నా మునివేషముననే చెంత జేరిన చిత్ర సంయుక్తను 'మధురాధరోష్ఠి' యని సంబోధించి శివుడు చేతులనెత్తి. యాశీర్వదించుటలోని మర్మస్ఫురణము. ఇత్యాది పద-పదార్థభావ వ్యక్తీకరణ శక్తులు భావుకహృదయమును ఆనంద కల్లోలితము గావింపంగలవని శబ్దబ్రహ్మవేత్తలు తలంపక తప్పదు.

## వర్ణనలు :

కథాగమనమున కర్గళములుగాని సముచిత సంగ్రహవర్ణనలు కావ్యసుందరికి చిత్రములైన రత్న రములు. ఏతద్విపరీతములు కవికల్పనా నైపుణ్యములకు నిదర్శనములు గావ నుగాని కథకును కావ్యమునకును పోషకములు గావు. ఈ మహాకవి అయావ ల గావించిన వర్ణనల ధోరణి నొకించుక చూతము.

రాజస్థాన విశిష్టత.

"ఓజన్ పంచమహానదుల్ కదలి దిగ్వ్యూహంబునఁ జుట్టిరా
నాచూకైన జిలుంగు ముత్యముల దండల్ దాల్చి నట్లున్న యా
రాజస్థాన పవిత్ర భూములు స్వతంత్ర స్వర్గ ఖండంబులై
రాజిల్లెన్ తొలిరాజనందన మహేంద్ర ప్రాభవాభ్యున్నతిన్"

దిగ్వ్యూహమును జుట్టి యుండుటచేతనే ముత్యములదండ లనదగెను. స్వర్గ ఖండము లగుటచేతనే మహేంద్ర ప్రాభవము నందినవి.

రాజపుత్రుల దయాశౌర్యధైర్యములు.

"శరణన్నఁ దయమాన మానసపురప్రాకారంబు గాఁ బెంత రు
ద్ధురతన్ గచ్చెకు డీలినఁ దలలు బంతుల్ సేసి క్రీడింతు రి
క్కారణిఁ నెయ్యము గయ్యముఁ నెఱపు దక్షత్వంబు వారుగ్గు బా
లరుచిన్ నేర్చిన దెక్కరాడిచట పాలాక్షుండు తొమ్మొడ్డినఁ"

వారునెయ్యమును గయ్యమును. నెఱపు విధానము విశిష్టముగ జెప్పి యే రచయితయు నూహింపనిరీతితో నమాంతముగ మిన్ను విరిగినట్లు "ఎక్కరాడిచట ఫాలాక్షుండు తొమ్మొడ్డినన్—" అని చతుర్థపాదమును పూరించిన కవి దిట్టతనమున కీచతుర్థపాదమే సాక్ష్యము.

సంయుక్త జనన శుభసమయము.

"... —ఆశుభమహోదయవేళఁ గనోజివీధులఁ
వెన్నెల వెల్లువైనది ద్రవించెను పృథ్వీహృదంత రాళముల్"

చంద్రుఁడుదయింప జ్యోత్స్నలాశలకుఁ బ్రాకి
కువలయానందమును గూర్చె గొనబు మీర
చాంద్రి యుదయింప శుభము లాశలకుఁ బ్రాకి
కువలయానందమును గూర్చె గొనబు మీర ..

సందర్భశుద్ధిగల యిట్టి ప్రసన్నధోరణి సుకుమార హృదయముల చందనాను లేపమువలెఁ జల్లపరుపఁజాలును.

ఆ సమయముననే తటస్థించిన వర్షర్తువు.

''ఏడువన్నెలశోభలీను నింద్రునివిల్లు గుదురుగాఁ గొప్పున గుస్తరించి

.... .... .... .... . .... .. .... .... ....

పుట్టిన నృపశిశువునికై పురిటినీళ్ళు
కనక కలశాలఁ గైకొని కదలివచ్చు
రాచపూఁబోండ్లకరణి వర్షర్తురాజ్ఞి
కడవలను బానలను గొని కదలివచ్చె"

రాచపూఁబోండ్లు పురిటినీళ్ళుతెచ్చు ఆచారము మాట యెట్లున్నను ఈ వర్షర్తు వర్ణనమమాత్ర మింపుగ నున్నది. వెంటనే శరదృతు వర్ణనమును ''బారసాల పండర్భానఁ బ్రభుకుమారి . .. సాంద్రచంద్రికల శరదృతురాజ్ఞి సాగివచ్చె" అని చెప్పుటలో కవి తలంపెట్టిదో! పురిటనీళ్లకు వర్షర్తువురాఁగా పన్నెండవనాఁటి బారసాలకు శరదృతు వెళ్లెతెంచినదో! శరదారంభమునకు పంద్రెండు రోజుల ముందు సంయుక్త పుట్టెనో! కారణాంతరమున బారసాలయే రెండు మాసములకు జరిగెనో? తెలియదు.

సంయుక్త పంద్రెండేండ్ల కౌమారమున.

"కనుపట్టు నొకవేళ బినుగు పుట్టంబుల
నృత్యించు పింఛంపు నెమిలివోలె
తల చూపు నొకవేళ ధవళదుకూలాన
నందంపు నడల రాయంచలోలె''

పదారేండ్ల పడుచు ప్రాయమున.

''కరఁగిన పదియాఱు కళలబంగరు వంటి
మేనికి మేల్మి క్రొమ్మిసిమి హెచ్చె
వసపమ్మ కనుమాటు వక్షోరుహము లూరి
యడుగుదమ్ములకుఁ గ్రొన్నడకవచ్చె''

కౌమారమున లభించిన నడకల పోల్కి నవయౌవనస్ఫూర్తిచేఁ గల్గిన నడకలకుఁ గానరాలేదు. లేజవ్వనుల విలాసగమనము లనుపము లనిగాఁబోలు కవి యూహ. 'క్రొన్నడ' లనిమాత్రమే విడచెను.

వలపు గొన్న సంయుక్త వనవిహారమున కేఁగుసమయమున కాసన్నమైన వసంత వర్ణనములోని క్రొత్త వింతను భావించుటకు.

"స్వర్గ సౌందర్య సంపత్తి జల్లెడపట్టి పుడమిపై మరుఁ దారఁబోయువేళ
యుగయుగావిర్భూత మొక దివ్యసంగీతఝరి లోకమున నుప్పు తిరుగువేళ
దేవకన్యల పెదవుల తీయదనము పూవుపూవున మధువుగాఁబొంగువేళ''

అను స్వరూపస్కంధములోని నలుబది యెనిమిదవ పద్యమును పఠింపుడు.

వనవిహారమునం దుద్దీపక విభావసంపదను భరింపజాలని వియుక్తయగు సంయుక్త దూషణభూషణాది వర్ణనములు పాత్రానుకూలములై సందర్భసముచితములై యిష్టానిష్ట ప్రాప్తి-పరిహార సాధనములై వెలసినవి

చంద్రోదయ వర్ణనములోని క్రొత్త సోయగము.

"దరులు దన్నుచుఁగన్న మరులున నుప్పొంగు
    పాలకడలికిఁ జుంబనము లొసంగి
వెడగాడ్పుఁ దుడుకుఁద్రోపుడులకు దొలఁకాడు
    ప్రతి తరంగము మీఁద బంతులాడి
    గగన మార్గానఁ బదియారు కళలతోడఁ
    జనుచు నున్నాఁడు పున్నమ పందమామ"

సమర బీభత్సము.

"పటపట పుఱ్ఱెలఁ బగిలిచి మెదడుల నెమకుచున్నవి సృగాలములగములు
వెలివడ్డప్రేవులఁ బొలుసుఁదపలకై తారుచున్నయవి గృధ్రములగుములు"

సూర్యాస్తమయము.

''అవనీ పాలకులెల్ల నీ కపటమంత్రాంగమునన్ జోరి మృ
త్యువుపాలై నశియించిపోయిరి కులద్రోహీ। కనోజీ మహీ
ధవ! ఛీ! నీ మొగ మింకఁ జూడననుచందం బొప్పఁగా లోకబాం
ధవు డస్తాద్రికిఁ జేరె నంబరమునన్ ధ్వాంతచ్ఛటల్ గ్రమ్మగన్''

ఇట్లీ కవి కావించిన వర్ణనము లెల్ల సంగ్రహములు, సముచితములు, రుచిరములు నవ్యములునై యీకావ్య సౌందర్యము నినుమడింపఁ జేయఁ జాలినది.

రచనా రీతి :

ఈ కావ్య శైలి లలితము. రచనయంతయు ద్రాక్షాపాక భూయిష్ఠముగనే సాగినది. భారతీవృత్తి భాసురముగ నంతట గోచరించుచున్నది, పదసంఘటన ప్రాయికముగ వైదర్భీ రీతిపరిక్లుప్తమై యొప్పియున్నది.

కావ్యమూర్తికి బహిరంగాంతరంగములగు శబ్దార్థముల యానురూప్యమును తెచ్చుటను లోటుపాటు గద్దు. రసభావోచితములగు శబ్దార్థగుణాలంకారములీ కవి లేఖినినుండి పుట్టిపెరుగుచున్నట్లు సహృదయులు తలంపక తప్పదు సాభిప్రాయ విశేషణములతో; ప్రాతక్రొత్త పలుకుబడులతో; కవి పరంపరాగత జాతీయములతో; వక్రోక్తి - ఛేకోక్తి - సమాసోక్తి - పర్యాయోక్తి సంభరిత సంభాషణల సౌష్ఠవముతో; సూక్తులతో; సుభాషితములతో రసోల్లసితమైన యీ కావ్యము పానక రసన్యాయమున నాస్వాద్యమై యలరారుచున్నది.

ఇటు చూడుడు శైలి.

"రాణ సెలంగ దిగ్గజ పరంపరఁ జాచు[illegible] సాగుపంచక
ల్యాణులమీద విక్రమవిలాస విహారము లొప్ప ... "
"అంతక దూతలైన యవులారా! విహంగములార! పాంథులన్
వంతల పెట్టి పట్టిన ననంగుఁడనంగుడె మీరు మీరలే "

ద్రాక్షాపాకపుపుచి - భారతీవృత్తి సంపద.

"అసమాపేత యౌవన సుహాసము నాభువనైక మోహనో
ల్లాసము నా తనూనవ విలాసము నా సువిశాలదృష్టివి
న్యాసముఁగన్నులారగను చావనుధేళుల చేష్ట లెల్లనుం
బాసి తదాసనాలప్రతిమ ప్రతిమానముగాగఁ దోపఁగన్"

వైదర్భీ రీతిగతి - ప్రసాద - సమతార్థ వ్యక్తుల యభివ్యక్తి.

"సింగపురీవి బంగరు రుచిన్ ప్రసరించెడు మేను తమ్మి పూ
లం గికురించు కన్నవ బలమ్మగువక్షము నాగరాజుగా
పొంగులు వాఱుశ్రోత్రము, శుభోదయి! నీ నునుకౌఁగిలింతకో
నంగులు దేఱు నా సుమశరాంగుని నీవు పరిగ్రహించినన్"

నడకలోని యూగు తూగులు.

"ఆకర్ణనిబిడ నేత్రాంత రక్తచ్ఛాయ
పరిక్రొత్త పంజకెం జాయగాయ
శత్రువక్షశ్శిలాశాణితా సిక్రేకి
కొదమచుక్కల తప్పు గుస్తరింప ..."

మితవాక్కులలో నమితార్థపు నిమిడిక.

"కలనైనం బతిభక్తి నేమరకు మకాక్కార్యానవే యుక్కు నె
న్గల తాళింపుల వంట, కాలుని యెకందన్ గాలమైయుంట, మం
టలకుం గాలకయుంట, మింట రవియుంటం జేయు టిట్లైన్నా నీ
జిలుగుంబైంట చెఱంగుమంట యగువాసిన్ మూత్మ సీమంతినీ!''

క్రొత్తపలుకు బళ్లు.

''... పవలున్ రేలుడివోని తేజముల రవ్వల్ రాల్చుచున్ ..."
''....ఎక్కరాడిచట ఫాలాక్షుండు తో మ్మొడ్డినన్ '
" .. ఆదరణములేక యణగారిపోనున్న కళలకు గుండెలు కరంగంబోసి.''
"నిలువవీరున పండిన చెలువుతోడ నెచ్చెలీ! యెంతబాగుండె నీప్రియుండు!"
" జలకమాడిరి కిరికిపంపు వెన్నెలన్ ''

జాతీయములు - సూక్తులు - సుభాషితములు.

''....మెత్తని స్థలాల ఖనిత్రము వాడియౌగదా?''
'' ఒక్కయొఱను రెండుకత్తులెట్లు లిముడగలవు?''
''... గుడిమ్రింగెడువారి కప్పడ మదెంత?"
'' .. అతివంగన్న బమ్మకైన బుట్టునంట గా రిమ్మతెగులు,''
'' . సఖులను రక్షింపలేని సఖ్యంబేలా!''
'' సోమరులుగాక యచ్చమౌ శూరవరులం బ్రణయదేవత యాటంక
వఱుపంగలదె?''

''....కోపమునన్ కోసినముక్కు శాంతమునం గూర్పంగాద దేనాటికిన్"
'' ...భోంగాల మాపన్న మైన యపుడు హితవు చెవికెక్కదెట్టి సన్మతులకైన"
'' .. ఎవ్వరి నాళపెట్టవు కళాసందర్శ నామోదముల్''
'' జన్మాదుల్ తలపెట్టుకొన్న వదినే కార్యంబు గాకుండెడిన్''
'' దాచినను దాగంబోవు జాత్యున్నతుల్''
''....ఆపదలవెంట నాపద లరుగుదెంచు"
'' .. ఎప్పుడేవేళ కేయది యెట్టులగునొ! యెఱుంగజాలిన మహనీయు
లెవరు జగతి?"

'' .. చల్లారిన వెల్లియున్నతు లహూయా వహ్నిదగ్ధంబులై''
ఇట్టి రత్నముల రాజిల్లు నీకావ్యముల వెలుంగు నొపంగంజాలదు?

## రసము

ఈ కావ్యమందలి ప్రధానరసము శృంగారము. నాయికానాయకులు యను రాగముతో నారబ్ధమై, కల్యాణమున పెంపొంది, విశ్లేషాసహిష్ణుతచే విషాదాంతమైన గాథ శృంగార ప్రచురమే కదా!

స్వరూప - చిత్ర - స్వయంవర - ప్రణయస్కంధములు శృంగార భూయిష్ఠములై తద్రసమునకు ప్రాధ్యానము నొసంగుచున్నవి రణస్కంధము వీర రౌద్ర భయానక బీభత్సముల కాస్పదమై వానికంగత్వ మాపాదించుచున్నది. నిర్యాణస్కంధము-విస్మయ విషాదములకు నెలవై యద్భుతకరుణల నాస్వాదింపఁ జేయజాలుచున్నది. స్వయంవరస్కంధారంభమున శృంగారాంగముగా హాస్యము కొంత పోషింపఁబడినది సంయుక్త దైవప్రార్థనము జయచంద్రుని పశ్చాత్తాపము శాంతిని చేకూర్చినవి. కాఁగా సాంగమగు శృంగార మీకావ్యమునకు హృదయమై యాస్వాద్యమై సహృదయతన్మయీకరణచణమై యొప్పుచున్నదనుట నిర్వివాదము.

### సంభాషణ చాతురి.

చిత్ర— "తగని పగవాడుగద యామె తండ్రి నీకు
పగతుకూతుతో కళ్యాణమగుట యెట్లు?
పొలుచునే యనలోదకములకు మైత్రి?
కలుఁగఁబోనె ప్రాక్పశ్చి మాశలకు సంధి!"

పృథ్వీరాజు— ".......మా నిశ్చయమున కెపుడు
తిరుగెయుండదు జరిగియే తీర వలయు
నాకు సంయుక్తకును పరిణయము; జరుగ
దా! జరుగు బ్రహ్మచర్య మంత్యంబు వఱకు.

చిత్ర— 'ఇచట నిక్కెట్లో యచట నా నృపుని నట్లె
యేఁచు చున్నాఁడు మారుఁడు తూఁచినట్లు....'

సంయుక్త— 'చిత్రరేఖకు రేఖ విశేషమగుట
పడకతోఁ దెచ్చె ననిరుద్ధు నడికిరేయి
రేఖ నీ కున్న నాకునై పృథ్విపతిని
రెట్టపట్టుక వడి తేవె పట్టపగలు.'

ఏలె వదనవనరుహము వ్రేలవైతు? చిత్రరేఖకు రేఖ విశేష మనిన ''
మాటకాయేమె నీవిట్టులౌట చిత్ర!

మనసులేట్టి ప్రతిమ తెచ్చినది యద్ది ప్రతిమలేనట్టి మనసు తెచ్చితివి నీవు. ఈ రీతి వాకోవాక్యచాతురి యిందుపందెము వేసికొని నడచినది. యుద్ధమున వికలాంగులై యొకచెంతనున్న హిందూ-మహమ్మదీయభటుల భాషణము-మహమ్మదీయుఁడు-ఎందుకీవగపులోయీ! హైందవా!-హిందువు-"ఆఁడుబిడ్డల చూడలేనందు కేడ్వఁ బ్రాణములుపోవుచున్నందు కైనవగవ ఐకమత్యంబు మా కొకింతైన లేదు. తురక చెలికాడ యందుకు దుఃఖపడుదు'' ఇట్లిట సాగింపఁబడిన సంభాషణము సందేశ మొసంగజాలినదై యున్నది.

అన్య దేశములు.

''అల్లాకీదయతో మేరె ఉరు దయ్యాక్ సాఫ్ జపా సాఫ్ జపా! ''జీ! మై బోలం సెహబాసుబాత్..." ఇత్యాదులు సమయ సముచితములై శోభావహము లయ్యే యొప్పినవి.

ఈకవి యందందు స్వతంత్రించి కొన్ని నవప్రయోగములును, విసంధులను, అపూర్వ ప్రయోగములను, స్వకపోల కల్పితశబ్ద సల్లవములను వాడినట్లు గోచరించుచున్నది. మఱియుకొన్ని స్ఖాలిత్యములు నైతము పొడకట్టెడివి. అవి ప్రమాదము లైనవి గావు. ఎట్లయినను ''ప్రమాదో ధీమతా మపి'' అనియో! ''ఏకోహి దోషో గుణసన్నిపాతే నిమజ్జతీందోః కిరణే ష్వివాంకః'' అనియో పమాధానించుకొనుచు సహృదయు లీకావ్య మాధురిని సౌహార్దమున గ్రోలి యానందింపఁగలరని నా విశ్వాసము.

బహుముఖ ప్రజ్ఞానిధులు, బహుభాషాభిజ్ఞులు, బహువిధ కావ్యరచనా కుశలులు, బహుగ్రంథకర్తలు, అనన్యసామాన్య శేముషీధురంధరులు, వక్తలు, విమర్శకులు, సహృదయులు, సాధుసత్తములు, ఆంగ్లగీర్వాణాంధ్ర సాహిత్య సాగరనిర్మథన మందరములు, రసికశిఖామణులు, వెయ్యేల! పుంభావభారతీ మూర్తులనగు శ్రీవిశ్వనాథవారీకృతికిపతులుగా లభించుట యీ కవి బహుజనుస్సముపార్జిత మహా పుణ్యరాశిఫలము,

ఇట్టి యాదర్శసుందర రసవ చ్చారిత్రక కథాకావ్యమును విశ్వవిద్యాలయాధికారు లాదరించి యున్నత కళాశాల విద్యార్థులకు పాఠ్యముగ నుంచిరేని మిక్కిలి ప్రయోజనము కల్గునని తలంతును.

ఈ పీఠికా కార్యమునకు నన్నెంతో గౌరవపురస్సరముగా నర్థించి, మహా పండితులు చేయఁదగిన యీ భారమును నాదరముమై నాపైనుంచి నందులకీ కవీశ్వరుని నభినందించుచు, నిక్కవి యింకోధికమైన సాహిత్య సమారాధనము సల్పుచు, పెక్కురసవత్కావ్యముల సృష్టించుచు సుఖవీచికలఁదేలు కుటుంబముతో నూఱేండ్లు కవిగనే మనఁగాక ! యని భగవంతుని బ్రార్థించుచు నింతతో నిక్కార్యమును విరమించు చుంటిని. ఇతిశమ్.

"సరస్వతీ రసమహతాం మహీయతామ్"

30-1-67,
నరసరావుపేట.

ఇట్లు
మద్దులపల్లి సత్యనారాయణ శాస్త్రి.

# కృతజ్ఞతలు.

బ్రహ్మశ్రీ వేదమూర్తులు (ఉస్మానియా విశ్వవిద్యాలయాంధ్ర శాఖాధ్యక్షులు) డాక్టరు దివాకర్ల వేంకటావధాని ఎం. ఏ (ఆనర్సు) పి. హెచ్ డి. గారి వంటి భాషాసాధోనిధుల విమర్శకాగ్రేసరుల విద్వత్కవ్యగ్రణుల మనస్సు నుంచుకొనియే మధుమాస కావ్యమున సుకవి స్తవముగా.

> "లయమైపోయిన రాజపోషణములన్ లక్షింప కీనాఁడు దాఁ
> టి యమే యాంధ్ర కవిత్వమాధురులు క్రాందిక్కు నాడాడ న
> న్నయ తిక్కన్నల మించిపోవు కవిరాణ్మార్తాండులున్నారు వా
> రి యశోభ్యున్నతి కెల్లనై విరియు నాహృత్పద్మమేప్రొద్దులన్"

అని వ్రాసికొన్నాఁడ. శ్రీ దివాకర్ల వా రా పద్యములోని కవిరాణ్మార్తాండులకుఁ బర్యాయ పదముగాఁ గవిరాడ్దివాకరులని యాలోకబాంధవుని యరుణకిరణ ప్రసారములకు ప్రపన్న హృత్పద్మము ప్రఫుల్లము గావలయునన్న ప్రకృతధర్మ మెఱిఁగిన బాధ్యతా రసజ్ఞులగుటచేతనే యర్థించినంతనే యప్పటికి స్వస్థత సరిగాలేకున్నను, వ్యవధిలేని కార్యావసరములున్నను విపుల పరిచయముగా నాకృతికి దివ్యాకృతిని చిత్రించి మహాదరమును ప్రదర్శించినారు. వారి సహజ నిష్కళంకానవ మాతృభాషాసేవకు మహా కృతజ్ఞతలగా వేయిన్నూరాఱుల కైవారములు.

కవి పండితలోకమున నంతవఱ కనామకునిగానున్న నన్నొకనాటి యొక కవితా సదస్సులో నా రచనకుఁ దలయూచి సత్కవినిగా నాకలించుకొని యాదరించిన ప్రప్రథమ నిశితసత్య విమర్శక పండితప్రవరులు శ్రీ మద్దులపల్లి సత్యనారాయణ శాస్త్రిగారు. వారి శుభాశీస్సులవలననే నాకు శ్రీవిశ్వనాథ కవి సమ్రాట్టులవారి యాశ్రయ మబ్బినది. ఆ కృతజ్ఞతతో విపులపీఠిక వ్రాయ నర్థించినాఁడ. శ్రీ దివాకర్ల వేంకటావధానిగారింత పరిచయము వ్రాయుట వారెఱుఁగరు. ఎఱిఁగియుండిన వారిపైఁగల గౌరవభావమున ననలే యా ప్రయత్నమునే మానియుండెడి వారేమో! కాని యట్లగుటకే యదనునఁగాక వారి యౌదార్యమును ప్రకటించుకొను నవకాశము లేదు. వారికి నాపై నవధులులేని వాత్సల్యము. వా రేయింటి చిలుక కాయింటి పలుకన్నపుడికి నిదర్శనమై కఱకుఁగపాయియింటి పరుషపుఁ బలుకుల చిలుకలుగాక సదా

సార సంపన్నుల యింటి తియ్యని పలుకుల రాచిలుకలు. విశేషించి వ్యాకరణాలంకారశాస్త్రములఁ బరిశ్రమించిన యుద్దండ పాండితిగల పండితులు. కొమ్ములు దిరిగిన కైతవస్తాదుల సహిత మొక్కమాటలో బిల్లబీటుచేయగల పాండితీప్రతిభగల కోవిదులు. వీరి కలమునుండి నాకింత సత్యసూక్తి వెలువడుట నా యదృష్టము. వారికి నా ధన్యవాదములు.

ఇక్కావ్య ముద్రణార్థము శ్రీయాంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడమీ వారైదు వందల రూపాయలనుగ్రహించిరి. మరల తొల్లి యట్లే దీని పీఠికకొఱకు శ్రీవిశ్వనాథ సత్యనారాయణగారి సన్నిధికేగితిని. వారు పీఠికవ్రాయుటకు మారు దీనికి కృతీశ్వరత్వమునే వహించిరి. శ్రీ అకాడమీవారు కటాక్షించిన విషయము వారికి తెలియదు. వీరు కృతీశ్వరత్వమును వహించుట వారి కంతకన్నను దెలియదు. ఇర్వురును మాతృభాషాభిమానులే మాతృభాషాపోషకులే. ఇర్వురు నాకొక్క రూపైనవారే. ఆ కారణమున వీరికిని వారికి నట్లిట్లుగాఁ దెలిపికోవలసిన ధర్మము నాకు దోచలేదు.

"కాఫీటీలకు సూటు, బూటులకునున్ గాణాచియై పెద్ద పె
ద్దాఫీసర్లుగఁ జేయు నాంగళముపై నావంతయున్ భ్రాంతిలే
కే ఫైనల్ దెగ గట్టుకొంచుఁ జిగి నాఁ డింగ్లీష్ పిరియ్యడ్డులన్
సాఫీగా నెగగొట్టినాఁడఁ దెనుఁగున్ సాహిత్య మోహంబునన్"

ఆ మోహముననే నాబాబు తరమునుండి భాషాసేవఁ జేయుచు నాంగ్లమభ్యసించిన నా శిష్యులవలె నేను నొక ఆఫీసరునై వందలు వందలు వేతనముల నందుకోలేక యాంధ్రకావ్యములకు విలువలులేక నానాశ్రమల సిద్ధదరిద్రమున జీవితమును సాగదీసికొనుచున్న నా కిరువురు నెంతైన నీయఁదగినవారే. నే నిరువురిదయకు నెంతేని నర్హుఁడనే. నా యీ సాహస మేరికేని నించుక కెంగసైనన మన్నింప నర్థించుచుఁ నిర్వురకును గృతజ్ఞతా పూర్వకాభివందనములు సమర్పించుకొనుచున్నాఁడ.

"మృగములు మృగముల నడుగవు
ఖగములు ఖగముల నడుగవుగద? మగవారిన్
మగవారడుగు కొనుట యది
మగువ తనమ్మగునె గాని మగతనమగునా?"

అను పద్యభావమొంట నింకించుకొన్న మాతండ్రిగారు రసవత్కావ్యముల రచించిన మహాకవియునై యందొక్కదానినేనియు దాతల నాశ్రయించి ముద్రింపించుకొని పన్నెవాసులు గడించుకోలేక యూరకే జీవితమును గ్రుంకించుకొని పోయినారు.

ఆ యభిమానము నాకునుగద్దు. అందుకే మధు మాసమును మార్చడీ ఋణముతోడ వెలుంగున కీర్తుఁకొన్నానని వ్రాసికొన్నాఁడ. ఉదార రసజ్ఞులందలి యీ పద్యమునుజూచి నాస్థితి గ్రహించుకొనియే కాఁబోలు పావునూరు అరనూరులు పోస్టుద్వారాపంపినారు. పిలిచి సత్కరించినారు. అట్టి మహనీయులలో యస్.యస్. అండ్ యన్. కళాశాల ప్రిన్సిపాల్ శ్రీ యిలిందల రంగనాయకులుగారు. శ్రీ వావిలాల సోమయాజులుగారు శ్రీ కార్యముపూడి నాగేంద్రుఁడుగారు. పూనానుండి శ్రీ ఆర్. వేంకటేశ్వరరావుగారు ప్రముఖులు. వారికిని గృతజ్ఞతాభి వందనములు.

శార్వాణీ ముద్రణాలయ యజమానులు శ్రీ పి. శ్రీనివాసరావుగారు నా యీ కావ్యముద్రణముపట్ల వలసినంతగా శ్రద్ధా సహనములఁ జూపెట్టినారు. వారి యుపకృతికి నా కృతజ్ఞతానుతి.

శ్రీ పోలూరి ఆంజనేయ ప్రసాదరావు వీరభద్ర పురుషోత్తములు (జన్నాభట్ల సోదరులు), కవిశేఖర జోసఫ్ జాకబులు (గద్వాల సోదరులు), భాస్కరుని జగన్నాథరావు.బీ.బీ.ప్రాంక్లీను బాబులు మొదుగన్న వినుకొండ పురిమతల్లి శిఖలోని హారమందు ధవళముగావిచ్చి పెల్లుగ గుమాళించు జీవపు బొండుమల్లియలు. వారికి శుభోదయ వేళ నా మధురగీతాలాపములు.

పూర్వాంధ్ర విశిష్ట కవితాసౌష్ఠవముల మాసిపోనీయ కించుమించుగా నష్టాదశ వర్ణనాన్విత మధురాధుని కోహలఁదీర్చి రత్నగర్భను రిక్తగర్భనుజేయ నుంకించు జాత్య నైక్యరాక్షసి ధ్వంసమునకు రామబాణముగాదీడిన నాయీ కావ్యశ్రమను గుర్తించి సోదరాంధ్రులు నాకు మఱొక కావ్యరచనకు ప్రోత్సాహమొసర్తురని యాశించుచున్నాఁడ.

వినుకొండ,
16-3-67.

కృతికర్త.

# పృథ్వీభాగవతము

## కృతిస్కంధము.

శ్రీ ద్వైవార ధనుస్సునన్ గెలిచి ధాత్రీపుత్రితో వచ్చుచున్ వాదాడం బయికొన్న రామునకు సంపల్లక్ష్మినారాయణాం శూదంతెంబునఁ బోల్చు రాముఁడు కృతీశున్ సత్యనారాయణ త్మ్రాదేవాగ్రణిఁ బ్రోచుతన్ సతతసమ్యగ్భోగభాగ్యంబులన్.

సిరిదొరసానిసాని యొకచిత్తము గల్గక యూర కెప్పుడున్ దిరుగుచునుండసీ! యనుచుఁ దిన్నగఁ దీటికగా సరస్వతీ గిరిజలు సెప్పికొంట విని కెంగనులం గను లక్ష్మి ప్రేమ సుస్థిరమతి మత్కృతీశు గృహసీమల భూముల నిల్చుగావుతన్!

ఒక వక్షోరుహామందు సాహితియు వేఱొక్కంట గానంబు లొల్కు కళాదేవత తేపకొక్కగతి పొల్పుం దీపు లూరింప నిమ్మకు నీరెత్తినరీతి సృష్టి వెలయింపంజేయు వాగ్జాని మామకకావ్యప్రియయు నీప్సితార్థములఁ బ్రేమన్ నిచ్చలీడేర్చుతన్.

తన జగత్ప్రాముఖ్యమునకు నెల్లప్రజల
దలవాఁకిట మెలంగు కలనఁ జూపి
తన సుమనః కళాతతపాలనమునకు
శతపత్ర సురభిళాసనము ఁజూపి

తన జగన్నినుత విద్యాద్వయీ పటిమకు
నున్నతోన్నతకుచ యుగళిఁ జూపి
తన చంద్రమఃకీర్తి ఘనతర స్ఫూర్తికి
నతిసిత హంసవాహనముఁ జూపి

నిరుపమానంద సంపత్తిఁ బరిఢవిల్లు
బ్రహ్మరాణి వీణాపాణి ప్రథితవాణి
వెలయుఁగాత! మత్కృతినాథు విశ్వనాథ
సత్యకవిరాడ్విబుధవరు స్వాదుకృతుల.

శరణంచున్ మొరసేయుటే తడవుగా సత్కారసంధాతయై
పరమోత్కృష్టశిరంబు గంగనకు శుంభద్దేహమం దర్ధమున్
గిరిరాట్పుత్రిక కిచ్చి శశ్వదనురక్తిం బొల్చు నాగేశ్వరా
భరణస్వామిశివుండు మామకకృతిస్వామిన్ గృపం బ్రోచుతన్!

పుట్టింటిపై నల్కఁపుట్టి నందుల కేమొ
కైలాసవాసంబుఁ గడకుఁ ద్రోచి!
సతతంబు తలమీఁది సవతి సంగతి కేమొ
ప్రాణనాథుని మేను వదలిపెట్టి!
తెలుఁగుల దీపించు దృఢతపస్సున కేమొ
చలనశక్తుల నెల్ల నిలువఁబట్టి !
నిరతంబుగా నాంధ్రధర వసించుట కేమొ
తనుకోమలత్వంబుఁ దునిచివైచి!

విజయపురి కృష్ణతీరాద్రి వెలసియున్న
యపర కనకదుర్గాదేవి యంహరహంబు
మహిమఁ గనుత! నప్పురివాసు మత్కృతీశు
విశ్వనాథ సత్య కవిరాడ్విబుధవరుని.

బాల్యంబుననె బాలభానుని ఫలముగా
భావించి కబళింపఁ బట్టబోయి
క్షితిజాతవార్తకై శతయోజనాయత
జలరాశి నవలీలఁ జవుకళించి
తక్కసి గుము లెల్ల నొక్కకొల్కికి రాఁగఁ
గాంచఁబోయిన లంకఁ గాల్చివచ్చి
సంజీవనీ సవిస్తారంబుఁ గనలేక
కొండకొండనె కొనగోటఁ దెచ్చి

మధుర రామాయణమునకు మనసుపండి
కోరి మా వినుకొండను గుంటి యాంజ
నేయులుగ రాజిలుచునున్న వాయుసుతుఁడు
జగతి గుప్పుత! మత్కృతీశ్వరుని యశము.

ఘనకళల కెల్ల గురువై
పనిచెఱుపులసామి యనుచుఁ బడియెడు నపవా
దును బాపుకొనను గృపతో
వినాయకుఁడు నాయెడల నవిఘ్నుకుఁ డగుతఁగా!

ఎవఁ డా దేవుఁడు? వన్నె యెట్టిది? మొగంబేతీరు? పేరేమి? యే
వివరం బించుక లేని శూన్యునకు గంభీరప్రతిష్ఠాంశముల్
తవణింపన్ జవులూర వాక్ప్రతిభఁ బుట్టంబుట్టి తొల్దొల్తగా
కవితాలేఖిని నందుకొన్న కవిలోకశ్లోకు నర్పించెదన్.

అవనీశుల్ దలయొగ్గి మ్రొక్కు రసకావ్యాకృత్యుఁడౌ తిక్కన స
త్కవి కెఱ్ఱాప్రెగడాది మాన్యులకు మా స్వామియై యెందునే
కవితారంభకు లేని ప్రాసలు యతుల్ సేసి దివ్యత్కళా
కవితాభారతిఁ గన్న యాంధ్రకవిలోకబ్రహ్మ నర్పించెదన్.

తెలుఁగున్ వెల్గులు దిద్ది గంతములకున్ దీండ్రింపఁ గ్రొంగ్రొత్త కై
తలకున్ జేతులు సాఁచుచున్ గవులఁ జేతఃప్రీతులన్ జేయుచున్
దెలుఁగే లెస్సని మ్రోయఁ దెల్గుసిరి నుద్దీపింపనై ఖడ్గమున్
గలమున్ ద్రిప్పిన కృష్ణరాయల మహాక్ష్మానాథు నర్పించెదన్.

శ్రీ శబ్దింప నుతింతు రాజశరణశ్రీ మృగ్యమై కబ్బముల్
నాశంబై చనను న్న కాలమున నాంధ్రామ్నాయ సంరక్షణా
త్యాశన్ భారతిమాసపత్త్రికను సంస్థాపించి పేర్గన్న శ్రీ
దేశోద్ధారకు కాశినాథకులజున్ ధీశాలి నాగేశ్వరున్.

అమితోదార కళారసజ్ఞతకు నుద్యత్ జ్ఞానభాస్వంతు సా
మ్యమునన్ సొంపిలి వ్రాసి పంపుకొను టే యావృత్తిగా నాకవి
త్వము నాంధ్రప్రభ కెత్తి సంతతకృపావైదగ్ధ్యమున్ జాలు నీ
లమురా డ్వేంకటశేషయార్యవిబుధున్ శ్లాఘింతు హృన్మాధురిన్

మధుమాసంబును మాధురీకవన సంపద్దృష్టి వీక్షించి య
కృధకుక్ సాధనలో మహోన్నతసమీక్షన్ జాటుచున్ నన్నుఁ బ
ద్యధనోత్కృష్టత సత్కరించిన తదాంధ్రాధ్యాపక శ్రీయుతున్
బృధులో సహోజ్జ్వల వావిలాల కులవార్ధీందుం బ్రశంసించెదన్.

ఒక లేశంబు నరాతి కేనియు శ్రమంబూహించుయత్నంబె లే
కకలంకా ప్రతిదేశభక్తిపరత ఖ్యాతిల్లు చుద్యత్కృపా
నికరంబో! యన నాంధ్రమం దెసఁగు "య.న్సి" ఆంజనేయ ప్రసి
ద్ధకళాపోషణశాలి కద్భుత హితార్థస్వామి కాత్మాంజలుల్.

రకరకమ్ముల నూత్నరచనలు దీపింప
కృతికల్పకులఁ బ్రోత్సహించుకొనుచు
జీర్ణించిపోనున్న శ్రేష్ఠంబులగు పూర్వ
కృతిజాలముల నుద్ధరించుకొనుచు
బ్రతుకెల్ల వెచ్చించి వడిచెడ్డ భాషా వి
శిష్టులం బ్రీతిఁ బోషించుకొనుచు
ననుబోలి యజ్ఞాతమునఁ గుందు కవుల న
న్వేషించి కృపను బింబించుకొనుచు

ఆంధ్రభోజుల భోజుల నధిగమించి
వేయికన్నులఁ గరముల వెలసియున్న
"శ్రీమదాంధ్రప్రదేశ్" సాహితీ మహా "అ
కాడమీ" సవిత్రికి నమస్కారకోటి.

ప్రాణగొడ్డము జీవగఱ్ఱ దినవెచ్చ
మన్న వా రేటి సుకవీశులైనవారు?
దోసఁగు గలవారె! యెల్లరి దొడ్డవారు?
బాధ్యతలఁగొన్న కవులాటవలనఁ గాదె?

ప్రాసలా? యతులా? గణబంధమా? క
థాంశమా? యలంకారమా? వ్యాకరణ వి
శేషమా? రసమా? యింతచిక్కైన
కవన మందొక్కదోసఁగున్న నష్ట మేమి?

సరసకావ్యమందుఁ దఱచు నొక్కటిరెండు
దోసఁగులుండు నున్నఁ బొసఁగ వనక
వాని నిలువఁబెట్ట వ్యాకర్తలు గతుకే
ర్పరుపవలయుఁ గావ్యపద్ధతి యిది.

మనసులో నొకటుండ మార్గంబు వేఱౌచు
నొప్పునే తప్పుగా నూహాచేసి
యూఁగుట తూఁగుట యొక్కటి కాదంచు
దొడ్డగా దానికి సొడ్డుదొడఁగి
'ను''కుఁబైని- రంగులో"ంగు''కు యతివేసిన
పొసఁగ దీయతియంచు దోసఁగుపట్టి
యట దాని యవసరం బరయకే ద్రుతముపై
ద్రుతము ద్రుత మటంచు రొదయొనర్చి

సరసకావ్య ప్రసవబాధ యెఱుకపడక
శాక్యసింహులుగా సవ్యసాచులుగను
రేఁచి దెసలకే నసిఁబూయఁ జూచుచుండు
మునుఁగుగాండ్రకు చేయెత్తి మ్రొక్కుకొందు.

అలఁత్రియలంతి కబ్బముల నల్లి కవిత్వపులోఁతుపాఁతులన్
దెలియక యబ్బు డబ్బుగల తెల్గుదొరల్ తెగలోనినాయకుల్
దలపడి మింటనిల్పిన నిలన్ మొనగాండ్రము మే మెయంచు దీం
డ్రిలు కవిగాండ్రఁగా క[illegible]ల్క్రేవకుఁ దార్చి తిరస్కరించెదన్.

ఏకవుఁగింట మిట్టిపడియెన్ గవితాలలితాంగి గాన వి
ద్యాకలశాబ్ధి నీదె నెవఁ? డట్టి విశేషమనీషి కాంధ్ర భా
షాకవితాకళార్చనకుఁ జక్కగ ముప్పర మున్నుఁగన్న మో
షేకపి కంజలించి మఱిచెప్పెద మత్కృతినాథు వంశమున్.

కాదే మానవనాథవంశము పసుక్ష్మానాథ వంశంబునున్
గా దానిర్జరనాథవంశ మదియున్ గా దారమానాథయున్
గా దాహా! యిది విశ్వనాథ యెటులీక్ష్మామండలిన్ బోల్చెనో!
తే దేవంశము విశ్వనాథ కెనగా లెక్కింప లోకత్రయిన్!

తన విశ్వత్వము మూర్తిఁగట్టుకొన సత్కావ్యంబునాదిన్ రచిం
చిన వాల్మీకిమహా గోత్ర గరిమశ్రీ తెన్నునన్ నింపనో!
తెనుఁగున్ శేవ త యగోత్రమున నుద్దీపింపనో! పొల్చె, దే
వుని యుద్దేశ్యము వియున్ దెలియ రా వుర్విన్ మహాజ్ఞానికిన్!

ఎంత కోమలపుష్పవృష్టి వర్షించెనో
రమణీయ నందనారామవాటి!
ప్రణవనాదం బెంత ప్రభవింప మొరసెనో
విబుధలోకపు దుందుభివ్రజంబు!
ఎంత కమ్మనిహాయి యేపార వీచెనో
పారిజాత సుగంధపవనబాల!
ఇంపుసొం పిల నెన్ని వంపులు తిరిగెనో
యప్సరోంగనల నృత్యముల మేను!

ఎలమి రసభాండభాండిక లెన్ని యెన్ని
హారణమయ్యెనో మధురామృతాన్నపంక్తి
కల సమస్తంబునకు మనఃకాంతుఁడైన
విశ్వనాథుఁడు తెలుఁగున వెలయునాఁడు!

ఆవిశ్వనాథదేవుని
పావన నామమున నైన వంశమునఁ గవుల్
కోవిదులు వెలయ వెలసు మ
హావితరణశాలి శోభనాద్రి జనించెన్.

సదయుఁడు శోభనాద్రి తొలి జన్మములోఁ దపమెంత సల్పెనో!
తద్దలఘువంశరాజమునఁ దాల్చె భవంబు; మృదూక్తి యుక్తులఁ
బడి బిరుదంబులం బడయఁ వచ్చుఁ బ్రసిద్ధపవిత్రవంశముం
దుదయమునంద నుండవలయుఁ దొలి జన్మతపోనిధానముల్.

ఆ వితరణశాలి యీవులందున నిల్చి
కనుపట్టసాగె భాస్కరసుతుండు
ఆ సత్యభాషణుఁ డాడు నుడులకెక్కి
సవురింపఁదొడగెఁ ద్రిశంకుపట్టి
ఆ శరణాగతు నాదరబున నెక్కి
బింబింపసాగె శిబిప్రభుండు
ఆ జగదుపకారి యాశ్రయంబున రేఁచి
యఁగుపట్టఁదొడఁగె నిండుగ దధీచి

ముకురమందుఁ బ్రతిఫలించుమూర్తులట్లు
తత్తదలఘు లా శోభనాద్ర్యార్యునందు
వెలయ సాగినా రాహా! శ్రీవిశ్వనాథ
శోభనాద్రి యశస్కల శోభనాద్రి.

ముసురై గోఁచిగొకండతో వణఁకుచుం బూర్వాశ్రితుండైనపులకసుఁ డేతెంచి "దొరా! దరిద్రుఁడవడంకన్ జాలవేఁ గప్పుకో వసనం బేదిగొయ్యంచు వేడుకొనినన్ బైతుండు మైఁదాల్చుకొనం జొనఁగెన్ దోవలి; శోభనాద్రి మహనీయుం డెంతపుణ్యాత్ముఁడో!

కలిగిన యాస్తిపాస్తులను గాదన కర్థిజనాళిఁ దన్పునీవులకు వ్యయించి యాసుకృతమూర్తి ప్రసిద్ధవసంతలక్ష్మికాకులఁ ద్యజియించి ప్రోడయినగొప్పమహీరుహమట్టులెంతయో యలరెను సద్యశోకిసలయంబు చిగుర్ప వినూత్నశోభలన్.

దశగలపుత్రులన్ గనిన తండ్రిగఁ గీరితిఁజూరఁగొన్న యా
దశరథుఁ డేటి సువ్రతవిధానుఁడు? ముగ్వురిపత్నులందునన్
శిశువుల నల్వురంబడసె శ్రీనియమవ్రతశోభనాద్రి స
ద్యశముగ నొక్కపుణ్యసతియందునె యందెసుపుత్రకత్రయిన్.

విదిత సత్యనారాయణ వేంకటేశ్వ
రులును రామమూర్తి యను పేరులు వహింప
ముగ్వు రచ్చమ్మగాఁ దండ్రిమూర్తివారు
పార్వతీమాత పుణ్య గర్భంబు చలువ.

పార్వతీశోభనాద్రి దంపతులు కనిన
దివ్యవిశ్వనాథుల తృతీయసోము
రామమూర్త్యద్వితీయాభి రామమూర్తి
భ్రాతృభక్తికి లక్ష్మణస్వామిభాతి.

ఆ సత్త్రదులవేంకటేశ్వరులు దీటా శోభనాద్ర్యాత్మజ
శ్రీసూర్యగ్రణి వేంకటేశ్వరుల కర్థిత్రేణిఁదన్వక, ద్విభా
షాసంపత్తినిగ్రాల? నందులకె యా సత్స్వామి సత్త్రదు లం
దాసీనుండయి పల్కఁడంచు బుధు లభ్యర్థింతు రీస్వామినిన్.

పలుకనే పలుకఁడు పల్కెనా! యాపల్కు
సానదీరిచిన వజ్రంపుఁదుంపు
వ్రాయనే వ్రాయఁడు వ్రాసెనా! యాకైత
చవులొల్కెడు సుధారసపంపుముంపు

కనరానె కనరాఁడు కనవచ్చెనా? యచ్చు
మలరు విల్కాని సౌమ్యంపుగుంపు
పట్టనే పట్టఁడేపనిచేతఁ బట్టినా?
వ్యథల కొగ్గని భగీరథుని తెంపు

అనఁగ నిరువొంది సకలగుణాధికముల
వైభవముల శ్రీపార్వతీశోభనాద్రి
వెంకటేశ్వరులు ద్వితీయ విశ్వనాథ
సత్యనారాయణ కవిరాట్సరణిఁ దనరు.

కల పాండిత్యముఁ జూపి యెట్టికవినిన్ గగ్గోలుగావించు వి
ద్యల బ్రాహ్మీమయ చెళ్ళపిళ్ళకవిమార్తాండుండు మన్నింప న
య్యలఘుజ్ఞానికి సత్యసూరికవి శిష్యాగ్రేసరుం డౌచు న
గ్గలపుం బ్రజ్ఞ గడించె ద్రోణునకు నగ్గాండీవి శిష్యుంబలెన్.

కవనము వ్రాయుటే బ్రతుకుకట్టడిగాఁ జిననాటి నుండియున్
నవనవరీతి పూర్వగతి నాటకముల్ సువిమర్శనంబులున్
నవలులు కావ్యముల్ ప్రహసనంబులు వ్రాయుచు విశ్వనాథగా
స్తవములనందు సత్యకవి చంద్రు నెఱుంగని వారు లేరటన్.

అద్భుతమ్ములగు నూహాభరమ్ములఁ బిల్క
కును నోపని బెడంగు దెనుఁగు శిరము
ముక్కుఁ గన్నులు దివ్యముగఁ దీర్చినట్లుండి
పౌరుషశ్రీ నుట్టి పడెడు మోము

సిరియుం గవుంగలించె నన రుద్రాక్షాన
నలరు సన్ననిపైఁడి గొలుసు గళము
పొడవు, పొడవునకొప్పెడి ద్రఢిమయును, దబ్బ
పండు వన్నియ నుండు నిండు మేనుఁ

బదపదమ్మున సాహితీ పధములందు
నన్నయా? తిక్కనా? పోతనా? య టనెడి
విభ్రమమున దర్శనమిచ్చు విశ్వనాథ
సత్యనారాయణ సుకవి చక్రవర్తి.

జ్వలియించు నొక సభాస్థలిని దీర్ఘసమాస
పటలి తీక్ష్ణతల భాస్వంతు నటుల
వీతెంచు నొక సభావేదిక రసభావ
పరిమళమ్ముల గంధవహుని పగిది
వెలయించు నొక సభాస్థలిని విమర్శనా
హైమచంద్రికల నక్షారి సరణి
బోరించు నొక సభాభూమిని సాహితీ
కమనీయతల ఘనాఘనుని కరణి

తనదు విశ్వనాథత్వ మంతటను దనర
నెట్టులిదమిత్థమని నిర్ణయింప నగును?
బహుముఖప్రతిభా యశోవంతు లెపుడుఁ
బట్టుపడరు గాదే యొక్క భావమునకె?

వాల్మీకిరచితగీర్వాణ రామకథా సు
ధామృతంబును మనసారఁ గ్రోలి
ప్రథితభారత కవిత్రయమువారి రచనా
కౌశలంపు టొడవు గడనఁ జేసి
మెఱపుకన్నెలతోడ మిన్నంది విహరించు
మధురిమోహాలను బొమ్మలకుఁ దార్చి
వాఙ్మయంబునఁ గల్గు ప్రాఁతక్రొత్తఁల మేలి
కలయికలఁ గవనకలనఁ జూపి

గీ॥ పూర్వమున లేని మునుముందుఁ బర్వఁబోని
తీరుమైఁగల రక్తంబు ధారవోసి
మహితరామాయణామరతరూ రుహమును
వసుధకెత్తెను తెలుఁగల పంటపండ.

ఒక తురుష్క కవికృతికి ముంబలుకు వ్రాసెఁ
బలుకుఁదొయ్యలికిఁ గ్రొందళుకు దనర
ఒక క్రైస్తవకవికృతికిఁ బీఠిక లిఖించెఁ
గట్టమంచి మనీషి కరఁగిపోవ
ఒక యనాథకవికృతికి మున్నుడిరచించె
నపరమిత సుయశం బవఘళింప
ఒక పంచమ కవికృతి కుపశ్రుతి వెలార్చెఁ
దెలుఁగున సిరియింత తొలకరింప

నాఁ డెఱుకువల్లఁ బడిన నింద నడఁచుకొన
నవతరించిన ద్రోణుఁ డీయనయె యగునొ !
కానిచో వేత్ర తెగలప్పైఁ గలుగుటెట్లు
వట్టిబ్రాహ్మణాగ్రణికి నేఁ డిట్టి సెనరు?

వీరభూపతి మీసంపు భృంగపంక్తి
ఏకవీర ముఖాబ్జాన జోకుజూప
నారి భావ బంధుర సుధా ప్రణయగాథఁ
జదువుకొన్నాఁడఁ బదిరెండు సారు లేను.

వారి నర్తనశాలను వలచినప్పు
డెల్లఁ బ్రముఖులచేత నాడించుకొనును
వాసిరెడ్డ్యన్వయ క్షీరవార్ధిరాజు
పుణ్యముక్త్యాల యువరాజు పుష్పశరుఁడు.

చేసుకే తడ వేవేని వారికృతులు
కాశినాథనాగేశ్వర ఖ్యాతినెఱపు
మాసభారతి ధరియించు మాళిపైన
దివిజగంగను దాల్చినశివుని యట్లు.

అయ్యవారంటు చక్రవర్త్యయ్యవారు
వారిశృంగారవీథీ ప్రబంధరమణి
నందుకొన్నాఁడు పొదరిండ్లసందు రాధి
కా ప్రియను సందిలిక్కఁగొన్న కన్నునట్లు.

వారి యనుఁగు కిన్నెరసాని పాటలు ధ్వని
యించు నాంధ్రనాగరకుల యింటనింట
సహృదయకవుల మటంచు యశముఁగొనెడి
యువకవీశుల కాకైత గొజ్జబంతి.

ఇట్టులే వారికృతు లెన్ని యేని గలవు
వాని లెక్కించి వివరింపఁ బూనుకొనుట
చుక్కలగణించి చెప్పఁజూచుటయె యగును!
పటముపైఁ దేనెల రుచి వ్రాయుటయె యగును!.

విశ్వనాథసత్య సుకవిపేరు విన్నఁ
బగతులకు గుండియలు బ్రద్దలగుటె కాదు
ద్వైతసిద్ధాంతపుంజట్టు వ్రయ్యలగును.
శైవవైష్ణవభేదంబు సమసిపోవు.

నకనకలాడునట్టి కడుపులన్ వచ్చి
త్రేఁచుచు బోయెడు తెరువరులును
చినిగిన వసనాలఁ జనుదెంచి నూతన
పరిధానములఁ దాల్చి యరుగువారు
పరిదీనవదనులై యరుదెంచి యుత్సాహ
కృతమందహాసులై యేగువారు
సందేహభాజనాస్యములతో వచ్చి యా
శ్చర్యసూచిముఖాలఁ జనెడివారుఁ

బాలుతు రన్నాతురులు యాచకులును నిత్య
కలితబహుళకార్యాంతరాగతులు విశ్వ
నాథవంశాబ్ధి శశిశోభ నాద్రియింట
నిరులు వదలి వెల్తురులు గొం చేగునట్లు''.

అనుట శ్రీపార్వతీ శోభనాద్రినాఁటి
సదనమున నేమి? వారి జేష్ఠతనయుఁ డగు
సత్యనారాయణ కవిరాట్స నమునను
జరుగుచున్న దిప్పుడు నట్లె రుగులేక.

చుట్టాలమే యంచుఁ జూడవచ్చెడివారు
మరలరామా! యటం చరుగువారు
కృతిపీఠికలకయి యేగుదెంచెడివారు
నెల్లె వచ్చెద మంచువెళ్ళువారు
ననుమానములఁ దీర్చుకొనఁగ వచ్చెడివారు
నెనరుంచుఁ డని యంచుఁ జనెడువారు
నే సహాయార్థమో! యేగుదెంచెడివారు
నెన్నినాళ్ళుందు? మం చేగువారు.

అన్నసత్రమో! దేవాలయంబో! కాని
యేగుదెంచెడివారికి నేగువారి
కెడమె యుండ దే ప్రొద్దైన నేమి చెప్ప
నిసుక వేసిన రాల దా యింటిముందు.

అన్నా! యెదో వ్రాయుచున్నట్టు లున్నాఁడే
    వే?-యౌనురా! యదే!- యేమిటియది ?-
అదియె పృథ్వీరాజు- నిదివఱకెప్పుడో
    వ్రాసితినిగదా? మరల నదేల?-
తిన్నగా దానిఁ బృథ్వీభాగవతముగా
    మార్చు చున్నాఁడరా తలఁపులూర-
"భళిర! పృథ్వీభాగవతముగానా? భాగ
    వతముగానా?" యనుచుఁ బలుకు చటులె.

విస్తుపోయిన తమ్ముఁడు విజయదత్తు
నాఁటి నుండి నేఁటికి నయనములఁ బడఁడు
పడిన యాశ్చర్యకలనతో వాఁడు నిందు
నేకమైయుండవచ్చు నాకాకు సందు.

వ్యథకున్ దగ్గఫలంబు లేదయినఁ గావ్యంబెట్లో పూరించి యా
మధుమాసంబున కట్లు దీనికిని సమ్యక్కీర్తికన్ నింపుఁగో
మధురప్రీతిఁ గళాప్రపూర్ణ కవిసమ్రాట్సత్య.నారాయణ
ప్రధసాన్నిధ్యముఁ జేరినాఁడఁ దొలి లభ్యంబైన రాగంబునన్.

కవితాసంగతిగాఁ గనంబడి నమస్కారంబుఁ గావించినన్
'గవివా నీవును? నీదియుం గవనమేనా' యంచు న్యక్కారమున్
లవమేనిన్ రవళింపఁ డాఘనుఁడు స్వల్పామూల్యపుంగంచుకే
యవు నౌ! నుండవు పైఁడి కాగణగణాహంకార వక్రధ్వనుల్.

ఆయురు కళారసజ్ఞత,
యాయొరులను మెచ్చుకొను మహాస్వచ్ఛగుణం
బా యోరిమి, యా పాండితి,
యా యనకడఁ గాక యాంధ్రి నగపడ వెచటన్.

కెంగేలెత్తి నమస్కరించి యనురక్తిన్ దీనికిన్ మీ యథా
ర్థాంగీకార మనుగ్రహింపుఁ డని కావ్యం బిచ్చినం గంటలో
సాంగోపాంగముగాఁ బఠించి "శహబాస్" సర్వాంగశృంగార మై
పొంగుల్ వాఱెడు దేశభక్తి నిదిపో పాత్రంబు గ్రొంగ్రొత్తగన్!

'ధీమాగా' యని వేసినాఁడవుగదా? "తెన్గుంగవిత్వం బనన్
మేమే వ్రాయవలెన్ మఱెవ్వ"రని యా సీమాటలోఁ గ్రైతలో
నేమాత్రంబును జీల్పు లేదనుట నాఁడే తేల్చుకొన్నాఁడ నో
యీ మో షేసుకవి ప్రసన్న! హృదిహాయిన్ దూఁగిమిన్నందఁగన్

"నను గన్న మోషెసంతసములకడుపు నీ
యంశానఁ గాలుచున్నందు కేడ్వ
విద్వత్సుకవిగ నా వెనుదన్ని పుట్టి న
న్నశ్రుల ముంచుచున్నందు కేడ్వ
చామనచాయ మేన్ జదరంపుటురపు నీ
యందంబు డిందుచున్నందు కేడ్వ
నీ శ్వేతయిల్లాలు నిసువులు నీకునై
యల్లాడిపోవు చు న్నందు కేడ్వ

మన కవిబుధులెల్లరు గ్రహింపకయె మఱొక
తెలుఁగురసభాండము బదాబదలుగఁ బ్రిదిలి
వితగపోయెను తమ్ముఁడా! విజయదత్త!
అందుకేడ్తురా! ఏడ్తురా! కుంది_ కుమిలి.

అమృతము చిమ్మలై చిలపత్రై మొలపించు సుందరీ
సుమసుషమారుణాధరరుచుల్ రసవంతపుద్రాక్షవల్లి ము
గ్ధమధురమోహనమ్ములు పదార్థములెన్నొ! యమర్చి నీవు స్వ
ర్గమొకటి దింపి నా పుమరీఖాయము పైఁడిపదాలమీఁదుగా.

ఎవఁడురా యీ మెదడులేని సృష్టికర్త
మన కుటుంబానఁ గయితల మనగ మలఁచి
తెలుఁగుగడ్డను సిరియింత గలుగనీక
జీవితమ్ముల వ్యథలకుఁ జేసినాఁడు?

బ్రతుకుఁ గైతకే వెచ్చించి వట్టివెతలఁ
బోయినాఁడయ్యా, నీవును బోయినావు
అన్న వచ్చును నేవత్తు నగ్రపీఠి
కష్టజీవులదేర స్వర్గమున విజయ!

ఏ పూలతోఁపుల కెరువుగా, బడిమూరి
యణగారిపోనొ! నీ యస్థిపేటి
ఏ పానమందిరసోపానములమీఁద
హాహోశెత్తునో! నీ శరీరవాయు

వే శ్వేత జవరాలికాలుముద్దాడగా
సాహసించునో! నీదు దేహాన్మాళి
ఏ మధుకలశమ్ము పైమూఁతగాఁ దీర్చి
కుమ్మరిపడుచు నిన్నమ్ముకొనునో!

నీ బ్రతుకు నీరసపిపాస నీ సమస్త
మే విచిత్రావతారమ్ము లెత్తుకొనునో!
కన్నుమూయుచు నున్నావ కాటినేల?
మొత్తుకొన్నను రావ? తమ్ముఁడవు గావ?”

అనుచుఁ బదియుఁ దొమ్మి దరువదైదు మార్చి
నకట! యాంధ్రప్రభా జ్యోతులందుఁ బడిన
నీవిషాదంబుఁ గన్నాఁడ నేను- నాకు
హృది ద్రవించుకపోయిన దేమి చేతు!

అరుదిపు డిట్టుల నీ వలె
గరగరికగఁ గయితవ్రాయఁ గలుగు కవీశుల్
సిరిగలవా రకటా! నిను
గుఱుతింపక యుంట గుఱించి కుందుదు నెప్పుడున్.

అని “లెటర్ ప్యాడ్” గయికొని తత్క్షణమె యందు
వ్రాయఁబట్టిన కలముఁ గై వ్రాలనీక
యాణిముత్యాలవంటి వర్ణాళితోడ
నురు కృపామృతరసహృది యుట్టిపడఁగ.

ఆంధ్ర సారస్వతోద్యాన కౌసుమ వాటి
ముద్దారు పూవులు పుణికికొనుట
ప్రభులమెత్తఁదనాల వాగ్గుంభనమ్ముల
మెలపులు నీవిగా మలచికొనుట
తెలుఁగుల నడవడుల్ తెలుఁగుల నమ్మకం
బులు పట్టి గుండెలో నిలుపుకొనుట
సకలభారత జాతి సఖ్యభావము బీటు
లరసి గుండియలోన నటమటెలుట

పూర్వజన్మ సంస్కార సంభూతమైన
యొక రసస్పృష్టి పలుకులం దొలసికొనుట
నన్ను నీకైత వలపించినది ప్రసన్న!
యన్ని గుణములఁ దగు సమాహార మొప్పి.

నెలకును గొన్ని వందలుగ నీకును జీతమొసంగ శక్తి నా
కలవడదాయె నీబ్రతికి నన్నిదినంబులు వచ్చి క్షేమి - నీ
యిలుచొరకుండఁ జేయుటకు నింతయుఁజాలను చచ్చులేదు వం
దలు పడినూర్వదార్లకును నా కిది యంకితముం బొనర్తువే!

అచ్చునొత్తింతుఁ బైని పీతాంబరములు
పెట్టెదను పెద్దసభ గౌరవింతు నిన్ను
ఓయి! నీ కది యెంతైనఁ జేయవచ్చు
నదిర! నాశక్తి యీమాత్రమె ప్రసన్న!

జిలుగుమువ్వలరవళి మ్రోసినది నీదు
తెలుఁగు పద్దెపు కూర్పులో ధీప్రసన్న!
కంటివె! శతాధిక గ్రంథకర్త నేను
ఐన దీనిపై నేలా! నాకాశ పుట్టె.

రవి వంశంబునఁ బుట్టువందినను ధర్మాత్ములెన్ని కావించినన్
భువనా లేలినఁ దల్లక్రిందుగఁ దపమ్ముల్ సల్పినన్ ధాత్రిలోఁ
గవితో సఖ్యములేక కావ్యమున కెక్కన్ జాలకే యున్న నే
లవమాత్రంబులో కాక విశ్వయశముల్ లభ్యంబుగా వేరికిన్.

"సప్తసంతానములలోఁ బ్రశస్తిఁ గాంచి
ఖిలముగాకుండునది యొక్క కృతియ" యనుచు
నెఱిఁగి వలచి వచ్చినపలువురకుఁ గృతుల
నిడిన నే నీకృతికిఁ బెండ్లికొడుకు నగుదు"

అనుచు వ్రాసి వ్రాసిన యా దయారసార్ద్రి
పద్యపుటి జకీదోనతుల్ పట్టుమిదియె
కృతికి చంద్రతాంబూల మం చిచ్చినాడు
సత్యనారాయణ సుకవిచక్రవర్తి.

ఎవ్వరాసామి నన్నిట్లు కృపను గనను!
సత్యనారాయణ సుకవిచక్రవర్తి
యా! యటులనుట కాదు కా దట్లుకాదు
విశ్వనాథుఁడె నాపాలి విభవవిభుఁడు!

కళలను గులముతోఁ గొలపోసి వెఁగట్టు
తగనిసాములకు మాదిగువ నగుచు
హాసుల్ 'సిపారసు' లరసి పోషణ మిచ్చు
దొరల యండలకు పెందూర మగుచు
రసికప్రభువు లెల్ల రాజకీయాల కే
యెగబడుచున్నందు కిడుమపడుచు
ప్రాఁగ్రైతకే గాద్లు భాషకే శనిపట్టి
కృషి దుర్యశము దాట కేడ్చుకొనుచు

దీనుఁడ నగు నే రూపింపలేనుగాని
చంద్ర తాంబూలమునకు జేఁజాచు నపుడు
అంచులంటఁగ నన్నాఁకలించుకొన్న
విశ్వనాథుఁడు నా కగుపించినాఁడు.

నేనా బమ్మెర పోతరాట్కవిని గానీకాకపోనీ! మతే
మిా నా యీకృతి దివ్యమైనయది కానీకాకపోనీ! యెుక్కిం
తైనన్ నాకును మానవాంకితము సేయన్ వాంఛ లేకుంట నే
నానీమంబున దీన భాగవత విఖ్యాతిం బ్రతిష్ఠించితిన్.

కాటుక కంటెనీరు చనుగట్టు పయింబడ నెప్పు డేడ్వదా
కైటభదైత్య మర్దనుని గాదిలి కోడలు నన్ను గూర్చి నా
గాటపు నిశ్చయంబు సరిగా గుఱుతించిన తల్లి యూటు; నా!
న్నేటగు బిడ్డపట్ల నవునేగద యమ్మకు నిత్యమోదముల్?

కులసతియున్ మఱంది సిరిఁ గోరి నరాంకితముం బొనర్పు మం
చలజడిసేయ రా తెలుఁగునందముఁ గాంచి కృతీశ్వరత్వమున్
వలచి కరాసి దూయు నరపాలకుఁ డొక్కఁడుఁ బుట్టఁడింతకున్
గలిగినవారికే కలుగుఁగాదె వసుంధర నెల్ల వీలులున్?

అదియా వ్యాసమహర్షి సత్కృతికి స్వేచ్ఛాంధ్రానువాదంబునం
బదలాలిత్యపుఁబోఁతఁ బోతన బృహద్భక్తి ప్రబంధంబు నా
యది మాతృక్షితి పూర్వసంపదకుఁ జోద్యం బది జాత్యైక్యని
ష్ఠదరిద్రంబున కేడ్చు చోడ్చిన కవోష్ణ-శ్రుప్రబంధం బగున్.

శైత్యధ్వంసి వికుంఠనాథుఁడు కలన్ దద్గ్రంథమున్ బోతనా
మాత్యున్ గోరియదృశ్యుఁడయ్యె-కవిసమ్రాట్సత్యనారాయణ
ప్రత్యక్షాకృతి విశ్వనాథుఁడు ననుం భాషించి నాగ్రంథమున్
బ్రత్యక్షంబుగ స్వీకరించుకొనియెన్ నా వ్రాఁత సామాన్యమే?

పలుకులమ్మయె వచ్చి బమ్మెర వారింట
వంట లమ్మగుట కే వ్యసనపడను
దీనారటంకాల శ్రీనాథకవి తీర్థ
మాడె నన్నందుకే నార్తిపడను
పిల్లలమఱి పిన్నవీరభద్రున కామె
రాణియై నందు కే నూనపడను
పెద్దన్న కవిగండపెండారపుసిరులఁ
దులదూఁగినందు కే దుఃఖపడను.

సత నారాయణ కవిరాట్సంజ్ఞ నదరి
విశ్వతోముఖమ్ముగఁ గైత వడలనడుపు
స్వచ్ఛ విశ్వనాథుఁడె మత్కృతీచ్ఛుఁ డగుచు
నంచితంబుగ నను సత్కరించుచుంట.

ఇంట విశ్వనాథత్వంబు నొంటఁ బరమ
సత్య నారాయణత్వంబు సరిగ నింట
నొంట రెంట సద్బ్రహ్మత్వ మొలికిపోవు
నింత చక్కని కృతిదేవుఁ డెవరి కమరె ?

అని పరవశించి నే నా
యనఘుని సుతిమెత్తని యెద కత్తుకొని వసిం
చను మనసు పడుచు నల న
ల్లన నంటఁ దెలిసికొని యిటుల ప్రబోధించెన్.

గాసింబెట్టను గాదు నాయనుమతిన్ గాదందునో యేమొ! యా
శ్వాసారంభమునందు శ్రీయుత కృతిస్వామ్యంక సంబుద్ధు లా
శ్వాసాంతానఁ గృతీశవృత్తములు షష్ఠ్యంతంబులున్ గల్గఁ బూ
ర్వాసామాన్య విశిష్టరీతిఁ గృతినీయంగావలెన్ సత్కవీ!

ష ష్ఠ్యం త ము లు

ఈ విధ భావజ్ఞ మహీ
దేవగ్రామణికి మణికి ధీ దయితునకున్
శ్రీ విశ్వ నాథ కుల స
ద్భావుకునకు పార్వతాంబ వరపుత్రునకున్.

అతులిత వితరణ శాలికిఁ
దతకీర్తికి సతత సుకవితా లోలునకున్
స్తుతమేరు నగధృతి మతికి
శతాధిక కృతికవికిఁ గవిసమ్రాట్టునకున్.

అబ్జకుల రజనీ విభునకు
ఋజు వర్తనునకుఁ గవిత్రయీ రూపునకున్
సుజ నామిత దోహదునకు
విజయపురీ వాస వీర విప్ర బుధునకున్.

హరిజన కవ్యృప కారికి
హరిహర దేవస్మరణ మహాహ్లాదునకున్
గరుణాంతః కరణునకున్
వరలక్ష్మ్మ భావజునకు వర తేజునకున్.

లలిత కళా పోషణునకు
బల వత్తర దేశభక్తి భారత కవికిన్
గలకంఠ మధుర గళునకుఁ
గళాప్రపూర్ణునకు సుకృతి కళ్యాణునకున్.

ఆ గుబ్బుగ సకల విభవ
భోగపరంపరలు గలుగ బుధనుత మతినై
నేఁ గల్పించిన పృథ్వీ
భాగవత కృతికిఁ గథా వివర మెట్టి దనన్.

# పృథ్వీ భాగవతము.

## స్వరూపస్కంధము

శ్రీమద్వీర రసావతారములు నుర్వీభారనిర్వాహక
స్థేమంబుల్ రవిచంద్రవంశములు వాసింగన్న రాజన్యు లా
వ్యోమాగ్రంబుల కెక్కి దుర్జయజయంబుల్ పెక్కు సాధించి సు
త్రామైశ్వర్యము కొల్లలాడిన చరిత్రల్ వజ్రవైడూర్యముల్ 1

ఆరవిచంద్రవంశములయం దుదయించిరి రాజపుత్రు లం
భోరుహాలోచనుల్ భువనమోహనవిగ్రహు లార్తరక్షణో
దారులు వారు శాత్రవ విదారణదారుణశాతఖడ్గశౌం
గారులు పుట్టిరత్నమయగర్భ నొనర్చిరి భారతోర్వరన్. 2

రవిసామర్థ్య మదెల్ల పట్టపవలారాత్రాంత మాచంద్రవై
భవ మిట్లన్వయకర్త లిర్వురు సలోపస్ఫూర్తి వర్తింపగాఁ
బవలున్ రేలుడివోని తేజముల రవ్వల్ రాల్చుచున్ లోకబాం
ధవులై రారసపుత్రు లున్నతులు జాత్యగ్లాని సైరింతురే! 3

మొగిళుల నీరు తోడఁ గల భూరిభుజాబలశౌర్యరేఖను
సొగసి ధరావధూటి ప్రభుసూనులఁ గొల్చుఁ దనంత దానయా
మగసిరి యిట్టి దండముల మాటనుకోఁ బనియేమి ముగ్ధలై
తెగబడి రప్సరః ప్రమద లీనృపసుందరచుంబనార్థమై! 4

రాణ సెలంగ దిగ్జయపరంపరఁ జూచుచు సాగు పంచక
ళ్యాణులమీఁద విక్రమవిలాసవిహారములొప్ప రాజసూ
యాణము లాచరించెడు మహామహు లారసపుత్రయోధు లా
పోణిమిఁ జెప్పఁ గోనె సరిపోవు చరిత్రను నెల్లప్రొద్దులున్. 5

శ్రీరమ్యంబగు నొక్క రాజు సొగరము నిర్జించెఁ గన్నెత్త; నా
తారామండల మెక్కె నొక్కఁడు తనంతన్ బాణశ్రేణిపై
ధీరోదాత్తులు రాజపుత్రు లనుచున్ దివ్యాప్సరోబృందమున్
నోరూరంగ ప్రబంధముల్ సమువు చుండున్ సుప్రసన్నాకృతిన్ 6

రణమనఁ బండువై రిపుల రక్తవసంతము జల్లులాడి వీ
రణములు మ్రోయఁగా విజయరంభలతోఁ బురమేగు శౌర్యభూ
షణులకు రాజపుత్రులకు స్వాంతలరాజ్యముతోడ స్వర్గప
ట్టణమును కైవసం బయి యెడందలు పొంగిన విందు నందునన్. 7

తూనికరాలతో సరకుఁ దూచినయట్లు కృపాణబాణధా
రానిపుణప్రయోగము లరాతిబలంబును దేల్ప వారు సే
నానినిభుల్ భవానిచరణార్చనలన్ రణకేళులందు పం
డైనధరాపతుల్ జలకమాడిరి కీర్తిపండువెన్నెలన్. 8

ఆకర్ణనిబిడనేత్రాంత రక్తచ్ఛాయ
సరిక్రొత్త సంజకెంజాయ గాయ
తుక్కారఖురలిఖోద్ధూతధూళీపాళి
కటికిచీకట్లు మొగ్గదొడిగింప
శత్రువక్షశ్శిలాశాణితాసిశ్రేణి
కొదమచుక్కలతళ్కు గుస్తరింప
స్వీయప్రతాపరోచిశ్ఛటాహతి నోరల్
మిణికెడుజ్యోతిరింగణముం బూన
తాము సాగించు జైత్రయాత్రామహంబు
శత్రుభూపాలురకుం గాళరాత్రి కాగ
రాజపుత్రులు వీరభారతపతాక
నెగురవైచిరి తమధాటి కెదురులేక. 9

ఓజన్ బంచమహానదుల్ కదలి దిగ్వ్యూహంబునన్ జుట్టిరా
నాజూకైన జిలుంగుముత్యములదండల్ దాల్చి నట్లున్న యా
రాజస్థానపవిత్రభూములు స్వతంత్రస్వర్గఖండంబులై
రాజిల్లెన్ దొలిరాజనందన మహేంద్రప్రాభవాభ్యున్నతిన్ 10

శరణన్నన్ దయమానమానసపురస్కారంబు గావింతు రు
ద్ధురతన్ గచ్చకు డీలినన్ దలలు బంతుల్ సేసి క్రీడింతు రి
క్కరణిన్ నెయ్యముం గయ్యమున్ నెఱపు దక్షత్వంబు వారుగ్గు బా
లరుచిన్ నేర్చిన దెక్కిరాడిచట ఫాలాక్షుండు బొమ్మొడ్డినన్ 11

తమదేశకీర్త్యుచ్ఛ్రయములు మిన్నులకెక్కఁ
దెలివన్నెతోడఁ జుక్కలకు నిక్కి
తమదేశసంరక్షణమునకై ప్రాక్పశ్చి
మోదధులంట బాహువులు సాచి
తమదేశసంపదర్థంబుగా ముక్కారు
పసిఁడిపంటలకు జీవనము వోసి
తమదేశశోభనార్థము శంభునకు పుత్రి
కనొసంగి యిల్లటికమ్ము వెట్టి
తొనకని ధవళనారాయణుని విధాన
రాజిలుచు నుండు నాశైలరాజమణికి
ప్రథనవీరులు భారతరాజపుత్రు
లుత్సవములు సేతురు ప్రతివత్సరమ్ము! 12

అతిగంభీరుఁ డనేకవాహినుల కత్యార్యుండు రత్నాకరుం
డు తరంగప్రథితుండు సాగరుఁ డనుంగుంబుత్రిగాఁ బ్రీతితో
సతతంబున్ దమమాతృధాత్రిని భుజస్కంధంబునన్ మోయుసం
గతి కబ్ధిప్రభుఁ గొల్తు రానృపసుతుల్ కార్తీకమాసంబులన్ 13

అలఘులె యయ్యు నా నృపు లనైక్యముచే నొకకత్తిమీఁదుగా
బలపడు భారతీయపరిపాలనకాండముఁ జిన్నచిన్నవ
య్యల నొనరించుకొంచు నెవరంతట వారె పరాక్రమింపఁగాఁ
దలపడి రన్యభూపతులధాటికి దారులు సన్నలిచ్చుచున్ 14

అరియోధహస్తిసింహస్వప్నతుల్యులు
సమరాన వెన్నిని శౌర్యనిధులు
శరణాగతుల కనిశము ప్రాణదాతలు
తడఁబాటు లేని యథార్థపరులు
సకలకళావికస్వరశీతకిరణులు
పరమార్థ మెఱిఁగిన భాగవతులు
అచ్చపు సోమసూర్యకులసంభూతులు
విజయలక్ష్మివరించు పెండ్లికొడుకు

లైన నేటికి నైకమత్యమ్ము లేక
రాజపుత్రుల యనుపమ ప్రతిభ లెల్ల
బూడిదంబోయు పన్నీరుపోలికఁ జెడియె;
జాతివిద్వేషులకు సిరుల్ సతతమగునె? 15

దేవలోకమ్ముదాఁక కీర్తిగల సుతులఁ
గనియు నవతారపురుషులఁ గనియు సుంత
యైకమత్యమ్మునకు నోచుకోకపోయె
పేరికైనను భారతవీరమాత. 16

వినువీధి నెగురాడు విహగవల్లభు లైన
గుఱిపెట్టి కోలతోఁ గూల్పగలరు
మిగుల నాకొనియున్న మృగరాజునైన ధై
ర్యస్థైర్యముల నేలరాచగలరు

దివి మధ్యమున వెల్గు దినరాజు నైనఁబె
న్వేడిలో నీరుఁ ద్రావింపఁగలరు
నిండు పున్నమరేయి నెగడు చంద్రునైన
దతకీర్తిశీర్షముం దన్నగలరు

ప్రథితవిశ్వవిజయు లయ్యు రాజసుతులు
వారిహృదయాలలోని యుద్భవము నంది
వారినే త్రుంచు విద్వేషభావ మను పి
శాచి నెదులకో గెల్వఁజాలరైరి 17

వైరుల నేరి నేని గెడపంగల విష్ణువు భారతోర్విదు
ర్వారుల భూతరాక్షసపిశాచులఁ ద్రుంచియు జాతివైర మన్
క్రూరపిశాచి నెందులకుఁ ద్రుంచకపోయెనో! దీనికుక్షికా
హారములై నశించినవి హైందవలోక సమస్తభాగ్యముల్ 18

ఆపృథివీశువంశగగనార్కుఁ డనందగి పృథ్విరాజు ఢి
ల్లీపురనేతఁ జంద్రునివలెన్ జయచంద్రుఁ డరాతుఁడై కనో
జీపురి నేలె నిర్వురను జేరువబంధుగు లయ్యు మేటిధా
త్రీపతు లయ్యు నొండొరుఁ ద్రెంప నడంపఁదలంతు రీర్ష్యతో 19

వారి యన్యోన్యబహుబద్ధవైరమునకుఁ
జెలఁగి యీ బెలీబెలె తారసిలుచునుండు;
ఆపురాన వ్రాలిన కాకి యీపురాన
వాడలు మఱచియు నైనఁ గాలిడఁగఁబోదు. 20

కలహాల కలిఁగి పూర్వులతోనె పోఁబోవు
కులగౌరవము నింత నిలువబెట్టి
తమలోఁ దామె కయ్యములాడు రాజుల
ఖడ్గంబు జళిపించి కాలుగట్టి
మాతృదేశము నేల నేతెంచు ఘోరీని
నేడుమారులు పలాయితునిఁ జేసి
ఆదరణము లేక యణగారిపోనున్న
కళలకు గుండెలు కరఁగఁబోసి

ప్రజలఁ గన్నబిడ్డలుగఁ గాపాడ నేర్చి
నయభయములఁ జల్లని పాలనము నొనర్చి
కదనరంగాన నారాచగడ్డ కెల్ల
పేరుమోసిన జయశాలి పృథ్విరాజు. 21

తన ధరించిన చక్కదనపు తురాయిగా
ధర్మకిరీట మాదలను గ్రాల
తన తిన్న వెన్నముద్దలమెత్తదన మెల్ల
నిండార నెనరు గుండియల కెక్క
తన వేణుగాన నాదమ్ము సద్యశముగా
సకలంబు పారవశ్యమున మునుఁగ
తన విశ్వమోహనతకు గోపికలరీతి
నిరతమ్ము రణజయేందిరలు మురియ

ఎందుఁ జూచినఁ దనదెబ్బ కెదురులేక
ద్వారకాపురి ఢిల్లిగా మాఱుమ్రోయ
మాఱుమ్రోగించెఁ దనవీరచారుచరిత
భాగవతముగా పృథ్వీనృపాలవరుఁడు. 22

అతఁడు పసుపుపచ్చనిమేని యందగాడు,
పొడగరి, విశాలనయనుండు, బుద్ధిశాలి,
ధీరహృదయుండు; సొగసు క్షత్రియుల వలపు
వలలకింకను బడని సద్బ్రహ్మచారి. 23

మేటి మగతనమ్మున వానిమీసకట్టు
మెలిదిరిగి జోడు నిమ్మకాయలభరించు;
వాని చిఱునవ్వు వెన్నెల ల్వఱపుమోము
అందచందాల లేఁత ప్రాయమును జూపు 24

వాని విచ్చు కత్తి వాదర తళుకులో
వెలుఁగుచుండు నాజి విజయలక్ష్మి:
వాని సద్గుణమ్ము స్వార్థపూరిత మాచు
మోహారమున కెపుడు పొరలిపోదు. 25

జయచంద్రుండు నృపేంద్రుఁడెఁ
సుయశస్సాంద్రుఁడె రణజయశూరుఁడె ఢిల్లీ
దయితుఁ డనిన సరిపడని వి
షయమషియే యతని ధవళచరితను జెఱచెన్.

అతఁడు కన్పట్టు పదారె కళలతోడ
నితఁ డర్వదికిపైన నతిశయిల్లు
అతఁడు నెలుమాత్ర మాకసమ్మున వెల్గు
నితఁడు కనోజీని నెపుడు వెలుఁగు
అతఁ డడ్డమైన వారందఱికిని మామ
యితఁ డొక్క తనసుతపతికె మామ
అతఁ డాశ్రితుల నెల కరనెల పస్తుంచు
నితఁ డాశ్రితులను సంతతము దన్పు

అతనికన్నను నితఁడు మహాధికుఁ డని
ఇతని కాదని జయశబ్ద మెక్కుడుంట
ఇనుని జూపఁగ కాగడ యేటికనుచు
బుధులు భూపులు జయచంద్రుఁ బొగడుచుంద్రు 27

ఎన్నియుగాలనోములు ఫలించెనో! ఱేనికి క్షాత్రజాతికిన్
వన్నెల దిద్దితీర్చఁగల బాలను గన్నది రాజపత్ని య
భ్యున్నతమైన యాశిశు మహోదయవేళ కనోజివీధులన్
వెన్నెల వెల్లువైనది ద్రవించెను పృథ్వ్యాతంతరాళముల్ 28

చంద్రుఁ డుదయింప జ్యోత్స్నలాశలకు బ్రాకి
కువలయానందమును గూర్చె గొనబుమీర;
చాంద్రి యుదయింప శుభము లాశలకుఁ బ్రాకి
కువలయానందమును గూర్చె గొనబుమీర. 29

ఏడువన్నెలశోభ లీను నింద్రునివిల్లుఁ
గుదురుగాఁ గొప్పున గుస్తరించి
నల్లగొండలడాలు డుల్లఁజేయఁగజాలు
నీలాంబుదపుచీర నెఱిగఁ గట్టి
పెళపెళార్భటులతోఁ బృథ్వీనభంబుల
నదరించు నురుముల యరద మెక్కి
మిలమిల మెఱయుచు మిన్నుల కెగఁబ్రాకు
శంపా లతాళులఁ జలకబెట్టి

పుట్టిన నృపశిశువునకై పురిటినీళ్ళు
కనక కలశాలఁ గైకొని కదలి వచ్చు
రాచపూఁబోండ్ల కరణి వర్షర్తురాజ్ఞి
కడవలను బానలను గొని కదలివచ్చె. 30

భాస్కరోదయవేళఁ బ్రస్ఫుటమ్ముగ విచ్చు
కమలరజస్సుగంధముల గుప్పి
ప్రణవనాదములకుఁ బ్రతిసేయగాఁజాలు
విమలహంసలకూజితములఁ బరపి
వర్షాగమంబునఁ బంకిలంబై యున్న
సరసు లన్నిటిని స్వచ్ఛముగ దేర్చి
ఏకడ నేమచ్చ యేడాగు లేకుండ
దివిమండలము నెల్ల ధవళపఱచి

బారసాలసందర్భానఁ బ్రభుకుమారి
ఖ్యాతి కెనయౌనె మీపైఁడికాన్క లెల్ల?
రాజబంధువులార! యన్ రాణ సాంద్ర
చంద్రికల శరదృతురాజ్ఞి సాగివచ్చె. 31

ఈరీతి నాఋతువు వెను
కాఋతు వాఋతువు పిదప నాఋతు వి ట్లా
యూఋను రాటపుటాకుల
తీరు నొకటొకటి గిరగిరఁద్రిరుగుచు నుండఁ 32

ఎకిమీ డా బాలను గా
నక గన్నకుమారి కావునఁ బ్రాణముపో
లికఁ గని "సంయుక్తా" నా
మకరణమునఁ బెంచుచుండె మమతలు విరయన్ 33

మేనిచాయకు దగు మిసమిసలు గలిగి
చక్కదనమునకుఁ దగు రాచకళ గలిగి
సకలలక్షణముల తెన్ను చాలియున్న
ఆమె సంయుక్తయగుట కేయబ్బురంబు? 34

కనుపట్టు నొకవేళ బునుగుపుట్టంబుల
నృత్యించు పింఛంపునెమిలిపోలె
తలచూపు నొకవేళ ధవల దుకూలాల
నందంపునడల రాయంచపోలె 35

అగుపించు నొకవేళ హరితంపువసనాల
జిలిబిలినడుల రాచిలుకవోలె
పాడగట్టు నొకవేళ కడునీలిదుస్తుల
గీతించు గానకోకిలమువోలె
సహజసుందరు లబలలు సకలరమ్య
పరికరము లుడుపులుఁ బూలు వారివె యిఁక
క్షితిపుసుత లేకలేక కల్గినది యదియుఁ
గాక యేకైక తనజోకు కె కొలంత ? 36

వాయుగమనపుఁ దురాయిపిట్టలవంటి
జవనాశ్వముల స్వారిసలిపి సలిపి
తుదముట్టగాఁ బండితుల సమక్షమున శా
స్త్రపురాణకావ్యముల్ సదివి చదివి
కదనవీరులంతోడ గరిడీలలోఁ జేయి
తిరుగంగఁ గత్తులఁ ద్రిప్పి త్రిప్పి
సిగ యెగఁగట్టి "కుస్తీ" రంగమునఁ గానె
కట్టునఁ బల్లటీ ల్గొట్టి కొట్టి
పున్నమకు దుగ్ధనిధివోలెఁ గన్నకడుపు
ప్రమదమునఁ బొంగిపోవంగ రాకుమారి
కతలమారిపోకల బాల్యకలన గడచి
వాసి గడిదేఱినది నెలవంకపగిది. 37

కరఁగిన పదియాఱుకళలబంగరువంటి
మేఃకి మేల్మిక్రొమ్మిసిమి హెచ్చ
వసనమ్ము కనుమాటు వక్షోరుహము లూరి
యడుగుదమ్ములకు క్రొన్నడక వచ్చె
కాకిచిప్పలకనుంగవ చేరలకు మీఱి
వలపుబెళుకుల క్రొంగులుకు నేర్చె
తమకపుముచ్చటల్ తడవు సన్ననికంఠ
మొలయుచుఁ దేనె క్రొంబలుకు సెలఁగ
వలచినట్లు దిరుగ నలవాటువడిన
తలపులకు వింతసిగ్గుదొంతరలు వొడమె
పదియునాఱేండ్ల లేఁతజవ్వనపుఁ గలిమి
వచ్చిన కతాన నద్ధరావరునిసుతకు 38

అని శూరుండు బలాధికుండు ఘనవంశాచారరమ్యుండు సజ్జనమిత్రుండని పృథ్వీరాజు గుణముల్ సంయుక్త భావించి యాతని ప్రేమించిన దాతఁడా యువిదచందం బందముల్ వించు నచ్చినరాకన్నియగా మరుల్గొని వరించెన్ భావబంధంబునన్ 39

ప్రేమంపుంగవుఁగిళ్ళఁ గమ్మతలఁపుల్ జృంభించు నుద్రిక్తపుం
గౌమారమ్మున రాజనందనులు బిగ్గన్ గచ్చడాల్ గట్టినన్
గామం బూరకయుండఁ డేకలికినో! కన్గొల్పి యేయాశలో!
"జామీఁనునుంచి వియోగవహ్ని శిఖలన్ స్రగ్గించి మ్రగ్గించెడిన్ 40

కలలను మెలకువలను మరు
లోలయఁ దిగిచి యొకరినుండి యొకరి కడకు పూ
విలుకాఁ డెచ్చరికం గొని
వలపు టపాల్ నడిపినాడు వైన మెఱుఁగుచున్ 41

పృథ్వీరాజసంయుక్తల ప్రేమఝురికిఁ
గఠినజయచంద్రనృపు, డానకట్ట యయ్యె;
విరహసంతాపభారాగ్ని వేదనలకుఁ
దరుణి సంయుక్త యొకతీరుఁ దరుగసాగె. 42

జను లెవ్వారికి నందరాని యటుగా సంయుక్తసౌందర్యపుం
ధననిక్షేపముఁ గాచియున్న జయచంద్రవ్యాళముం బట్టి యే
యనువైనన్ గొనిక్కోరలూడ్వనియతుండై మాంత్రికుండై చుమిం
చిన తెంపుంగొని పృథ్వీరాజదనుబాంచెన్ రాగనిర్మగ్నుఁడై 43

విరహవేదన కత్తిన వేఱెరూపుఁ
దనవలపుకాఁ డెఱుఁగ కేడసియె కాని
హంసియో! కాక భ్రమరియో! యాచు ప్రియుని
మ్రోలప్రణయిని రివ్వనవ్రాలలేదె! 44

చీమ చిటుక్కుమన్నఁ దనచెల్వుఁడె వచ్చెనటంచు సిగ్గుచే
మోము బిరానవంచుఁ, గనుమూయుఁ, జలించు, మరల్ నెలంగనే
మో మదినెంచుకొంచుఁదలయూచు, దెసల్ పరికించియెవ్వరున్
రామికిఁనయ్యయో! కరుణరాదుగదా పతి' కంచుఁ జింతిలున్ 45

వనవిహారము సేయఁజని గండుఁగోయిల
పలుకుల కేట్రికో! యులికిపోవు
ఒండొంటిఁ బెనఁగొని యున్నలతావృక్ష
ములజంట కేట్రికో! కలఁతపడును
పూచి గుబాళించు పూవుగుత్తుల యంద
చందాల కేట్రికో! దందడించు
నవనవలాడు క్రొంజివురుజొంపములఁ గో
యఁగబోయి యేట్రికో! యట్టెనిలుచు
పదములాడక మది కేమి పాలుపోక
నిలుచు నడయాడు. నేట్రికో! నివ్వెఱపడు;
వలపు తలకెక్కఁగా నిట్టితలపు లగునో।
ప్రేమ మయమౌచు విశ్వమే ప్రీతినిడునో! 46

ప్రార్థించు నొకసారి భక్తితోఁ దనవాంఛ
నీడేర్పఁ డని పార్వతీశ్వరులను
రచియించు నొకసారి రౌద్రరసమూర్ఛరఁ
బ్రియు వీరగాథ కవిత్వఫణితి
చిత్రించు నొకసారి చిన్నికుంచియతోడఁ
గళలూర ప్రియునిచక్కందనంబు
వాయించు నొకసారి వలపుగీతిక లెత్తి
పంచమశ్రుతిఁ బిసాళించువీణ

గొప్పకేదైనఁ గొఱఁతను గూర్చునలువ
నాకు నేదైన వెలితి పన్నంగఁ దలచి
వ్రాయలేదేమొ! వానిఁ జేపట్టుభాగ్య
మనుచుఁ దపియించు నొకసారి యజు శపించు 47

స్వర్గ సౌందర్యసంపత్తి జల్లెడఁబట్టి
పుడమిపై మరుఁ డారబోయు వేళ
యుగయుగావిర్భూత మొకదివ్య సంగీత
ఝురి లోకమున సుళ్ళుతిరుగు వేళ
నందనారామ మందార మందానిల
మ్మొరసి యీనేల నిట్టూర్చు వేళ
చంద్రమండల సుధా సారశైత్యము క్రమ్మి
భూగోళమే గగుర్పొడుచు వేళ

దేవకన్యల పెదవుల తీయదనము
పూవు పూవున మధువుగాఁ బొంగు వేళఁ
గలఁత లోఁగొన్న సంయుక్త నలరఁజేయ
తోడి చెలులు పూఁదోఁటకుఁ దోడితేర. 48

కోకిలా! యూరక కూసెద, వేటికే
యిగురాకు మేతకే యింత పొగరు?
జుమ్మజుమ్మని యింత శ్రుతి యేటికే తేఁటి?
యేలె బిచ్చపుకూటి కింత బిగువు?

తలిరాక! బలుకెంపు లొలికింతు వెందుకే
  యీపూటబ్రతుకుకే యింత వగరు?
తగిలి వీచెదవు గంధసమీర! యేలరా?
  యేరూపు లేకున్న నింత పగటు?
ఇష్షు! అబ్బబ్బ! చెవులు దిమ్మెత్తిపోవు
చున్న వాపరేమే మీ ప్రపన్నరుతులు?
ఇరుకులాటైన నేస్త మీ కింత చెలిమి?
వలపు చవులూర! చిలుక గోర్వంకలార! 49

అంతకదూతలైన యళులార! విహంగములార! పాంథులన్
వంతల బెట్టు పట్టున ననంగుఁ డనంగుఁడెఁ మీరు మీరలే
యంతకుఁదగ్గ దొంతలగు టట్టులు లయ్యెడుఁగాని లోకమే
యంతముకాదె మీకు నిసుమంత శరీర బలంబు లుండినన్? 50

అకరుణుఁడై వసంతుని సహాయము తోడుగ మిమ్ము నెల్ల సే
వకులుగఁ గూడఁగట్టుకొని పాంథులఁ గొందఱఁ బెట్టుచున్న యు
మ్తకరపతాకుఁ డేడీ? యణుమాత్రము గన్పడఁ డేమి? యూను! హా
ర్తకు నధికాపరాధికిని రచ్చకు రాను మొగమ్ము సెల్లునే! 51

లేవు శరీరరూపములు, లేవు సుదీర్ఘపు నారిసింగిణుల్
లేవు ప్రగాఢబాణములు, లేవు ప్రతాపచమూ సమూహముల్
లేవు గజాదులైనఁ గడులేఁతయెడందల కేమిచెప్ప నీ
లావు? మనోజ! మెత్తనిస్థలాల ఖనిత్రము వాడియౌఁగదా! 52

చలువ వెన్నెలలోనె మంటలను జెఱఁగి
చంపుచున్నాఁడు పాంథులఁ జందమామ
మేనమామయ్యెచాల ప్రసూనబాణ!
వచ్చినది నీకు జగ మిఁకేవలన బ్రతుకు? 53

జగము లేలెడు నల్లని చల్లనయ్య
ముద్దుపట్టివి మృదువైన పుష్పబాణ!
విషముతోఁ బుట్టినట్టి యావిధునితోడ
అయ్యో! చెలిమియా నీ? కంచు నంతలోనె. 54

మదనునిపై ననాదరము మానుచు ముంగురుగండు తేఁటులన్
వదలక యాననాంబుజముపై కెగద్రోలుచునున్న కుఱ్ఱగా
డ్పుదుడుకు చేఁతకున్ గినుకపుట్టిన- గంధసమీర! పాంథులన్
బదవలువెట్టుటేన పని? పాపపుచెయ్దము లేన మన్గడల్? 55

మూడుజగాల కాయువులువోయు. నిరంతరపుణ్యశాలియై
గాడుపు! కేల్వకున్ రకరకమ్ముల కమ్మని తేనె కన్నె పూఁ
బోఁడుల కుద్భవించి యతిముగ్ధల నేఁచు ననంగుతోడనా
కూడిక నీకు? గంధవహా! గోడ్పడకుందువె కీడుచేఁతకున్? 56

నీయటు లేఁచెనే యతఁడు నీ కనుజన్ముఁడో! యగ్రజుండో! మీ
నాయన కంజినీసతికి నందనుఁడైన ఘనుండు. దీన ర
క్షాయతనుండు, దివ్యదుపకారపరాయణుఁ డేడుకోట్ల రా
మాయణ మాతఁడై పొలుచు మందసమీర! జగద్ధితంబుగన్ 57

పుట్టిన నేరికిఁ జెడుగు పుట్టగనీయక యెంతయేని మేల్
పుట్టగ విల్లసిల్లవలెఁ బుట్టినపుట్టువు దాన నిల్చుచుఁ
బుట్టును సుప్రతిష్ఠ యది పుట్టనిపుట్టువు లేటికయ్యెడుఁ?
పుట్టదె పుట్టలోఁ జెదలు? పుట్టిన నేమిహితంబు పుట్టెడుఁ? 58

ప్రాఙ్నగమ్ములనుండి పశ్చిమగిరులకు
భ్రుకుటిలోపలనె యెక్కి దూకఁగలవు
జలజమ్ములోఁదాని సంపెంగలోఁ సౌరు
సులువుగాఁగొని కలమెలపఁగలవు
పోతుటీగెలకేనిఁ బోవ నలవిగాని,
యంతఃపురులకైన నరుగఁగలవు
ఆవంత ప్రతిఫలం బాసింపకయె యెల్ల
భువనాల కూపిరిపోయఁగలవు

గంధమారుత! నాయందుఁ గరుణగలిగి
ఎత్తిఁగివత్తువే నాన్నపాలేంగితమును?
అయిన ఫలమేమి యేల మాటాడఁగలవు?
నోరులేదయ్యయో! పనివారికవని? 59

వదనంబున్ గమలంబుగాఁ దలఁచెనో! వక్రంబులై మోముఁ
గదలించాతెడు నీలిముంగురుల భృంగశ్రేణిగాఁ గాంచి వా
నిదరిఁ ద్రిమ్మరసెంచెనో! పవనునిన్ జింతించుకొంచున్న యా
సుదతిన్ మూగెనుబంభరంబాకట్రిజ్జుమ్ముంచుఁబెన్ మోతలన్ 60

మూగినతుమ్మెదఁ గని నీ
యూగడ మెఱుకయ్యె నాగు మాగుము భ్రమరా!
త్రాగితివా! యేమొ! క్రిందుం
బైఁగానకయుండి లెస్స మధురిమ మధువుల్. 61

చంద్రబింబంబు నామోము చాలు చాలు
పంకరుహ మని విభ్రాంతిపడితివేమొ!
మూగబోకుము పోకుము త్రాగుబోతు
ల కకట! యెచటివి వివేకలక్షణములు.? 62

త్రాగుడే నీకు లేకున్న భ్రమరరాజ!
మురళికృష్ణునితో నిన్ను బోల్చవచ్చు
నీ కుసుమవిహారమును నీనీలిమెయిని
నీ మధురఝుంకృతిని బట్టి సక్కవముగ. 63

ఈవని బృందావని, యీ
పూవులు గోపికలు నీవు పొనరుచుమధురా
రావము వేణునినాదము
కేవల మీవును మరందకృష్ణుఁడవె యళీ! 64

ఈపూలవాహ్యాళి యేలీలఁ బ్రాప్తించె?
బ్రహ్మవే నీవుగాఁ బడసినావా!
ఈతీపిఝుంకార మేరూపమున వచ్చె?
వీణానినాదంబుఁ బెఱికికొంటో!

ఈసిలిమైచాయ యేలాగు లభియించెఁ?
జేడెల జడనుండి యూడిపడితో!
ఈశ్వేతపానీయ మే తెఱుంగున నబ్బె?
భాగ్యదేవతగర్భఫలము వైతో!
రంగుల వికసించి రమ్మను నొకపువ్వు
సురభిళించి యొక్క సుమము పిలుచు
జపము లేమిసలిపి జన్మించితో భృంగ!
పూలతోనె నీకు ప్రొద్దుపోవు.'' 65

అని చింతించు నృపకుమా
రిని గమనింపకయె తనకు ప్రియమొనరుప వ
చ్చిన లలనలు పరవశలై
వనవిహారణమును సలుపుచుఁ బ్రమదమునదరన్. 66

అటనటఁ గుహూకుహూ యని కూయు కోయిల
కూఁతలకుఁ బ్రతిగఁ గూసికొనుచు
వికసించి వాసించు విరికెల్లఁ బరువెత్తి
తుర్రించి వేణులలోనఁ దురుముకొనుచు
అబ్జంబు లనుభ్రాంతి నాననంబుల మూగు
తులువతేంట్లఁ గసరి తోలుకొనుచు
ఎవ రేమి యనకున్న నేమేమొ! యనినట్లు
లతిగర్వమున వాదులాడుకొనుచు

మిసిమిఁ గులికెడు కొమ్మలఁ గొసరిపలుకు
చిలుకగోర్వంకలను జేరఁబిలుచుకొనుచు
అలరుఁదీగెలఁదూఁగుటుయ్యెలలఁ గట్టి
తోడు తోడుగ మిన్నంటఁ దూగుకొనుచు 67

మెలఁతయొర్తొక తెను మిసిమిగులాబీని
ముట్టనా? యని దానిబుగ్గ ముట్టె
కలికియొర్తొక తెను గజనిమ్మపండును
గొట్టనా? యని దానికుచము గొట్టె
తెఱవయొర్తొక తెను దియదొండపండును
జిదుపనా? యని దానిపెదవి జిదిపె
వెలఁదియొర్తొక తెను విరియు గంధఫలిని
నొక్కనా? యని దానిముక్కు నొక్కె
ఒకతె నొకమిష నొకతె నేమో! యొనర్చె
ఎసఁగి ఋతురాజు రతిరాజు మసలుదోఁటఁ
గడఁగి యేపెడసరపుఁబోకడలు వోవ
రీడుబాఱియమ్మ వచ్చినయింతు లొంటి? 68

ఒకభామచరణాహతి కశోకము రహించి
యొకనాఁతి మృదుగీతి కొకటి పూచి
ఒకయింతికౌఁగిలింతకు కురువక మొప్పి
యొకలేమనవ్వున కొకటి పూచి

ఒక కాంతముఖర క్త్రిమకు జంపకము హెచ్చి
గొక చేడెచూపున కొకటిపూచి
ఒకచాన చెయితాకునకు రసాల మెసంగి
గొక బోటియూర్పున కొకటి పూచి
ఇటులె గొకనారి కొకతరు వింపునిూటి
శోభపై శోభ సుధలపై సుధలు దెరలి
తావు లెగజిమ్ముచుండె నాపూవుందోంట
వనితలకతాన నేది శోభనముగాదు? 69

గడుసరి దోర్త తెట్టెపయిం గాలిడుకందురుపిండుం జూచి మా నడుములసౌరుం బుచ్చుకొని నారంటె "మీ మొదలార! మీసిరుల్ సెడ" యని వేణిలోని విరిచెండుల రువ్విన నవ్వి రేంగి వెం బడిబడి తోలి కుట్టెన వమానుషచేష్టకు చేటుదప్పునే? 70

ఈరీతి నాసుమవన వి
హారమును సలిపి సమీపమందున్న సర
స్నీరమునం జీరెల నునిచి
నీరక్రీడలకు డిగిరి నీరజవదనల్. 71

దొండపండుల నటుండుండు డనెడు తేనె
పెదవుల నెంత చుంబించుకొనెనో!
చేరలంతలయి భాసిలు సోగకన్నుల
సోయగమ్ములనెంత చూరగొనెనో!

వెలుఁగులీనెడు గులాబీవన్నెబుగ్గల
మెత్తందనము నెంత హత్తుకొనెనో!
గజనిమ్మపండ్లకు బుజువైన గుబ్బల
కమ్మకస్తురినెంత కలిపికొనెనో!
చెలులు మునిఁగి తేలునపు డక్కొలనిజలము
తాను దీపి నొక్కట్టిఁ గొని తక్కినజిగి
మృదులమును దాచి తనుగొల్చు మీనములకు
జలజముల కొసంగనన నాకొలఁకెసంగె. 72

నెమలియీకఁ దురాయిగ ముడుచుకొన్న పు
ష్పలతా కిరీట మాదల నిడుకొని
కన్నుదోయికిఁ బెట్టుకొన్న కాటుక నెల్ల
నల్లగా నెమ్మోమున కలఁదుకొని
కుచ్చెల ముంగొంగుఁ గచ్చగా సవరించి
యొల్లెవాటుగ నోణి నొనరుచుకొని
జలకమాడెడు చేడియల చేలముల నెత్తు
కొనిపోయి చెట్టెక్కి కూరుచుండి
భువనమోహన స్వామిగా మురళి నూది
"ఇంతులారా! యివియె చీరె లిచ్చువైతుఁ
జేతులెత్తి నమస్కృతుల్ సేయుఁడనుచు
భాగవతమాడె చిత్రియన్ భామమోర్తు. 73

భవనమున నంటకంబె నవ్వానమునందు
ముల్లుపుచ్చి కొజ్జడచినపోల్కి యగుచు
వ్యధలుపోయెడు రాసుత నరసి చెలులు
మగిడి యింటికిఁ దెచ్చిరి మనసుమార్చ. 74

ఆడి పాడి రాచయతివలు విడిపోవ
వట్టిపోయినట్టి వనముపోలె
వెలిఁగి వెలిఁగి వేడివేలుఁపు విడిపోవ
కాంతిహీనమయ్యె గగనతలము. 75

పార్థివుండు లేని పట్టణ విభవంబు
క్రూరు లాక్రమించుకొన్న కరణి
లోకబాంధవుండు లేకపోవుటఁ జేసి
అంధకార మవని నాక్రమించె. 76

గోకుల కృష్ణులైరి యువకుల్ నెఱిప్రాయపు గబ్బిగుబ్బెతల్
గోకులభామలైరి, కొలఁకుల్ యమునాతటు లయ్యె, వృక్షముల్
చీఁకటిద్రుమాకు లయ్యె, నవలీల నభంబును భూమి సర్వ మే
కాకృతిఁ గృష్ణభాగవతమయ్యెఁ బ్రగాఢతమంబు పెంపునన్ 77

కృష్ణమురళి మధురగీతికలం దున్న
సృష్టిఁ బరవశింపఁ జేయుకైపు
ఇరులకుఁ గలదేమొ! యెల్లజగతి దాన
మచ్చుచల్లినట్లు మాటు మణఁగె. 78

ఉన్నతోన్నత మృదుశయ్య నొడలు సాచి
కూర్కుచుండెను వటువ గుబ్బలాడి
బొనుగు పయ్యెదం గల జరీపూలఁ బోలి
చెలి నింగినిఁ జుక్కలు నివ్వటిల్లె. 79

శ్రీదేవీ ప్రియవల్లభాంఘ్రియుగ సంసేవ ప్రభా భాసురా!
వేదజ్ఞానసధీ! దయార్ద్రహృదయా! విశ్వేశ్వరోద్యద్వర
ప్రాదుర్భావక! విశ్వనాథకులచంద్రా! సత్యనారాయణ
స్వామ్యదేవాగ్రణి! పాండితీకవిభవా! మాధుర్యభావార్ణవా! 80

హరిజన కవృద్ధారక!
హరిహర దేవస్మరణ మహాభక్తిధనా!
ధరణీసురకుల సాగర
హరిణాంకా! యతిజిత మకరాంకవిలాసా! 81

పృథ్వీవృత్తము.

అమోఘకవితాచణా! యసముదాత్తతా సద్గుణా!
రమారమణకీర్తనా! రచిత దివ్యరామాయణా!
యమేయభగవద్ధనా! యనిశ వేదపారాయణా!
ప్రమోదచరితాఘనా! ప్రబల సద్యశఃకారణా! 82

ఇది బిర్నీడివంశ సంజాత సంతోష మోక్షకవి తనూభవ
ప్రసన్నకవి ప్రణీతంబయిన పృథ్వీభాగవత
ప్రబంధంబునందు స్వరూపస్కంధము.

# పృథ్వీభాగవతము

## చిత్రస్కంధము.



భారతి విలసద్రూ
పా! భాషాకోవిద శోభ నాద్రికుమారా!
సౌభాగ్య చతుర్ముఖ వం
శా భరణా। విశ్వనాథ సత్యకవీంద్రా!

ఏకాంతమునఁ గనోజీ
భూకాంతుని కోమరిత పటమున పృథ్వీరా
డాకృతిఁ జిత్రించెడు తఱి
నాకస్మికముగ నొకఋషి యచటికి వచ్చెన్.

అతఁడు వచ్చుచునే "మధురాధరోష్ఠి!
అప్రతిశ్రీ జయోస్తు దీర్ఘాయురస్తు
అభిరతిపరిణయ ప్రాప్తిర" స్తటంచుఁ
చివురుఁజేతుల నెత్తి యాశీర్వదించె.

సిగతోడఁ దెగపండి మొగమందమును డాచి
రవణించు మీసగడ్డములఁ జూచి
అధరంపుగదలిక నంగుష్ఠ చలనానఁ
జరుగుచుండిన జపసరముఁ జూచి
ముంజేతులవఱకు మొనసి రంజిలుచున్న
కెంజాయ నిలువుటంగీని జూచి
మెడలోని రుదురాకు లెడమచంకన త్రిదం
డమ్ముఁ బిడికిటఁ గమండలముఁ జూచి

"మౌనివరు లహో!" యంచువిస్మయముపడుచు
వచ్చినఋషికి నృపపుత్రి స్వాగతముగ
నంజలింపదు కూర్చుండు డనియు ననదు!
వెఱఁగు లెపుడుఁ గర్తవ్యవిస్మరులు గారె?

ఎవఁ డీమీసలపోతుభూపతి? సుగాత్రీ! విష్ణువా? పద్మ సం
భవుఁడా? యీశ్వరుఁడా? రమాతనయుఁడా? మార్తాండుడా! చంద్రుడా?
చివురుంజేతుల వన్నె వన్నియలకుంచెన్ దీర్చి చిత్రించుచుం
టివి యోహో! యతఁడా యితండు కనుగొంటిన్ గంటిలోఁ గంటితో!

"పతియే దైవము ప్రాణముం బ్రతుకు సర్వంబన్న భర్తృవ్రతా
ద్భుతపాఠంబును నీకు నేగురువరుల్ బోధించిరే? తల్లి! భా
రతసాధ్వీ! ప్రతిలేని నీవ్రతసుచర్యార్థంబునన్ సృష్టికిం
బ్రతిసృష్టిం బొనరించు నీప్రతిభ బ్రహ్మాండంబు గొండాడెడున్.

యతిలోకోత్తరుఁ డాఋషిప్రవరుఁడౌనా! యంతవాఁడాఁకటన్
వెతగా నీగృహసీమ నిల్చి "భవతీ భిక్షాంప్రదేహీ!" యనన్
బతిసేవానిరతిన్ విలంబముగఁ దన్మానిన్ గటాక్షించుచున్
సతిధర్మం బెఱిఁగించు నీ కథ జగన్మాన్యంబు గాదే క్షితిన్?

ఆపె యనంతు నాత్మరమ, యాపె జగత్కృతికర్త రాణి, య
య్యాపె శివయ్య శాంభవి కదా! నినుగొల్చు నిమిత్తమేమిటో!
బాపురె! ధన్యమీపుడమి భారతజాతి కిఁకేమి కావలెన్
నీ పతిభక్తి సంయుత పునీత యశశ్రుతికన్న మానినీ!

త్రోలి లంకేశుఁడు నీకటాక్షము నురుద్భ్రాజంబు నీయాగ్రహం
బలఘూగ్రాస్త్రశరార్చిమృత్యువనుక్రోడాఁయెన్ సమస్తాగమున్
గలుగఁజేయు విరించిదేవునకు నైనఁ లేని యంతంతలా
తిలకాయల్ పడియున్న నేమిటికి మేధస్సింత లేకుండినన్? 8

పతిజీవితార్థమై బాలభాస్కరు నాపి
యుదయంబుఁ గానీయ కున్నవాఁడు
ముగ్గురుమూర్తుల బుల్లి బుజ్జాయిలుగఁ జేసి
ప్రియమారఁ గుడవంగఁ బెట్టునాఁడు
యమునంత వానినే యడలించి సిరులతోఁ
బతిజీవమునుగూడఁ బడయునాఁడు
ప్రజలెల్ల మ్రొక్కంగఁ బ్రాణనాథునితోడ
గగనవీథులకెక్కఁ గ్రాలునాఁడు

అమ్మ! నిను గని మనుపు పుణ్యములకతన
భరతజాతి కబ్బిన యశోధ్వానములకు
వేల్పులును విశ్వవిశ్వంబు విస్తుపోవ
భూనభోంతరములు మాఱుమ్రోగిపోవె? 9

అధ్వాన పడవిలో నాశించినంతనే
వట్టిచెట్టుకుఁ బండ్లు పుట్టునాఁడు
ప్రియుని సందేహనివృత్తికై చితినిల్పి
యొడలింత వసివాడ కున్నవాఁడు

భరతసాధ్వీ మహాత్మ్యముఁగూర్చి నార
చించిన రచన నక్లై వల్లించినారు;
మీరలెఱుఁగరే నాతేనిమీఁదివలపు?
గుడిని మ్రింగెడువారి కప్పడ మదెంత? 19

మీరుమహానుభావులకు. మీయనురాగములోన లక్ష్మియుకా
మీ రహించుచుండు నవనీస్థలి శాంభవి, మీ వచస్సులకా
శారదతాండవింప ననిశంబును దాన జగద్విరాగులై
వారక సంచరించెద రపారకృపకా విబతిభాన్వితంబుగన్. 20

కల్పవృక్షంబె నాపాలఁ గలిగియున్నఁ
గొమ్మకొమ్మను నేఁ గోరుకొనఁగ నేల?
యతికులోత్తమా! వేతేమి యడుగుకొందు
నవును భవదీయ నామంబు విని తరింతు. 21

అనినన్ "జానా! నేనా
ధునికాగ్నిద్యోతనుఁడఁ గుతూహలమున నూ
తన రుక్మిణీ రమా కృ
ష్ణనృహారులకు సన్నిహితమొనర్పఁ జరింతుకా." 22

అనెడువానికి సంయుక్త యంజలించి
"ఋషివరా! తాము సెలవిచ్చువిషయమేమి?
వైర మేమాయె? పరిణయవైభవమునఁ
బడఁగ దించితిరి మన సంభాషణమును. 23

మీ రగ్నిద్యోతనులే
కా రస రెవ్వారు గాని కారుణ్యమునన్
మీరౌనకుచు శుభనుల కే
దీ రుక్మిణి? కృష్ణుఁ డేడి యిపు డిచ్చోటన్?” 24

అనుచున్న రాకుమారి వ
దనము నెగాదిగ నరయుచు “ధాత్రీశ్వరనం
దన! నిజమహిమంబులఁ గనుఁ
గొనలేకుండుట సహజమె గుణఘనుల కిలన్! 25

అభినవకృష్ణుఁడు పృథ్వీ
ప్రభుండు కాఁడా? తదధిపు వలచిన యవనీ
విభుసుత రుక్మిణి కాదా?
ఇభగమనా! యెఱిఁగి యేల పృచ్ఛించుట” నన్? 26

అనుకొన్న యన్నిపను లా
యెను, శ్రమదీఱె, నిఁక వేష మేలా తుదము
ట్టిన నాటకమున? కైపో
యిన పెండిలికి మఱి మేళ మేలా?” యనుచున్. 27

బాహువిద్యుల్లతల్ స్వర్ణద్యుతుల్ సిమ్మ
జపమాల దండంబుఁ జాఱవైచి
పొడవైన జడతాఁచు బుస్సన దిగజాఱ
మాయంపుజడల కేల్లాయిఁ దీసి

చిటుగులాబీవన్నె చెక్కిళ్ళు చివురింప
టకటొంకు మీసగడ్డములఁ బెఱికి
వలుద గుబ్బలుఁ జీరెచెలువంబుఁదొలుకాడఁ
బైనున్న నిలువుటంగీని విడచి

కొలఁది కొలఁదిగ రతనాల కోమనుండి
వెలికివచ్చి నిల్చిన నాగ లలనఁ బోలె
చల్ల చల్లగ మౌని వేషంబునుండి
వెలువడుచు నిల్చెఁ దనమ్రోల వెలఁది యోర్తు. 28

నిలిచిన వెలఁదిని గను చది
కలయో! నిజమో! నిజమ్ముఁ గానక లోలోఁ
దలపోయు నృప సుత యవల
"చెలీ!" యని పిలిచిన దానఁ జెలిగ నెఱుఁగుచున్.29

"చిత్రా! నీవఁటె యాహా! యేమి నిపుణశ్రీగల్గు చిన్నారివే!
ధాత్రిన్ సంస్తవనీయులౌ కపిలసూతాగస్త్య కౌండిల్య క
ణ్వాత్రివ్యాస మరీచదక్ష భృగు విశ్వామిత్రులం బోలు స
త్పాత్రన్ దాలిచి యెంతనాటకముసల్పన్ జాలినావే త్రుటిన్?30

నేమోసపోతి ఋషిగా
నేమే మొ! పలుక ఋషులపయిఁ గలుగుభక్తిన్
సామాన్యమె యది; యింతకు
నేమిటె యీనాటకంబు? ఋషి వేషంబున్?" 31

అని ప్రశ్నించినఁ జెలియా!
తినఁబోవుచుఁ గూరలరుచిఁ దేలనడుగుటే
లనె? వధువు లేక పెండిలి
యొనఁగూడునె? యదె వచింతు నూహింపు మికన్! 32

కాని నృపుని నీవు వలచి
మానవివిరహంబునఁ బడి క్రుస్సుటఁ గని నే
నానృపుని నీకుఁ గూర్చుట
యే నాయీపాత్రకు నితివృత్తంబు చెలీ! 33

సుఖముల కెడమై యాప
న్ముఖమునఁ దగులుకొని దుఃఖపోవుసమయమం
దఖిలం బెఱింగియుండియు
సఖులను రక్షింపలేని సఖ్యం బేలా? 34

నాసఖి వాంఛసేయు నరనాథునిసంగతి యింత కెట్టిదో!
తా సరసుండో! కాఁడో! విశదంబుగ దద్విషయం బెఱుంగఁబే
రాసన ఢిల్లికిన్ జనితి నానృపుఁ డచ్చట లేకపోయె నీ
కోసము నాఁడు నేఁ బడినకుందులకుం బ్రతులున్నవే సఖీ! 35

ఆఁడుఁగోడునఁ బుట్టరో! యఘముగాదో!
కుట్టిదొంటిగఁ గనపడ్డ గోచిగాండ్రు
బ్రతుకనిత్తురే? యవను లే! యతివఁగన్న
బమ్మకైనఁ బుట్టునఁటగా రిమ్మతెగులు. 36

సిరిగలయిండ్లకు చోరులు
గొఱియలకు గసాయులుఁ బులుఁగులకుఁ గిరాతుల్
తరుణీమణులకు మూర్ఖులు
పరికింపఁగఁ గరుణలేని బాధకులుగదా? 37

మోసకులకన్నఁ గప్పను
భోషాణము లుండె రత్నముల కోసుదతీ!
యోషిద్రత్నములకు మా
ర్వేషములు ముసుఁగులుఁ గాక వేఱేవి గతుల్? 38

ఆఁడురూపును మగరూపు నద నెఱింగి
మార్చుకొనుతీరు వేషంబు మలఁచుకొంటి
కార్యసమయోచితజ్ఞత కలుగకున్న
యత్నములు సఫలీకృత మ్మగుట వమ్మ ! 39

తొడుగుకొన్నాను నాతీరు లడరనీక
శిరమునుండి చరణములవఱకుఁ దనరి
అరయ గాజుకన్నులు దీర్ఘకరము లున్న
నీలివసనంపుముసుఁగు మైనిండ నెసఁగ. 40

ఱేఁడు వేఁటాడ నరగిన జాడ నెఱిఁగి
నా యధిష్ఠించిన హయంబుఁ బ్రాయకముగఁ
గానకు మరల్చి యదలించినానొ! లేదొ!
పక్షివలె నది రివ్వునవచ్చి వ్రాలె. 41

నేరేడుల్ బదరుల్ కదంబములు గన్నేరుల్ శిరీషంబులున్
మారేడుల్ పిచుమంద కుంద సరళుల్ మందార జంబీరముల్
గోరంటల్ వటముల్ కురంటకలు టేకుల్ కోవిదారంబు లం
జూరుల్ బూరుగులాదిగాఁగలమహాచోద్యాటవిఞ్జొచ్చితిన్ 42

కలికీ! యవ్వని నాశ్రయించుకొని సింగంబుల్ కురంగంబు లే
దులువ్యాఘ్రంబులుమన్నుభిల్లులెనుబోతుల్ భల్లుకంబుల్ కణం
తులు దుప్పుల్ చమరీమృగంబులు కిటుల్ త్రోడేళ్లు కుందేళ్లు తే
చులు పిల్లుల్ శరభంబు లేన్గులు చరించున్ యూధయూథంబులై. 43

బాపురే! యేమి యానృపునిబాణకళానిపుణత్వ మొక్కయే
దూపున ఘుర్ఘురించుకొను చోరగఁబారుచు నున్నఁ జూచి నే
దూఁపు నిగుడ్పఁ దానెటులదూరమునుండిగ్రహించినాఁడో!నా
తూఁపునుదూల్చె నాకిటినిదూలిచె నొక్కక్షణంబులోపలఞ్ 44

ఆశరము వచ్చిన పథంబు ననుసరించి
యేగి చూతుఁగదా? యాహా! యేమిచెప్ప
నిలువనీరునఁ బండినచెలువుఁబోఁడ
నెచ్చెలీ! యెంతబాగుండె! నీప్రియుండు! 45

కంతుఁడు వసంతుఁడు రజనీకాంతుఁ డైన
సాటిరాఁబోరు బోఁటి! నీస్వామి కెవరు;
అతఁడు సశరీర సుమబాణుఁ డనవగత వ
సంతుఁ డక్షయుం డగు నిండుచందురుండు. 46

హాయము డెక్కలసడి విన్నయట్లులేక
హాయముపైనున్న నను గన్నయట్లులేక
మిన్నకుండిన యాతేనిఁ గన్నకొలఁది
వేసరము హెచ్చి వెస నోరుఁ జేసికొనుచు. 47

అమితయత్నానఁ బురుష కంఠము వహించి
"అధిప! జోహారు, లెక్కిన హాయముపైనె
యాతప స్నేలొ! యందుకు హేతు వేమొ!
ఆదరంబున సెలవీయ నడుగుచుంటి. 48

"చనుచున్న చమరులఁ జమర వేమీ" యన్న
"కన్నె జంపు కురు లం దున్న" వనెను
"కనుచుఁ బోయెడు లేళ్ళ దునుము వేమీ?"
యన్న "కన్నె తళ్కుగను లం దున్న" వలెను
"ఏగుచున్న గజాల నేయ వేమీ"? యన్న
"కన్నె కొ్రన్నడక లం దున్న" వనెను
"గుహఁడాగు సింగంబుఁ గొట్ట వేమీ" యన్న
"కన్నె చిన్ని నడు మం దున్న" దనెను

ఎవ్వ రాకన్నె? రాకన్నె యేనః రాజ!
కన్నవాని నెల్లను "గన్నె కన్నె" యంచు
ప్రీతి నీచేతఁ గలవరింపించుకొనెడి
యమ్మధురదేవి నామాక్షరమ్ము లేవి? 49

చూచినాఁడవు కాఁబోలుఁ జూడ కెవరి
నాబిడనె పాప మందు కే మైతి వల్లు
అంత, నీభ్రాంతియేగాని యువని లేరె
తాడిఁదన్ను వారిని దలఁదన్ను వారు? 50

గణ్యనని చెప్పుకొన గొప్ప కాదుగాని
యాబిడెయు కాదు దానిజేజమ్మ యేని
సాటిరాఁబోనె న్నాకాలిగోటి కొనకు
ననుచు ముసుఁగుఁజీలుచుకొంచు, గనులఁబడితి 51

నీలిమబ్బుముసుఁగుఁ జీలిచికొని నేను
మెఱపుమెఱయుకరణి మెఱసి నానొ!
మద్ధతా్రప్ప సన్నమధురాకృతికి త్తేఁడు
నవవికాసనలిన నయనుఁ డగుచు 52

“దేవతాకాంతవే నీవు తీపులాడి?
నీవు విద్యుల్లతాంగివే నీరజాక్షి?
ఈవనికుమారివే నీవు తీవెబోఁడి?
అద్భుతమ్మగుచుండె ని న్నరయచుండ.” 53

అనుచు ననుమెచ్చుకొనెడి యాయవనిధవుని
యెడఁదయెట్టిదో! శోధింపఁదొడఁగినాను;
ప్రియసఖి! నాకు నిన్ను నీప్రియుని కిచ్చు
కొనుటకంటెను వేఱేమి కోర్కె యున్నె? 54

నను నెగాదిగఁ జూచెదు మనుజ పతిని
"మోహనాకారం!" యంచు సంబుద్ధి చేసి
కనులు మిలమిలమెఱపించుకొనుచు నంటి
ఏమి టాచూపు? నావైపు? ఇంతసేపు? 55

ఆపు మాపు నయ్యావి చూపులా? యతనుని
పూలతూఁపులా? తూఁపులేపో! నృపాల!
తూఁపులేగాక యవి వట్టిచూపులైన
గ్రుచ్చుకొనిపోవునే లోనిగుండియలకు? 56

గాయపడినట్లు నెత్తురు గారు నట్లు
పైకి గానరా వవి యెదఁ బట్టిచూడు
మరుని తూఁపులు, మ్రుచ్చువి, మారదృశ్య
మ్రుచ్చువెకదయ్య కొంపలు ముంచివేయు? 57

ఓప్రభూ! ప్రభూ! వ్యథ-వ్యథ-యోపలే న
టంచుఁ గృత్రిమబాధనటించుకొంచు
వలుదగుబ్బలు మైసోకఁ బైకిప్రాల,
గమికత్తె పొలఁతీ! పెఱనాతివిముఖుఁ డతఁడె! 58

నను స్పృశింపకయే వింటికొనను నిలిపి
పిన్ననగవు మొగముదమ్మిఁ బిచ్చలింపఁ
బృచ్ఛచేసెను: సుకుమారి! యెవరిదాన?
విచ్చ నొంటి నీవని కేల వచ్చినావు? 59

అంతగా జ్జేఁడు నావైపు నరయుకతన
కామకుం డని యనుకొంటి కాదు కాదు
నన్ను నిన్నుగా భావించియున్నయట్లు
లవలసంఘట్టనమున నా కర్థమయ్యె. 60

నను స్పృశింపలే దను కిన్క మనసు నూప
కసరుచంటిని 'సశరీరకుసుమబాణ!
ఇంతలేసి యున్నవి కన్ను లేమి ఫలము?
ఎల్ల జగమేలు తలియుండెనేమిసుఖము? 61

రాజలోకాన భావజప్రభుఁడు గలుగ
నవవయోరూపరతిగత్న మెవరిదౌను?
వలపువయ సున్న హాయ లున్న వన్నెలాఁడి
యిచ్చనొంటిగ నీకడ కేల వచ్చు? 62

చల్లకై వచ్చి ముంత దాఁచంగనేల?
పలుకొమ్మని మ్రోగియు నా యెలుఁగునుండి
యే యపశ్రుతి తాఁకెనో నృపునిచెవికి
నపుడె వానికన్నుల కెక్కె యరుణరేఖ. 63

కన్ను వేఱొందు నొసట లేకున్ననేమి:
ఉన్నకనులలోనే జ్వాల లుప్పతిల్లె;
నేను స్త్రీనౌట మనగల్గినానుగాని
పురుషుఁడనె యైన బూది నై పోయియుందు. 64

శివుని సెగకంటిమంటకు ధన్యుఁడు వోవ
నెఱఁబడుచు మోడ్పిల నిలిచిన రతివిధాన
వానికిన్కకు మతిపోయి మౌనమూని
చెంత నిలిచిన నను జూచి క్షితివరుండు 65

'తలపంబోకుము చండభాస్కరుఁడు శైత్యంబందినన్‌గూడ నే
నల సంయుక్తనుగాక యేయితర రంభాద్యప్సరో భామినుల్
వలగొన్నన్ గనువెత్తిమాతు నని స్వప్నంబందునన్ సుందరీ!
తెలియంజాలవా! యేమొ! నీ వెవుఁడు మద్వీరార్క వంశోన్నతిన్ 66

నేను సత్యహరిశ్చంద్రనృపురు నృపుఁడ
సత్యధుండైన యినుఁడు మాజాతికర్త
ఎంత యెంత విశ్వామిత్రసృష్టికైన
మాఱిపోవదు! తమకదు! మామనస్సు 67

ఏకపత్నీ వ్రతుఁడు రాఘవేశ్వరుండు
మాపవిత్రనా వ్రతికు మార్గదర్శి
వలదు వల దన్నఁ బైఁబడ వాంఛసేయు
కామినికి భామ! నాసికా ఖండనంబు. 68

నవల! యెపుడో! సంయుక్త సౌందర్యమును
నిలుపుకొన్నాను వ్రణయహృన్నిలయమందు;
అలముకొన్నది యామె వ్రత్యణువునందు;
చీల్చిచూచిన లేదు పొచ్చెము మఱెందు.' 69

అనుచు నిన్నింతగాఁ బ్రేమఁ గనెడితేని
ప్రణయవజ్రమును మఱింత రాయఁదొడఁగి
"ఏమిటీ? నీవ? సంయుక్తనా? మహీశ!
వట్టితలఁపు బొమ్మకుఁ దాళిఁ గట్టెదేల? 70

తగని పగవాఁడు గద యామెతండ్రి నీకు?
పగతు కూఁతుతోఁ గల్యాణమగుట యెట్లు?
పొలుచునే యనలోదకములకు మైత్రి?
కలుగఁబోనె ప్రాక్పశ్చిమాశలకు సంధి?" 71

అనిన ఱేఁడనె "మానిశ్చయమున కెపుడు
తిరుగె యుండదు జరిగి యేతీరవలయు
నాకు సంయుక్తకునుఁ బరిణయము; జరుగ
దా? జరుగు బ్రహ్మచర్య మంత్యంబువఱకు!" 72

అనగా నవు! నవ్వె! శ్రీవా
రినకుల సంభూతులు తము నీవఱకేమో
యనుకొని తెలిక యేక వ
చన సంబోధన సలిపితిఁ క్షమియింపవలెన్ 73

తలఁపకుఁడు నా పెడ సరపుఁ
బలుకులు పనిపడిన మగిడివచ్చెద ననుచున్
సెలవుగొని వచ్చితిని మీ
వలపులు దైవానుకూల బంధములు చెలీ! 74

ఇచట నిన్నెట్లొ! యచట నానృపుని నట్లె
యేఁచుచున్నాఁడు మారుఁడు తూఁచినట్లు
అహహా! దేవతా దంపతులమ్మ మీరు
అనెడు చిత్రికు సంయుక్త యబ్బురపడి. 75

“ఎంత తెగువఁజేసి యెన్నిశ్రమలు వోయి
నావె? యకట చిత్రి! ననుగుఱించి!
ఎన్ని జన్మలెత్తి యేరూపమున నాకుఁ
దీరుచుకొననౌనె నీఋణంబు? 76

వెతలు వోయెడు తనరాజసుతకుఁ బ్రియునిఁ
బడకతోఁ దెచ్చియిచ్చెను నడికిరేయి
యోగ విద్యాబలంబున నునిదయోర్తు
శ్రీయుషాకన్య సఖురాలు చిత్రరేఖ. 77

చిత్రిరేఖకు రేఖ విశేషమగుటఁ
బడకతోఁదెచ్చె ననిరుద్ధు నడికిరేయి
రేఖ నీకున్న నాకునై పృథ్వీపతిని
జెట్టపట్టుక వడితేవె పట్టపగలు?. 78

ఏల? వదనవనరుహము వ్రేలవైతు?
చిత్రిరేఖకు రేఖ విశేష మనిన
మాటకా యేమొ? నీవిట్టులౌట చిత్రి?
వలదు? వలదమ్మ! నీకునే నంత వలదు. 79

రేఖలేకయున్న తేనిని దేమన్న
లేదు నీకు గొఱఁత లేశమైన
రేఖయుండి చిత్రరేఖ చేసినదేమి?
యుండ కీవు చేయకున్న దేమి? 80

మనసులేనఁ ప్రతిమఁ దెచ్చినది యద్ది
ప్రాణములేనఁ మనసుఁ దెచ్చితివి నీవు;
మమత లుండని ప్రణయబంధములకన్న
మమతలుండిన ప్రణయమానములె మేలు.” 81

అనెడు సంయుక్త భాషణ మాఁగిపోవఁ
జిటికలిడుకొంచు నావులించినది చిత్ర;
చిత్రి బడలిక గ్రహియించి సెలవొసంగి
యెప్పటితలఁపులకుఁ దిగె నృపకుమారి. 82

ఉడుపుల్ మార్చదు స్నానమాడదు పనేదో చేయుచున్నట్లు గా
రడిసేయున్ దనమేడపై కెవరిన్ రానీయ దాఁకొన్నదై
కుడువన్ గోరదు చెల్మికత్తియలపై గోపించు నాకన్న న
య్యడవింబూచినపువ్వె మేలనుచునాయాసంబుతో డీల్పడున్ 83

వలపుఁగమ్మల వ్రాసి పంప దాసిని పిల్చు
సంగతి వెలిబుచ్చ జడిసిపోవు
రాయబారము తానె పోయిరా నూహించు
సిగ్గుతెరలమధ్య చిక్కువడును

అనుఁగురాచిలుక కాయనను రమ్మని చెప్పు
మనఁబోయి నోరురా కడలిపోవు
తనయభీష్టముఁ దుమ్మెదకుఁ జెప్ప నుంకించు
నది దగ్గఱింపమి కదవదించు

తానుపడు బాధ లింతలోఁ దలఁచి యేమి
టయ్యెరొ! నే నిట్లగుచునుంటి నని తపించుఁ
గడిఁదివలపురాపిళ్ళు కగ్గమయిసుడియు
ప్రణయజీవుల కెందు నూఱటలు గలవు? 84

ఈగతి విరహానలమున
వేఁగి నవయుచున్న తనయవిధముల్ గని లో
లోఁ గుములుచు జయచంద్రుఁడు
రోగనిదానంబు లెల్ల రోయదొడంగెన్.- 85

గానములు చేష్టలు చింతలు
గని విని పసిపట్టి చెలిమిగత్తెల పలుకుల్
గొని దీనికి హేతువు నిం
డిన పెండిలి యీడటంచు నెమ్మది నెఱిఁగెన్. 86

పరిణయముఁ జేయవలె నని
పురోహితులఁ బిలువఁ బనిచి పుత్రియుదంతం
బెఱుక పఱచి యరసి స్వయం
వరమునకు ముహూర్తమెపుడో! వచియింపుఁడనన్

పప్పుదప్పళంబు పదిదినంబుల కబ్బె
రొట్టెవిఱిగి నేతి నట్టె పడియె;
మంచిదంచు వారు పంచాంగములఁ దీసి
విప్పుకొనుచుఁ బుటలఁ ద్రిప్పుకొనుచు. 88

అదిగా దిది యిదిగా దది
యది యిదియుం గాదటంచు నంతవివాహం
పుదినము దగ్గఱలోఁ గాం
చి దశమి యుక్తంబనుచు వచించిన యంతన్. 89

"నేను దలఁచినట్టులె మీరు నిర్ణయించి
తిరి స్వయంవర మీరు భూదేవత" లని
పార్థివుఁడు పురోహితులను బ్రస్తుతించి
హేమపుష్పదాయముల సత్కృతు లొసంగె. 90

యువకులు శూరులౌ నుర్వీశులకుఁ గూఁతు
        చిత్రపటమ్ములఁ జేరనంపి
ప్రతిభూపతికి స్వయంవరలేఖలను బంప
        నధికారులకు వేగ నాజ్ఞ నొసఁగి
పుత్రీస్వయంవరమ్మును వైభవముమీఱ
        నొనరింప మంత్రికి "హుకుము" సేసి
హితులకు బంధుసంతతికిని వేర్వేఱ
        భద్రలేఖల నిచ్చి భటులఁ బనిచి

ఐదుదినములు గలవు స్వయంవరమ్మె
మిగిలియున్నవి పనులెల్ల మిక్కుటముగ
సేవకులఁ బెట్టి చక్కగా శీఘ్రముగ ము
గించుఁ డని తానె పనులుచేయించె రాజు. 91

గణనకెక్కిన వాదెనకాంధ్ర తాళ్ళ
తాష సన్నాయి డోళ్ళ వాద్యములతోడ
భూవరసుతా స్వయంవరమ్మె నినదించె
మంచుకొండయు వింధ్యయు మాఱుమ్రోయ. 92

కనదగు నౌర! యాస్తాబగు కన్నె స్వయంవర మెల్లతేండ్ల కం
చోనరెడిసంతిసంబునమహోత్సవమున్ గన మూఁడునాళ్ళు కో
రిన వరమిచ్చు పండుగల తేఁడగు సంక్రుడు కూడ వచ్చెనో
యనఁ దనరారుచుండెఁ బురమంతియు నూతనవైభవమ్ముతో

దైవతనాథుఁ డానృపతి, దైవతపట్టణ మాపురంబు, నా
దేవతు లెల్ల పౌరులు, సతీమణు లెల్లరు దేవతాంగనల్
గా విలసిల్ల నిందర చుకా మొనరించిన రాణనొప్పి శో
భావహమై స్వయంవరశుభాంచిత ముత్సవమొప్పెనయ్యెడన్.

ఏగృహాపుదివ్వె వెల్గు లాగృహమువలెనె
పూర్ణచంద్రుని వెలుఁగెల్లభువనమునకు
ఎవ్వరింటిశుభమ్మె వారింటివలెనె
రాచయింటిశుభమ్మెల్ల రాజ్యమునకు 95

అచ్చోటి మంగళస్వనము లంబర వీధులదాఁక మ్రోగుచున్
వచ్చెడు బంధుమిత్రులను బర్వున రమ్మని హెచ్చరింపగా
నచ్చోటి పచ్చతోరణము లట్టిట్టు గాలికినూఁగి యాడుచున్
వచ్చెడిబంధుమిత్రులకు స్వాగతమున్ గుశలంబు బల్కెడిన్ 96

పృథ్వీరాజేంద్రుని పరాభవింప నిదియె
సమయమని జయచంద్రుఁడు సంతసించి
ప్రతిమనొక్కఁ డాతని పేర ద్వారమందు
నిలువఁబెట్టించె తొల్లిటి యలుకఁ జాఁటి, 97

చేతోజాతునికైన నందమున నాక్షేపింపఁగాఁజాలు భూ
నేతల్ దూరుపు వీళ్ళనుండి విభవాన్వితంబుగా వచ్చి నా
రాతన్విన్ వరియింపఁ బల్లకులపై నశ్వాలపై బండ్లపై
మాతంగంబులపైశతాంగములపై 'తూర్మ్యో'ఘూనినల్దెంచరో! 98

సురరాజు పరుదెంచె గుఱుతింపుఁడనురీతి
ప్రతిపదార్థ మతివైభవముఁజూపి
ఋతురాజు విచ్చేసె నీక్షింపుఁడను భాతి
ప్రతివీథి పచ్చనై పరిమళించి
వలరాజు వేంచేసెఁ దిలకింపుఁడనుతీరు
ప్రతివ్యక్తి సొబగుల నతిశయిల్లి
శ్రీరాజు చనుదెంచె నారయుఁడనుభంగి
ప్రతిసౌధమెల్లనై పరిఢవిల్లి

ఆకనోజీనగరము స్వర్లోకమో! వ
సంత సామ్రాజ్యమో! సుమసాయక పుర
మో! హిమకరపట్టణమో! యనూహ్యమగుచు
వచ్చిన ధరాధిపతుల విశ్రాంతిపట్టుచె. 99

అసమాన ప్రతిభా ప్రభాకలిత సమ్యగ్ నూత్ననూత్నోల్లాస ద్రస నానావిధ వృత్త బంధుర రమా రామాయణోద్యత్ప విత్ర సురక్ష్మారుహ చాతురీ కవనశూరా! పార్వతీశోభనాద్రి సుతాగ్రేసర! యాంధ్రవాఙ్మయ వియద్వీధీ సుధీభాస్కరా!

భారత కవిత్రయీ రూ
పా! రచితాంధ్ర మధుర ప్రబంధ కలాపా!
సారస సంభవ వంశ
క్షీరాంభోరాశి సుప్రసిద్ధోద్దీపా! 101

మాలిని.

వివిధవిధ కవిత్వోపేత కావ్య ప్రసారా!
ప్రవిమలగుణ శుంభద్రాజ కీర్తి ప్రసిద్ధా!
అవిరళ కృషి సంజాతాచ్ఛ పుంభావవాణీ!
నవనవ రచనా సంధాన దీవ్యద్విదగ్ధా!

ఇది బీర్నీడివంశ సంజాత సంతోషమోషే కవితనూభవ ప్రసన్నకవి ప్రణీతంబయిన పృథ్వీభాగవత ప్రబంధంబునందు చిత్రస్కంధము

# పృథ్వీభాగవతము
## స్వయంవరస్కంధము.



విశ్వనాథవంశ మ
హావార్ధి శశాంక! పార్వతంబా పుత్రా!
కేవల కవితా జీవిత!
భావక భీరార్ణవ! రసవచ్చారిత్రా!

అది స్వయంవరమంటపం బందు నృపులు
కూరుచుండిరి దానికిఁ దూరుపుదెస
హర్మ్యము మఱి యొకటి గలదు-అందు రాకు
మారిని నలంకరించుచున్నారు చెలులు. 1

సకియలున్న భవనగవాక్షములనుండి
చూచుచుండిన నచట గూర్చున్న రాజు
లటఁ బడమరముఖద్వారమున దునిచిన
పృథ్వీరాజుప్రతిమయుఁ గాన్పించుచుండు. 2

కురులకు గమగమల్ గురియు నత్తరులంటి
        చెలువార హొంబట్టుచీరె గట్టి
సీమంతపథమునఁ జేర్చుక్క సవరించి
        కటిమీఁద రత్నమేఖల ఘటించి
తళుకు ముత్తెపుసరుల్ గళమునఁ గీలించి
        తలమీఁద బొండుమల్లెలను గూర్చి
మధుర నిక్వాణ మణిమంజీరముల నెత్తి
        పదపల్లవములకుఁ బసపుఁ బూసి

చెవ్వుల వ్రేలాడు లోలాకు రవలఁ దుడిచి
ధవళ వస్త్రము మేన నందముగఁ బూన్చి
చలువపన్నీరు మెయినిండఁ గలయఁ జిలికి
పెండ్లికళ లెల్ల దీర్చి భూవిభుని సుతను. 3

ఇఁక నొనరింపఁగల పను లేమి లేమి
క్షితిపతులలోన మనరాజ సుతకుఁ దగిన
రమణుఁ డెవ్వఁడో! చూతము రారె యనుచు
సుదతులు గవాక్షములనుండి చూచుచుండి. 4

"తుండము నేకదంతమును దోరపుపీనులు లేవుగాని యా
మండపమందు వేడ్కవడి క్ష్మాపతులందఱికన్న ముందు కూ
ర్చుండిన గుజ్జురూపు నమితోదరు నావనమెత్తి చూడుఁడో
యండజయానలార! యతఁ డచ్చము మాతనయుండుగాఁడె?!

అవు నవు! నీవని నట్లా
యవనీవిభుఁ డచ్చముగ గణాధిపుఁడేనే!
"నవయుగ లంబోదర రా
ద్ధపుఁ, డను బిరుద మొసఁగెద మిట కతనిఁ దేవే! 6

కుడవని గణపతి కేటికి
కుడుములు నుండ్రాలు పెట్టి కొలుచుట? యితఁడే
కడిచెడు గణపతి చచ్చియు
చెడి యితనికె పెట్టవలయుఁ జేటల్ చేటల్. 7

ఖిన్నగ నుదరం బింతగ
నున్నదనియె కాని యీతఁ డున్నతములఁ గో
రన్నెరఁ డెవ్వడు నేరెడు
గన్నెరుం జిన్నాడులకె కరుణవహించుచున్. 8

ఒకవేళ నొకనృపకు మా
రిక కీలంబోదరుండు ప్రియుఁడే యగుచో
సకి నేకరణిఁ గవుఁగలిం
చుకొనఁ గలాడె? పెనుబొజ్జ చోరనిచ్చునఁటే! 9

ఈరాజకుమారుఁడు మన
చారుమతిని బెండ్లియాడ జనుదెంచెనఁటే
ఆరయ కూరక వదరుచు
ఘోరాఘుమ్ము నొడిగట్టుకొను టేమిటికే? 10

పెనుబొజ్జ యుంటఁగాదే
వినాయకుఁడు పెండ్లియాడ విరమించుకొనెన్!
వనితా! యితఁ డంతియ కద!
వినాయకునికన్న నితఁడు వేఱే? చెప్పుమా! 11

అని యిట్లు నవ్వటాలకు
వినాయకునిబొజ్జ గుఱిచి పెండ్లిలి విషయం
బున మృదువుగఁ దగవు పడెడి
వనితలఁ గనుఁగొని యొకతుక వారిఁ బొగడుచున్ 12

చతురలనిన మీరేనే!
యతిగా నిం తుదర మున్న యవనీపతి సం
గతిని గణపతి చరితమును
జతురోక్తులతో నే తిరుగఁ జదివితిరిగదే!

తెలిసియె ప్రవేశపెట్టితి
శెలుక రవుతుసామి నహహా! యేపనికైనన్
దొలుతగ శాంభవి తనయుని
దలఁచుకొనుట యార్యసంప్రదాయమె యవుఁగా?

నెరసినమీసాలకు దళ
సరిగాఁ గాటుక నలంది సఖిని వరింపన్
వరులై స్వయంవరమ్మున
కరుదెంచిరి భళే! భళే! ముసలయ్యలుఁ గూడన్.

ఆయయ్యఁ జూచినావే యంగులేకున్న
వట్టిసామ్ముల నెన్ని బెట్టికొనెనో!
ఈయయ్యఁ జూచినావే లొట్టబుగ్గల
కైట్లూదువోసి మాయించుకొనెనో!
ఆయయ్యఁ జూచినావే యెత్తులేక కి
రీట మెంతటిది ధరించుకొనెనో!
ఈయయ్యఁ జూచినావే మోళ్ళవో నెట్లు
మీసాల గత్తరింపించుకొనెనో!

ఇతనిపేడిమూతి కెప్పు డమరెనె తు
మ్మెదయెఱకులవంటిమీసకట్టు
వానికఱ్ఱిమేని కేనాఁటి కబ్బెనే
నిగనిగలపసిండినగలతొడుపు? 16

అనుచు నవ్వుటాల కచ్చటి యవనిధవులఁ
బలుకఁ బలుకన హాస్యంబు లొలికిపోవఁ
గాంత లెల్లర నవ్వించెఁ గడుపులుబ్బ
మివుల నవ్వులమారి భామిని యొకర్తు. 17

ఏమే హేమలతా! లలి
తా! మనరాకన్నె కతన నతనుఁడు సతనుం
డై మృదుసుమశరములఁ గొని
కాముకులను జెండియాడఁ గదతె న్గదనే! 18

అతనుం డందురు నన్ను కొంద అది యేలా? వారు నన్నట్లనన్
హితవే? నే నతనుండనో! యొరుఁడనో! యీక్షిం డించుచున్ మరుం
డతిసంఖ్యోన్నతిహర్మ్య మెల్లడలఁ దానై నిల్చిన మహీ
పతు లొప్పారిరి చూచితే లలిత! దివ్యరూపరేఖాకృతిన్! 19

"చోళరాజతఁ డతఁడు పాంచాలరాజు
గౌళవుఁ డతండు నేపాలధవుఁ డతండు
చేదిరాజతఁ డతఁడు కాశ్మీరరాజు
సాల్వుఁ డాతఁడు కుంతలస్వామి యతఁడు. 20

వంగరా జత్రఁడు కళింగరా జతఁడు క
ర్ణాటరా జతఁ డంగరా జతండు
కుకురురా జాతఁడు కురురా జతండు కోం
కణరా జతఁ డతండు గౌడరాజు
భోటరా జతఁడు వరాటరా జతఁడు మ,
గధరా జతఁ డతండు గౌళరాజు
పాండ్యరా జాతఁ డవంతిరా జతఁడు మా,
ళవరా జతఁ డతండు లాటరాజు

అతఁడు శబరరా జతఁడు ప్రయాగరాజు
బర్బరుం డతండు విదర్భపతి యతండు"
అనుచు వ్రేల్వెట్టి చూపు చాయానృపుల ను
దక్కుచెలియల కెఱిగించెఁ దరుణి యోర్తు. 21

అందఱు మన్మథ మన్మథు
లందఱు వైభవ మహేంద్రు లందఱు నృపులే!
అం దొకరును "పాపన్న" మన
యిందుముఖి మనమ్మునకు నెఱుఁగరుగాదే! 22

ఎఱుఁగమె నీవు నేను ధవళేక్షణ! మొన్నటిదాఁక నీయొకో
క్కరిపస? నాఁడు వీరు మనకంటికి నచ్చిరె? వీరి కీ స్వయం
వరసమయాన నేవలన వచ్చిన దింత బెడంగు? కంటివే?
పురుషులసౌష్ఠవంబునకుఁ బుట్టి పడంతులమీఁది గాలియే! 23

మగవారు వట్టి మనుజులు
మగువా! వారిపరువులకు మనుగడలకు సో
యగములకు దోహదము మన
మగువలపై వలపుగాలి మలయుట సుమ్మా! 24

అను చిమ్మోయి నమ్మగువలు
జనపాలురఁగూర్చి మధురసంభాషణముల్
గొనిమెడి గమ్మత్తులలో
మునింగి వేడుకలఁ బ్రొద్దుపుచ్చుచు నుండన్. 25

జనవిభునాజ్ఞ గొంచుఁ బరిచారిక యోర్తు సభాస్థలమ్ముఁ జొ
చ్చి నృపకుమారికాగమనచిహ్నముగాఁ బటుకాంస్య ఘంటికా
ధ్వనులు వొనర్చె నచ్చటినృపాలుర కాశలుఁ గుబ్బటిల్ల న
ల్లనఁ గననయ్యె నయ్యెడ విలాసవతీకృతనాట్యభంగిమల్. 26

మేఘాలనుండి భూమికిఁ దటాలున నేఁగు
దెంచినట్టి మెఱుంగుదీగ యనఁగ
భువనవీరులను జూపులనె గెల్వఁగ రాకొ
లమునఁ బుట్టిన శౌర్యలక్ష్మి యనఁగ
పంచాస్త్రునకు వశంపడనిబండలను భే
దింపవచ్చిన రతిదేవి యనఁగ
తనమోముఁ గాంచినంతనె సర్వకళలందుఁ
బాండిత్యమిచ్చెడివాణి యనఁగ

కనులు మిఱుమిట్లుగొలిపి క్రీగంటఁ గనుచు
కేలుదమ్మిని పూదండ గీలుకొల్పి
యెల్లరును విస్మయంపడ నృపకుమారి
వచ్చినది స్వయంవరసభాభవనమునకు. 27

ఆ సముపేతయౌవనసుహాసము నా భువనైకమోహనో
ల్లాసము నా తనూనవవిలాసము నా సువిశాలదృష్టివి
న్యాసముఁ గన్నులారఁగను చా వసుధేశులు చేష్టలెల్లనుం
బాసి తదాసనాలఁ బ్రతిమప్రతిమానముగాగఁ దోఁపఁగన్ 28

అచ్చరకన్నెవోలె సభ కట్టుల వచ్చిన కూఁతుఁ గాంచి“ నే
డిచ్చటఁ గూరుచున్న నృపు లెల్లరునున్ మనకైనవారె నీ
యిచ్చకువచ్చు నొక్కధరణీశుని గోరి ప్రసూనమాలతో
నచ్చతురున్ వరించి చనుమా! తనయా!”యని హెచ్చరించుచున్ 29

“పెచ్చు పిరియమ్ముతో నిసుకవేసినరాలకయుండునట్లు నా
బచ్చెనబొమ్మవేడుకకు వచ్చి ననున్ గృపసేయనున్న యో
పచ్చనివిల్తులార! హిమవత్కరులార! వసంతులార! పెం
పెచ్చిన మీచరిత్రల కివే కుసుమించిన నాసుమాంజలుల్. 10

వట్టిగ నందఱన్ శ్రమలపాల్పడ స్థాణునికార్ముకంబుఁ జే
పట్టఁ బరీక్ష పెట్ట నొకబాణపు వేటున మత్స్యయంత్రమున్
గొట్టఁ బరీక్ష పెట్ట నిటకున్ జనుదెంచిన యందఱున్ జగా
జెట్టులె బాంధవంబున వచించెద నొక్కవిశేష మియ్యెడన్. 31

కట్టడికాదుసుం డిది యొకానొక సన్నవిన్నపంబ ధ్యా
నెట్టది యందు రేని గ్రహియింపుఁడు నామురిపాలపట్టిచే
పట్టినజెట్టియే ప్రణయపట్టపు రా జగు నన్య రాజులే
చెట్టలుపెట్టకుండ దయసేయవలెన్ నను నంచు వేడినన్. 32

కురువిందములు గీలుకొన్న లోలాకులు
నీలంపుఁగురులతో మేలమాడ
ఎదనంటి ప్రిదులుపయ్యెద మీఁద నపురంజి
నగలు ముత్తెపుసరుల్ నాట్యమాడ
బిడికెడేనడు మంచుఁ బుడికిచెప్పెడికీలిఁ
గటిమీఁద రతనాలకమరు గుల్కఁ
చిపురుఁజేతులనున్న పువ్వుదండతావికి
భవనమ్ము నిలువెల్లఁ బరిమళింప

సభనుగలభూవరులఁ బరిచయముసేయ
నపరవాగ్భామ యగుచిత్రి యనుగమింపఁ
గొదమరాయంచనడకల గొనబుమీఱఁ
బ్రియుని వరియింప సంయుక్త పయనమయ్యె 33

భూపులు చూపులెల శరపుంజముగా నొనరించి పాప మా
భూపతిపుత్రికాహృ దయమున్ దిగగుప్పుచునుండ నాపె యే
తూఁపును దాఁకనీ తనతోఁగల చిత్రిను చేతిడాలుగా
మాపుకొనంగఁజాలెను బ్రమాదహృతజ్ఞులు సువ్రజవ్వనుల్! 34

ఘనలజ్జాభయభరములఁ
దనవెనుకకు నొదుగుచున్న ధాత్రీశుకుమా
రిని ముందునిడుకొని నృపులఁ
గనుచుఁ బలుకఁదొడఁగెఁ జిత్రి కడుచిత్రముగన్ 35

ఆతఁ డగాధ సత్త్వమగధాధిపుఁ డోమధు రాధరోష్ఠి వి
ఖ్యాతకళాస్వరూపుఁడు జగమ్మున నీధరణీశు ప్రోల ధా
త్రీతరుణీశు లెల్లరును రిక్కలు రిక్కలు వానిపొందు నీ
చేతము సమ్మతింప వికసించును పుష్పమరందభోగముల్.''36

అనివచించుసకియ నవలబోఁ జేఁగిల్లి
మగధరాజునకు నమస్కరించి
యామరాళగమన యడుగు ముందుకు వేయఁ
జిత్రి యెదుటి నృపుని జెప్పె నిటుల. 37

"అంగనృపాలుఁ డీతఁడు సురాంగన లీనవమోహనాంగు నా
లింగనచుంబనక్రియకు లేఖలువ్రాయుచునుందు రెప్పుడో
బంగరుబొమ్మ! యీధరణిపాలుని గోరెదవేని యద్భుతా
నంగసుఖానుభూతివివశాత్మవు కాఁగల వెల్ల వేళలన్. 38

కనవే యీతఁ డవంతినాథుఁడు సఖీ! కాళేశ్వరారా నా
ఝునుఁ దత్త్యాయతహస్తుఁ డాజ్జితరిపుక్ష్మాపాలకౌశుండు పే
ర్మిని నీవాతనిగోరుకొన్న నగు నుర్వీ కామినుల్ మెచ్చ సం
ధ్యను సిప్రాతటినీతరంగ లలితోద్యానోత్స వోల్లాసముల్.39

చిత్రి యాధాత్రిపతి నిట్లు చిత్రిఫణితిఁ
జెప్పుచుండిన నేమాత్ర మొప్పుకొనక
సంగ నొండొరుఁ జేరె నాసరసిజాక్షి
హంసి పద్మాంతరము జేరునట్లు దోఁప 40

ఆభూపుం డభిగమ్యుం
డాభామిని కైనఁ గోరదయ్యెఁ గనోజి
భూభృన్మౌళితనయ లో
కో భిన్నరుచి యగుఁగాదె? శ్రోణీస్థలిలో? 41

మెచ్చక యవలకుఁ జేరిన
నెచ్చెలి నచ్చిత్రి చీకి నెనరచ్చుపడన్
జెచ్చెరఁ దదుపరి నృపతుల
నచ్చిక బుచ్చికగ నిట్లు అభివర్ణించెన్. 42

"అతఁ డనూపుఁ డనూన గుణాన్వితుండు
పరిజల కంతశ్శరీర మాహార్థ్రవుండు;
ఇంతి! యీతనిఁ గామింతు వేని రేవ
పులిన తలముల విహరించు ఫలముగలుగు. 43

మధురత్వాద్ధవుఁ జూచినావె యక్షగో! మధ్యోపవిష్ణుండు స
ప్పక్ష సంచారుఁడు ధీరుఁ డర్థులకు సంపద్దానమందారుఁడో
పృథుశ్రో భామయి! నీవువాని గయికొంటే పుణ్యాబృందావనీ
మధురోద్యానవిహారసౌఖ్యములు సంపాదించుఁ దోరంబుగన్

మేదూరి వంశ చంద్రుిం
డీకున్ జోడునునులేని శృంగార లస
దాౖిడగౖి గణ్యుఁ డాన్నప
చూడామణి తోడి జోడు చొప్పడఁ గనవే! 45

సింగపురీవి, బంగరురుచిన్ బ్రసరించెడు మేను, తమ్మి పూ
లంగికురించు కన్గవ, బలమ్మగు వక్షము, నాగరాజుగా
పొంగులువాఱుగాత్రము, శుభోదయ! నినుకొఁగలింతలో
నంగులు దేఱు నాపుమశరాంగుని నీవు పరిగ్రహించినన్. 46

యాచకశ్రేణి కా నృపలాదరంబు
వివిధ విధ దానకర్ణాఖ్య దివిజతరువు
ఆర్త గయులకునానృపా లాశ్రయంబు
పార్థపాశుపతాస్త్రాఖ్య వజ్రరక్ష 47

ఓయబ్జానన! చెప్పనేల? నృపవర్యుం డాతఁడే పాండ్యుఁ డా
జ్ఞాయత్తక్షితినాథమండలుఁడు సుశ్రీమాంగుఁ డీ నాతనిన్
ధీయుక్తిన్ వరియించినన్ జగతి ను పించు మీజంట దీ
ర్ఘాయుశ్శ్రీలఁ దటిద్ఘనాఘనుల నా గాఢభోగంబులన్. 48

కేరళ ధారుణీరమణు కేౖివ కనుంగొను మోహనాంగి! సం
స్కారము గాత్ర మానృపునిసంపద లాతనిరాజ్య మన్న రం
భోరు విశాలమున్ బ్రకృతిమోహనశోభముదార మాతనిన్
జేరిన రమ్యశీతలవనీస్థలులన్ విహరింప నీకగున్. 49

శాలా! జాలం బేలే?
కాళింగుం డతఁడె వానిఁ గామింప నగుఁ
హేలాలీలల సంద్రపు
తాళీవనపాళికామితాళిని దేలఁ. 50

అతఁడె కాశ్మీర మేలు విఖ్యాతయశుఁడు
వానిభూలోకనందనోద్యానతతులు
లలిత లలితమ్ము లగుసుధామలసరస్సు
లింతి నీ కౌను వానిఁ గామింతువేని. 51

మర్త్యలలనకు నమరులు మతులువోయి
వెతలువడిపోయిన విదర్భవిభుఁ డతండు
హాయిమీరంగ ధనదుపైస్థాయి తోడ
నెసఁగ నీప్రేమవీణ వాయింపఁగలఁడు.” 52

నృపుల నెవరికేని నిందీవరేక్షణ
చిన్నమెత్తు మనసు సేయదయ్యె
నినుని కొలకు వేచు వనజాత మిందుని
నుడుల నేరి సుంత యొల్ల నట్లు. 53

త్రోవ కడ్డమౌ కొండల దొలఁగిపాఱి
వారినిధిఁ జేర నేగు స్రవంతి భాతి
చిత్ర చెప్పెడి భూపులఁ జెలిమిఁగొనక
ప్రియుని వెదకుచుఁ బోయెడి వెలఁది నాపి 54

"పతి నీకతఁడా? యతఁడా,
యతఁడా?" యని తడవతడవ కతనిని నతనిన్
వెతకి వెతకి వివరింపను
వితయై వెతయై తుద కొక వృద్ధుని గనుచున్. 55

చిత్ర యావృద్ధునకు మ్రొక్కి "చెలియ! వానిఁ
గాంచినావే? యెపుడు పైకిఁ గానఁబడఁడుఁ
అఖిలసామర్థ్యమున్న వాఁ డౌనుగాదె?
అగ్గి పుల్లను డాగిన యట్టు లుంట?" 56

జగతినిండిన సద్యశమ్ముగా మెయినిండ
మేలైన ధవళదుకూలధరుఁడు
వాగ్దేవతా స్తనద్వంద్వదుగ్ధపుఁబుష్టిఁ
దిన్నగా దీరినదీర్ఘభుజుఁడు
కలికిబాసకయిత జిలిబిలిగాఁ జెప్ప
నేర్పు రూపుగొనిన నీలితనుఁడు
పరమేశ్వరవరకృపఁ బ్రసన్న విజయాల
దొడ్డగాఁ గన్న సంతోషవిభుఁడు

విశ్వనాథవారిశాశ్వతభక్తుండు
రమణి! నీస్వయంవరమ్ము నరయఁ
దరలివచ్చినాఁడు తాతకావలె నీకు
మ్రొక్కు కొమ్మభీష్టభూపుఁ డమరు. 57

నివాసము దీటుకొంచు మిడిమేలముగా నిటుచూచునీలి కూ
ర్పాసపునీచు నాగసితివా? వికచాంబుజపత్రనేత్ర! వీఁ
డూసరవెల్లి కుద్ది సమయోచితవేషములన్ ధరించి య
గ్రాసన మెక్కఁజూచు పడునా మనదగ్గఱ వీనిబాచికల్? 58

పెండిలిగాకయున్నపుడె వీనిసవిత్రికి వీఁడనుంగు పు
త్రుండగుటన్ గురుండితనిదుందుడుకుల్ క్షమియించియుండుటన్
మండియు నేలవేల్పు లణుమాత్రమయేని శపింప కుండుటన్
గండము తప్పుకొన్న భవకర్ణుఁడు వీఁడు వినీలకుంతలా! 59

ఖానులు లుబ్ధులై భరతఖండముపై కసిదూసి వచ్చినాఁ
డూనమునంది యాద్విషులయొద్ద ఫలావులు మెక్కఁబోవు నే
డేని వసుంధరాపతులయింట్ల శుభం బగుచున్నఁ బానకం
బానఁగవచ్చు వీఁడు చెలియా! యఁవి నీతుల కేవి నీమముల్? 60

గబ్బిలవుజన్మ వీనిది
గుబ్బెత! మృగఖగముల యిరుకోలములవాఁడై
యుబ్బిన నిటు నట్టుల వీఁ
డబ్బుకొలఁది డబ్బుదుబ్బు నార్జించుకొనున్. 61

అధరమందుఁ దేనె యంగిటిలో విషం
బున్నవాఁడు వీఁడు సన్నుతాంగి!
చూడకమ్మ వీనిఁ జూచినయప్పుడే
పంచపాతకములు పట్టి కుడుపు! 62

అనుచుఁ బలపల దూసిపోసినది చిత్ర;
అతని నతఁ డౌనొ నెపు డేమి యనినవాఁడొ!
అదనురావలెనేగాని యతని యతని
ప్రకృతివికృతు లెపుడొ! బయల్పడకపోవు. 63

అత్తఱి చిత్ర వేఱొకమహాధిపుఁ జూపి చకోరలోచనా!
యి త్తరుణుండు సింహళమహీరమణుం డహీహారసేవనుం
డు త్తమశౌర్యధుర్యుఁడు మహోదధినూతనరత్నరాశి ని
సొ త్తగు జిత్తమేని యొకచూపటు చూడవె తెల్లనయ్యెడిన్! 64

కాశికారాజునే కాంక్షింతు నందువా?
    విశ్వేశ్వరార్చనల్ వెల్లివిరియ
వంగభూపతికిఁ గైవసమౌదు నందువా?
    సుందరవనులెల్ల సురభిళించు
సౌరాష్ట్రనృపుని కే స్వాధీన నందువా?
    సోమనాథుని కీర్తి సొబగుమీఱ
చోళరాజేంద్రుని సొమ్మనే నందువా?
    తంజాపురము ధగద్ధగల నీను.

రాజచంద్రులు వీర లోరాజవదన!
మనసుకెక్కినవాని నొక్కని వరింపు
పరగ నని చిత్ర తనకు హెచ్చరిక సేయ
భయము నభిమానలజ్జ లావలకుఁ ద్రోఁచి. 65

“ననుఁగా కెవరిని గోరు?'' ననుగర్వాన మీ
సాల దీటెడు తేంట్లసరసఁ బోక
“మిన్నకుండిన నేమి మించిపోవునో'' యంచు
సకిలించు రాజులస్వరము వినక
“ననుఁ గోరు''మన్న సూచన గాగఁ గనుసైగ
చేయుభూజానుల చాయఁ బోక
“నాయదృష్టం బెట్టిదో!'' యని తలవాల్చి
తలపోయు రాజులతట్టు గనక

రాజులెల్లర విడిచి ద్వారంబు దరిసి
పృథివిరాజుప్రతిమకడ కేగుఁదెంచి
సుమసరంబు నా ప్రతిమకంఠమున వైచెఁ
బుడమి మగలకు మనములు తడఁబడంగ. 66

ఆనికలేనిరాచపొగరై జయచంద్రుఁడు పృథ్వీరాజుపై
మాననియీర్ష్యఁజాటి ప్రతిమన్ బొనరించి పరాభవింప న
ద్దానికి వేఱుగాఁ దనయ తత్ప్రతిమానమునే వరించె నొఁ
దానొకటి న్దలంచుకొన దైవము వేఱొకటిన్ దలంచెడిన్ 67

అత్తఱి భూవరులెల్లరు
“నిత్తెఱఁగున మాఱిపోయె నిది యే” మనుచున్
దత్తరమునఁ జిత్తములం
దుత్తలపాటొంది నిలిచియుండి రనదలై. 68

తనకుఁ బరాభవంబు దలఁదాఁకగ నచ్చటి వైరివిగ్రహం
బునకు మనఃప్రసూనసరమున్ దిగవైచిన కూఁతుఁగాంచి కాం
చనమయపీఠిచుండి జయచంద్రుఁడు బుస్సున లేచి దుర్విరో
ధినె వరియించుటా? యవుర! ధీరవతీ!''యనిపండ్లునూరుచున్

కుతుక న్నిండుగ క్రోధమెక్కిన మహాఘోరాకృతిన్ దండ తా
డిత భోగింబలె బిడ్డపై కురికి ''యేడీ నీ మనోవల్లభుం
డితఁడా? క్షాత్రవపత్నివా? సుతపిశాచీ! యెంత దుష్కీర్తిఁ దె
చ్చితివే! నేఁటికి సాటివారు గని'యిస్సీ!' యంచుచీకొట్టఁగన్ 70

మతిలేదా? పరిహాసమా? చపలమా? మౌఢ్యంబు? ధిక్కారమా?
అతనుంబోలిన వీరసుందరులఁ బ్రేమాధ్యక్షులన్ వీడి నా
ప్రతిపక్షప్రతిమన్ వరించితివి పాపంబుండునే తండ్రిలన్
వెతలంబెట్టఁ జరించు బిడ్డల నసిన్ ఛేదించి చెండాడినన్. 71

అని గర్జించు చెదురు ని
ల్చినఁ గని సంయుక్త మది చలింపక యుండెన్
జనపతి పలుకని సుతపైఁ
గనలి "బదు లిఁకేమి కోరగా వలె?" ననుచున్. 72

కరవాలంబును దూసి పుత్రిగళమున్ ఖండింపఁగా దూఁకి కూఁ
తురు "నాన్నా"! యనిపల్కరింపఁగనె యెంతోమెత్తనై గుండియల్
కరఁగన్ "నా చిటితల్లిగా" యనుచు బిగ్గం గౌఁగిఁటన్ జేర్చె నె
వ్వరికిన్ జేతులురావుగా సుతులఁ జంపన్ గ్రోధ మెంతుండినన్. 73

"ఎందుకు నాకుఁ గిన్క-జనియింపఁ జరించితి విట్లు? తల్లి! నీ
యందము నీస్వయంవర శుభాశయమున్-విని మొదలెందఱో!
బందగు లాచుఁ గోర్కు-పడి వచ్చిరి మన్మథమూర్తు లందు నీ
కుం దగువీరసుందరునిఁ గోరి కృతార్థతనొందు మెమ్మెయిన్ 74

విసుగింపక వలయు మొకని
మసలిననమృతమె విషరస మయమగు నటనీ
రసపడు చుండెదరు నృపులు
రసభంగమగును స్వయంవరమ్ము కుమారీ! 75

నా విని రాకుమారిక యనాదరచిహ్నితవక్త్ర మెత్తి" నా
న్నా! వరుఁ డెవ్వ డిప్పు డిఁక నాకు? నెఱింగియెఱుంగ కెప్పుడో!
యేవిధినో! వరించితి మహీపతి నొక్క-నిఁ జాలు నీవునన్
బ్రోవకయున్న మార్గమనువు పోవుదు నే? జగ మీటుపోయినన్.

అను చాకన్యామణి చెద
రినముంగురుల సరిగ సవరించుకొనుచుఁ గ
ట్టెనుగొట్టినట్లు దెగబ
ల్కి-న జనవిభుఁడు హృదయమున లేని నగవుతో. 77

"ఇమ్మను జేశ్వరాగ్రణుల యిండఱలోఁ దలవంపు సేయరా
దమ్మ! శుభాశుభమ్ము లరయందగు ప్రాయపుబంటి నీకు లే
దమ్మ! హితమ్ముగోరు తలిదండ్రుల ధిక్క-రణంబు సేయరా
దమ్మ! గతాని కేమి? యిపుడైనను నాపలు కాదరింపుమా! 78

ఇటిమె నూరేండ్లపంట వేయేండ్లవృద్ధి
ఎట్లు వరియింతువో! యేమొ! యింక నీవు
పుత్రి! మూర్ఖఁగా నీదు నైపుణ్య మిపుడు
నచ్చవలె నాకు! జగములు మెచ్చవలయు!” 79

అని జయచంద్రుఁడు ప్రియముగ
పిలిచిన విననొల్లనట్లు పెడమొగమై త్రి
ప్పినమోము వంచి మునిపం
టను పెదవిని నొక్కుకొనుచు నాతుక యుండెన్. 80

“అతనికి మనకున్ గిట్టదు
జతకుదురని వానితోడ సావాసముఁ జేటే!
బ్రతుకుట యపకీర్తి కఁ జేటే!
బతిమాలినయట్లు వినుతుఁ బరువు నిలుపవే! 81

అతని తలపంపు కేగదె? యఖిలభూప
తులను నీ పెండ్లినెపమునఁ బిలువఁబనిచి
యతనివంటి వికృత విగ్రహమును తేండ్ల
దిష్టిబొమ్మగా నిచట నెత్తించినాను. 82

అంబుధిని నేను వైరిగా ననల మతఁడు
అంబుధికి జనించిన లవణాంబ వీవు
కలసిమెలసి యంబుధిలోనె కరఁగవలెన?
చీలి యనలంబులోఁ బడి ప్రేలవలెన?. 83

అమితోద్రేకమనస్కుఁడై పరశురామా! రార! నీతల్లికం
ఠము ఛేదింపుమురా'యటంచుఁబితయాజ్ఞాపించినఁగ్రొమ్మెక్కితం
డ్రిమదిన్ రేగిన యాగ్రహాజ్ఞ బడబాగ్ని జ్వాలఁ జల్లార్పఁడే
జమదగ్న్యాత్మజుఁ డాత్మమాత్రుక గళస్థానామలాస్త్రంబునన్ 84

అదియున్ గైకయి కావి యాదశరథుం డన్నాఁడె? యోరాఘవా!
పదునాల్గేడు లరణ్యవాసము నొనర్పం బొమ్మని వంచు స
ద్పదుఁడై రాముఁడె కానలన్ బితృయథార్థస్వాంతమున్ దీర్పఁ దా
నుదయంబైనయినాన్వయ ప్రబల సర్వోర్విన్ బ్రతిష్ఠింపఁడే? 85

తనయుండా! కనినాఁడరా ప్రణయమున్ దాపంబుఁ గొన్నాఁడరా!
యని యాయోజనగంధిఁ జెప్పికొనినాఁడా శంతనస్వామి? శాం
తనవుండే యఖిలం బెఱింగి పితృశాంత్యానంద సంపత్తికై
వినతిన్ సర్వము నిచ్చుకోఁడె విలసద్భీష్మప్రతిజ్ఞోక్తుఁడై? 86

అనుఁగుందల్లిని జంపుమం చడిగి నానా? రాజ్యమున్ వీడి గొం
య్యన నుగ్రాటవి కేగుమంచడిగినానా? యేడనోయున్న క
న్యను గల్యాణముసేయుమం చడిగినానా? శత్రుదుర్జాతితో
ననురాగిల్లుటకూడదన్న విన లేవా? నన్ను మన్నించుచున్. 87

అనియెడు తండ్రికి సంయు
క్త "నేను పుత్రికను నీవు దయతో సెలవి
చ్చిన యది జనకునిపట్టునఁ
దనయుఁడుపొనరుప వలసిన ధర్మంబు పితా! 88

పుత్రకులకుఁ బితృభక్తియుఁ
బుత్రికలకు భర్తృభక్తి ముఖ్యం బనఁగా
ధాత్రిఁ బ్రసిద్ధపవిత్ర చ
రిత్రము తెల్లఁ దొలి నీపరిధినే నడచెన్. 89

వత్సరాయుఃపతిం బ్రాణేశునిగఁ గొన్న
సావిత్రి కేకీడు సంభవించె?
ప్రియునిసంగతిగఁ దండ్రి నతిక్రమించిన
గుణసుందరికి నేమి గొనబుతరిగె?
అన్నచే తోసిరాజని మనఃపతిఁ గొన్న
రుక్మిణీకన్య కేరొప్పు కలిగె?
పగవానినే కోరి మగనిగాఁ గైకొన్న
యాప్రభావతి కేమిహాని పుట్టె?

ఈడువచ్చుదాఁకనె య్యాఁడు దీడ దాచు
తండ్రియదుపునఁ బుట్టింటఁ దనరుచుండు;
నీడువచ్చినపై నాఁడు దాడ దాచు
ధవునియదుపున నత్తింటి దివురుచుండు 90

దీని కొకయుదాహరణంబుఁ దెలియఁజేతుఁ
దగనివైరంబు నీకు మాతల్లితండ్రి
కున్న దనుకొమ్మిఁక మదంబ నిన్న? తాత
నా యనుసరించుట? నిజమ్ము నానతిమ్ము.!" 91

అనినన్ జయచంద్రుఁ డనియె;
"కని పెంచిన తండ్రిపైనిఁ గాసంతైనిన్
గనికరములేని తనయను
గనినాఁడ జగతిని నేనె కర్మవశానన్ 92

పుట్టినప్పుడే నీ విట్టి పుట్టువు వని
ఎఱుఁగనైతి నిసీ! సుంత యెఱుఁగనైతి;
ఎఱిఁగియుండిన నామీఁద నెదురుతిరిగి
విసముగక్కెదే నీకాంప కెసరువగుచు? 93

అనపుఁడు రాకుమారిక "దయామయ! కాంచిన యాఁడుబిడ్డ పెం
చినతరువాత నేవరుని చేతికో పోయెడు నాఁడుబిడ్డయా
ననుచు స్వయంవరానఁ బడినప్పుడె నన్ విడనాడుకొంటి వే
మని యిపు డిట్టులాడెదవయా? యిది పెత్తనమా? వివేకమా?

బిడ్డసౌఖ్యమునకై పెండ్లియో! నీమాట
నడుపగా బేరమో! తడవుకొమ్ము
ఉత్తమస్త్రీలు తా మొకని వరించి యి
తరుని గోరుట యెట్లో! తడవుకొమ్ము
సావిత్రి మొదలుగా సాధ్వీమతల్లులు
నడచిన మార్గంబు తడవుకొమ్ము
చిననాఁటినుండి నీకనినసంయుక్త యే
నడవడిగలదియో! తడవుకొమ్ము

ధర్మపథ మెంచి ప్రేమబంధముఁ దలంచి
ఇపుడు నావిధి యేమిటో యెఱిఁగికొమ్ము
తలఁచి వలచి వరించినదాన నతని
తప్ప దిది సూర్యచంద్రులు తప్పిచనిన." 95

అనెడు సంయుక్త కెదురాడు ననువులేక
పొంగివచ్చెడి కోపంబు మ్రింగఁగాక
కత్తిదూసియు వేయఁగాఁ గ్గరమురాక
కసరి మెడపట్టి పొమ్మని విసరిత్రోసె. 96

వలచినరాజు రాక పగవాఁడటు తండ్రి పరాభవింపఁ గో
ర్కెలుచెడిపోవ వేదనభరింపఁగలేక కలస్వనమ్ముతో
వలవల నేడ్చి నప్పరమపావని కాటుకకంటికోనలన్
జలజలరాలుబాష్పముల సారెకుఁ జీరచెఱంగు నద్దుచున్. 97

అమ్మధురకంఠి పరిదేవనమ్ములోనె
కటికిరాతిబొమ్మలుఁగూడఁ గరఁగిపోయి
నట్లు సభయెల్ల నశ్రుపూర్ణాస్యమయ్యె;
మానవత్వైకసహజ ధర్మంబె యదిగ. 98

ఒకనాఁడైనను వచ్చి చూడక మనస్సొకించుకేనిన్ గ్రహిం
చక కన్నయ్యకుఁగూడఁ గానినృపుపై సంయుక్త కాభావ మెం
దుకు? సంతాప మదెందు కిట్లమరహిందూస్త్రీల సౌశీల్యముల్
ప్రకృతిస్వచ్ఛములై రహించుఁ బ్రణయబ్రహ్మైకభావంబునన్

పదుగురుమెచ్చి తమ్మలముఁబంచిముహూర్తమహోత్సవమ్ములన్
గుదిరిచి పెండ్లిచేయుజతకు న్మదియున్ మది గూడకున్న చో
నదెసఫలంబుగాదు ప్రణయంబునఁ బావనధర్మశీల దో
హదమున నేకమై పరగు నాత్మగలన్ విడదీయశక్యమే?. 100

"మతివిఱిచి దొసఁగులెంచియు
హితవుఁ జెఱచినారు కుమతులెవరో! కాకీ
గతిఁ దెగఁబడి నాసుత నా
ప్రతిపక్షు వరింపఁగలదె స్వప్నమునందున్?. 101

అనినృపుఁడు కిన్కఁగదురఁ గొం తటమటించి
పండ్లు పటపట గొఱుకుచు భటుల గదిమి
"ఇది విరుద్ధ దీనివారము గుదురువఱకుఁ
బట్టికొనిపోయి చెఱసాలఁ బెట్టుఁడనిన. 102

అటఁ బ్రతిమాగళంబున నృపాత్మజ వేసిన పుష్ప మాలికన్
బుటపుటఁద్రెంచి యామెకరముల్ బిగగట్టిన కింకరుల్ హుటా
హుటి నరుదెంచి "చిత్తము ప్రభూ"! యని మ్రొక్కి కుమారిరాణిగా
రిటుదయసేయుఁడంచుఁగొనిపోయిరి కారకు రాకుమారికన్. 103

సరిలే! చూతమటంచుకొందఱు భళే! సంబంధ మౌనంచుఁ గొం
దఱు సంయుక్తమనఃప్రవృత్తియును నందంబైనదేయంచుఁ గొం
దఱు మేమిందఱమందఱగాఁద్ర మిటనుండన్ బొమ్మనా? యంచుఁగొం
దఱు నానావిధదేశరాజులకు చిత్తమ్మొక్కఁ బెట్లయ్యెడిన్? 104

రాజులై యా స్వయంవరరంగమునకు
రానివారును వచ్చియు రా గిలకయె
చననివారును లే రొక్కఘనుఁడు దక్క
మందునకునైన హైందవక్ష్మాతలాన. 105

స్తవనీయాకృతి గద్యపద్యయుత దృశ్యశ్రవ్యకావ్యప్రపం
చ వినిర్మాణ విధాతృతుల్య రచనాచాతుర్య సంపత్కలా!
కవిసమ్రాట్సుకళాప్రపూర్ణ బిరుదాంకప్రోజ్జ్వలోరస్థలా!
ఋవితాభాగ్యకులా!విక- తవినోద్ధ్యాత్యైభీలవ్యాద్వ్యాప్యకులా! 106

కేవల రసవత్కవితా
పావనవర్తన! యపాగవాఙ్మయ విలస
జ్జీవధన! యాపులించినఁ
బ్రేవుల లెక్కింపఁగల వివేకనిధానా! 107

సుగంధి వృత్తము.

పంకజాతగర్భదివ్యవంశ వార్ధిమోహనే
శాంక! నిష్కలంక సంస్కృతాంధ్ర భాషణసూరి! వితా
నాంక సుందరాంగ శోభనాద్రి నందనాగ్రజా!
వేంకటేశ రామమూర్తి వీరసోదర ద్వయా! 108

ఇది బీర్నీడివంశ సంజాత సంతోషమోక్షకవి తనూ
భవ ప్రసన్నకవి ప్రణీతంబయిన పృథ్వీభాగవత ప్రబంధంబు
నందు స్వయంవరస్కంధము.

# పృథ్వీభాగవతము

## ప్రణయస్కంధము.



మద్రామాయణ సుర
భూమీరుహ. కల్పితాంధ్ర భువనశ్లోకా!
కోమల పద గుంభిత వా
గ్భామాత్రాణా! రసప్రబంధ ధురీణా!

జయచంద్రుఁ డామహోత్సవమున కవనీశ్వ
ఱుల నెల్లఁ బేర్వేరఁ బిలుచుటయును
పిలిచియును దనను గొలమువాఁడనియైన,
నొకమాటయేఁ బంపకుండుటయును
పంపకుండియుఁ దనప్రతిమఁగా నొకట్టి సే
యించి ద్వారమున బెట్టించుటయును
పెట్టినప్రతిమకే ప్రీతిమై సంయుక్త
వలపుఁబువ్వులదండ వైచుటయును
వైచినందుల కతఁడు కోపంబుఁ జెంది
నృపకుమారిఁ జెఱను వేయించుటయును
మొదలుగాఁగల వార్తలు ప్రిదిలిపోక
తత్క్షణమెవచ్చి ఢిల్లి భూ ధవుని జేరె. 1

గుట్టు తెలియఁ బోదని వైరిఁగూర్చి మూర్ఖ
గుణులు పకాలకడ బడాయిఁ గొట్టుచుంద్రు
వలచినట్లు గమించు పక్షులకుఁ బోలెఁ
జాటునకుఁ గూడ వింత పక్షులు గలవు. 2

అనిశము దాఁ గనోజిపతిక్రై బవరంబునఁ బొంచి వానిపై
ర్విసఁగనె మండిపోవు పృథివీపతి నేఁ డతఁడే స్వయంవరం
బునఁ దనకే పరాభవము బుద్ధిఁదలంచు కెటింగి నేయిపో
సిన యనలంబుపోలె నెగచెన్ బటుకోపశిఖాచటచ్ఛటన్. 3

“జయచంద్రుండు స్వయంవరమ్మునకు నోజల్ మీఱ సర్వం సహా
దయితవ్రాతముఁ బిల్చి నన్ను లవమాత్రంబైన లక్షింప కుం
డియు నా పేరిటద్వారమందుఁ బ్రతిమన్ బెట్టించి తిట్టించె నం
టయయో! యింతలుసైతినా యతని కేనాఘ్నుండనై యుండియున్? 4

వంచన లెన్నొ చేసి పగఁబట్టిన వానియఘంబు వానినే
త్రుంచుకపోవు నంచుఁ గృపతోఁ గనుమూయుచు నింతదాఁకసై
రించుచునుంట గాదె చెలరేగె నతండిటు లక్కటా! చలా
యించదె రౌతు మెత్తనగునేనియు గుఱ్ఱము మూఁడు గాళ్ళతో? 5

మఱపు వచ్చిన దేమొ! బిఱుసున నొకనాఁటి
ప్రొద్దునఁ బడ్డ నా మొట్టికాయ
సరిగ విన్పడ దేమొ! శరణార్థుల కెపు డ
భీష్టార్థమైన నా యీవియులివు
మఱపువచ్చిన దేమొ! నరవరోత్తములకుఁ
గంఠస్థమైన నా కదనగాథ
సరిగఁ గన్పడ దేమొ! శత్రుసంతతులకుఁ
గంపమెత్తించు నా కత్తితళుకు

నను బరిగ్రహింపఁ దలంచి యనవరతము
నామనోహారి నోచిన నోమె పండి
చేరువయ్యెనో! చావు నాచేతిలోనె
కాక వీని కీదొమ్మ లెక్కడివి యిపుడు?. 6

సమయం బెప్పుడు కూడివచ్చునోగదా స్వామీ! కనోజీపతిన్
సమరంబందునఁ గెల్చి వానితనయన్ సాధింపగా నంచు నే
కముగా నుఱ్ఱటలూగు నన్నతఁ డిటుల్ కవ్వించుటల్ సూడఁగ్రీ
ష్మములోఁ గీలికి గాలి తోడ్పడినసామ్యం బయ్యె నీనాఁటికిన్ 7

కచ్చెలవల్ల నిట్టివి యకారణఖేదము లెన్ని వచ్చినన్
జెచ్చెఱ నే కనోజిపురిఁ జేరి యరాతిబలాతిరేకముల్
ద్రచ్చి జయధ్వనుల్ సెలఁగ దర్పము మై నవలీల నెచ్చెలిన్
దెచ్చెద భీష్మకాత్మజను దెచ్చిన నందకుమారుకై వడిన్. 8

ఘూరీభూధవుఁ డేడుమార్లు భరతక్షోణీసలిం బట్టుచున్
హోరాహోరిగఁ బోరుసల్పునపు డేనోడించుటే గాని యే
మారైనన్ దగుభుక్తిఁ జూప నిపు డస్మద్ఖడ్గకాలాహికా
హారంబయ్యెడుఁగాక శాత్రవచమూప్రాణానిలవ్రాతముల్!” 9

అనుచు పృథ్వీరా జనికి జ
తనపడుచుండఁగఁ ద్వరపడఁదగదు జనవరా!
యనిన ట్లినుండు క్రుంకెన్
దనమనవిని వినుమను గతిఁ దమము రహించెన్. 10

సుఖముచెడి పగతుశౌర్యము
నకుఁ గలవరపడు కనోజినాథుని హృదయాం
బుకరణి విహగముల కుకుకు
కు కువకువ ధ్వనులతోడఁ గువలయ మెసఁగెన్ 11

తనపతికై వెతపడుచు
న్ననృపాత్మజ మనమునం దనర్చుశుభాలో
చనలంబోలుచుఁ జుక్కలు
మినుకుమినుకుమనుచు మింట మెఱయుచునుండెన్ 12

తరుణీ, నృపులిట్టులేయుండఁ ద్వారగఁద్వారగ
నిముసములు వోయె గంటలు నిగ్గమించెఁ
బూటలుగతించె దినములు ముగియవచ్చె
కాలచక్రాన కెంతటి గమన మహాహా!. 13

ఆనాఁడు నిండుపున్నమ-
భానుఁడు నాఁ డెప్పటివలెఁ బశ్చిమవనధిన్
లీనమయినాఁడు పులుఁగులు
కూనలపై ఱెక్క లునిచి కూర్కుచునుండెన్. 14

దరులుదన్నుచుఁ గన్నమరులున నుప్పొంగు
పాలకడలికిఁ జుంబనము లొసఁగి
వెడగాడ్పుఁ దుడుకుఁద్రోపుడులకు దోఁకాడు
ప్రతితరంగము మీఁద బంతులాడి

వలరాజు కుసుమాస్త్రములఁగంది తపియించు
విరహార్తజనులకు వెచ్చఁగూర్చి
వసుధలోఁ గనుపట్టు ప్రతిపదార్థమునకు
నిద్దవా లలివెండి నీరువోసి

అర్కమేఘములదయకు నందఁబోని
కటికినిఱుపేదగుడిసెలఁ గనికరించి
గగనమార్గానఁ బదియాఱు కళలతోడఁ
జనుచున్నాఁడు పున్నమచందమామ. 15

జనవిభునియంతికోద్యానవనమునందు
వాడి వ్రాలిన కుసుమగర్భములఁ జీల్చి
పంచుచున్నాఁడు మోహనపరిమళములు
వాడవాడ కావెన్నెలఁ బవనసుతుఁడు. 16

కారాగారములోనిరాజసుతకై కన్ బ్రాముగా నెవ్వరున్
రారీపున్నమ రేయియంచవిరెనో! "సారా" త్రావియోడస్సెనో!
ప్రారంభోష్ణము తగ్గెనో! యచటిపారావారు నాఁ డేటికో!
పారానూని పరుండినారు వరుసన్ బాషాణపుమ్మెట్లపై. 17

పగలు రేయియు నొక్కటై పడకమీఁదఁ
దనువువాలిచి కూర్కున క్షణము లేక
నాఁటికిఁ జెఱవడిన యాఱునాళ్ళనుండి
బడలి సంయుక్త దైవతత్పరత నుండె. 18

''నిను నమ్మినభక్తులు చా
వనిచావై నవయుచుండ భగవంతుఁడ! మూ
సినముత్యముచందము దా
చినపగడముకరణి నుండఁజెల్లునె నీకున్? 19

ఇది యొకవేస మిట్టిమొఅకే కరుణించెదనాః యటంచు నీ
మదినిఁ దలంతువే మొ! యనుమానము దోఁచెడునట్టులైన నా
హృదయముఁ జించి చూచుకొనవే జగమంతటి కన్న నిది నీ
యెదుట దొగుర్లుగూసి మను నే యెవరైన జగాన నీశ్వరా!. 20

పూజ్య లాపద్బాంధవుఁడటన్న బిరుదంబుఁ
దక్కించుకొనని దేతరి మహేశ!
ఏదిక్కు లేనప్పు డీవె దిక్కనుట స,
త్యముసేయఁగా నిదేతరి ప్రభుండ!
శివము సుందరము నీచిద్విలాసముఁ గంటి
కందీయఁ గా నిదేయదను దేవ!
నీభక్తవితతిపై నీవత్సలతను బ్ర
దర్శించుకొన నిదేతరుణ మీశ!

ఎచట నుందువుః నీకుఁ బనేమి యచటః
ఎంత పిలిచిన వేడిన నేమి యనినఁ
బ్రతివచింపవు! గానంగఁబడ! విఁకెన్ని
నాళ్ళు లిట్టు లీ తెరచాటునటన స్వామి! 21

ఏస్వాఁడైనను గానిపోని పను లెం దేవేనిఁ గావించినా
నో! నీదృష్టికి వేఱుగా నడిచినానో! నన్ను మన్నింపు, కా
దా? నీవే తగుశిక్ష నా కిడగరాదా? గొంతు కోయింపరా
దా? నా కెందులకీ యవస్థ లెపుడన్ దండ్రీ జగద్రక్షకా! 22

నీవు దయామయుండ వని నేలను ప్రాఁకెడియెఱ్ఱచీమకున్
నీవె పరాత్పరుండవని నీవరమానము లందనై బుధుల్
కేవలమట్లు నిన్ను నుబికింప నుతింతురెకాని యెందునున్
నీవలె నుండు నిర్దయుని నేలను లేదనిపించెదున్ బ్రభూ! 23

ఎట్టియఘంబు లేని మును లే నిను గాంచగ నిన్పకచ్ఛడాల్
గట్టి తపస్సుచేయుచు జగద్విభుఁడా యని మొత్తుకొన్నఁగ
న్పట్టనిచిత్రమూర్తివి ప్రపంచపువాంఛలమున్గితేలు నా
యట్టియమాయికల్ సలుపుప్రార్థలనన్ విన నెంతువే? ప్రభూ!

కడుపారన్ గనిపెంచుకొన్న ఘనుఁడా కన్నయ్యయే యిట్లు న
న్నిడుముల్ వెట్టుచునుండ నీకు మఱి నేనేవంక నేవల్ల ని
క్కడ నైనట్టి యనుంగుజుట్టమని నన్ గాపాడఁ గాక్షించి కీ
డ్వడుచున్ వచ్చెదవేమిటో! భ్రమలు దేవా! వట్టిపుణ్యానకున్

ఘను నొకనిన్ వరించి సరికాదను తండ్రిని ధిక్కరించి నీ
కినుకకుఁ బాత్రమై వెతలఁ గీడ్వడుచున్ జెఱశాలయందు నే
మన ఫలమేమి? యోదరద! ప్రమందిన భూమికి వెత్తియాదునే?
యనివిసుగందుచున్ మరణమందగఁ దెంపుననిశ్చయించుచున్

చిన్నచిన్నగఁ బయ్యెదచెఱఁగు మెలచి
కుతుక కురిఁబోసికొనుచు నక్కోమలాంగి
చావసిద్ధమై యుండనాసమయమందుఁ
గరుణ తేజస్వి యొకఁడు సాక్షాత్కరించి 27

ఆత్మహత్యకుఁ జొరనేల? యబ్జవదన!
అతిమహాపాపమని యెఱుంగదవు కాదె?
భాసురజ్ఞానమూర్తి! యోపరమసాధ్వి!
నీ కొరులు సెప్పవలయునే నిగమబోధ?

చెలుగల్గునాడు మృతిఁజెంది సుఖంబులుగల్గునాఁటికిన్
బు తరంబె? గిట్టుటకు బుట్టుటకున్ భువిఁ బ్రాణికోటి కం
గాఁ బ్రసక్తి లే దది మహేశు నభీష్ట మదెట్లనన్ నరుల్
గిట్టగలారుగాని తమకించియుఁ బుట్టగలారె మానినీ! 29

అనవుఁడు రాకుమారిక మహాద్భుతమందుచుఁ దన్మహాప్రభల్
గని మిఱుమిల్లుపోవుకనులన్ నునుఱెప్పల నప్పళించుచున్
నను వ్యధవార్ధినుండి కరుణన్ దరిఁజేర్ప బ్రసన్నుఁడైన నాఁ
యనుదినపూజ్యదైవ మగునా? యని యాత్మఁ దలంచుచుండగాన్

వలపులు జన్మకర్మములపంటలు భోగవిరాగహేతువుల్
వలపులు ప్రాణికోటి కనివార్యములైనమనోవిలాసముల్
వలపులవల్లనే గద ప్రపంచపుపోకడ సాగుచుండుటల్?
వలపులు లేనిమానవులు ప్రాణములేనిశవంబులేచుమీ!

వలపుల్ దీఱక చచ్చినన్ గలుగు లాభంబేమి? క్షోణీస్థలిన్
గలలో జీవుఁడు వాంఛితార్థములకై కారాడుచుండున్ గదా?
పొలఁతీ! చచ్చిననంతెగాదె తనువుం బోకార్చుకో నేటికో!
కలయున్ జావు శరీరభేదమునఁ గాంతావాప్తికాధారముల్ 32

తనువుం బాసినఁ బాయునే వలపు లాత్మం బట్టి పీడింపకే?
పనులెల్లన్ సవరించుకో వలతియై పంచేంద్రియారామమై
తను వున్నప్పుడె వాంఛితార్థముల నందన్వచ్చు లేకున్నచో
వనమే జీవన మెండమావులె సుమీ వాంఛానిరూఢార్థముల్! 33

వలపు లేకుంటయే లెస్స, వలపుగొన్న
దాని నెల్లైనఁ బడయుటెంతేని లెస్స
కాని వలచియు మరణింపఁగలుగ దెదియు
మఱియు నొక్కని శేషంబు నరయవలయు 34

చక్కఁదనాలరాణివి వసంత వనీకమనీయశోభలన్
దక్కొను నీవు నీమధురతా ప్రతిబింబము నీజగత్తునం
దొక్కటియేనియున్ నిలుప కూరక యే మృతినందిపోయినన్
జక్కఁదనంబు దిక్కఱి ప్రశస్తితొలంగదె మర్త్యభూమికిన్? 35

అని తనజతనము వారిం
పను లెస్స వచించుచున్నవాని హాద్ద
ర్శనమునకు విలాసమునకు
వినయ వివేక ప్రబోధ వితరణములకున్ 36

ముదమును భీతి యచ్చెరవు ముప్పిరి గొన్న మనంబుతోడ మే
నదరి చెమర్పఁ గాఁ నడవియందుఁ గిరాతుని వింటిదెబ్బకుం
బెదరిన లేడిచూపనుగమించు కనుంగవ తత్తరింపఁ బ
య్యెద సవరించుకొంచు చతివ యట్లను లోలకు లల్లలాడఁగన్ 37

ప్రత్యేకమ్ముగ నాస్తవమ్ము విని నన్ రక్షింప సాక్షాత్తుగాఁ
బ్రత్యక్షమ్మగు వాగ్విభూధవుఁడవో! భర్గుండవో! కాక నా
నిత్యాలాప తపఃఫలంబవో! ప్రభూ! నీదర్శనప్రాప్తి చే
మృత్యూపాంతగతమ్ము లాశలుచిగిర్చెన్ నూత్ననూత్నంబులై

ఆత్మ వధకుఁ బాల్పడ్డ నాహస్తయుగళి
నీపదద్వయీసేవకు నేనయుచుండె;
వేఱె నీనామధేయమ్ము వినఁగ నేల?
నీవు దేవదేవుండవే నిశ్చయముగ. 39

ఏలోకమ్మున నీకు మించిన దయోత్కృష్టాబ్జు లెవ్వారు లే
నే లే రెందు సమస్తజీవులకు నీవే గర్తవున్ హర్తవున్
బాలన్ముంచిన నీళ్ళముంచినను నీభాగ్యంబె లోకేశ! న
న్నేలీలన్ దయఁజూచి కాచెదవొ! నిన్నే నమ్మికొన్నా నికన్

కష్టతరమైన నాచిన్నికన్నెబ్రతుకు
వసుధ నింకేల నీ పదాబ్జములమ్రోలఁ
గ్రుమ్మరించెదఁ గైకొమ్ము సమ్మతించి
భవములునశింప హర్షసంపదలు పొదల 41

ఒకయుగమందు కృష్ణుఁడుగ నుజ్జ్వలమైన యనంతకాంతియీ
శకమున పృథ్వీరాజుగ నెసంగఁగ నా పదియాఱువేల గో
పికల మనోనురాగముల విశ్వము నే నయి పుట్టి నానొ! తి
య్యక చను నామనోభ్రమర మాన్యపభానుయశస్సరోజమున్

తమము పరాత్పరాకృతిని దాల్చి నటుల్ తనువందగింప, శీ
ర్షమున మయూరపింఛపు దురాయి, మెడ౯దులసీస్రజంబు, లా
స్యమున సుహాసచంద్రిక, శయంబున వేణువు, గాల, పృథ్వీభూ
రమణుఁడు నా మనంబునఁ బరంగు నితాంత కృపాతరంగుఁడై

నల్లనివాఁడు దాఁగటికి నల్లని రేలఁ దమాలవాటిక౯
బిల్లనఁగోవి నూఁదునఁట వెన్ను నిపిల్చె యటంచు గోపికల్
తల్లడమందు చల్లనల దారొక్కన దాఁకొనునంట యేటికా
యుల్లము నిచ్చికొన్న మధురోష్ఠుల నిట్టులఁ గష్టపెట్టుటల్? 44

ఉబికెడి ప్రేమ గోపికలు 'హా' యనియార్చిన రాక యెప్పుడో!
గబగబ వచ్చి ముద్దుగొని కౌఁగిటఁ జిక్కచు నక్కనంట బూ
వుఁబొదలలోన; నిట్టిబులుపు౯ జెలఁగాటలునమ్మికొన్న యా
యబలలతోడనా? శకటహారికి నామధుకైట భారికి౯? 45

కనకనలాడు నిప్పుకణికల్ మగలత్తలు మామ "లోహరీ!"
యని తనకై యొడళ్ళు విరహాగ్ని కెడందలుఁ గాల గోపికాం
గన లిహలోకముం బరము గానరె! యారసరాజ్యనేత వా
రిని నిటు రెంటికిన్ జెడిన రేవళులం బొనరింపఁ బాడియా? 4

కడవల్ సంకను బెట్టి నీళ్ళ కనుచున్ గాళిందికిన్ బాలకం
చడరం బొన్నల కేగు చల్లరులపాలై యాజుమూడైనఁ గ
న్పడఁ డాలేజవరాండ్రఁ గ్రొత్తమగనాండ్రన్ ద్రిప్పులం బెట్టియి
ట్లుడికింపన్ దొరకొంటపాపమకున్ గోడో! యేమొ! తానెప్పుడున్

జలముల ముంచు బుంగలబుడబుడలలోఁ
గూర్మంబు నడకలగొనబుఁ జూపి
చిలికెడు దధి భాండముల ర్రేఁగు నురువులో
నెలవిూను తళుకు బెళ్కులను జూపి
మైలేనినుకుఁ డేయు పూలయమ్ములలోనఁ
బరశుఘాతముల డెప్పరముఁ జూపి
అహరహంబును విరహమునఁ గ్రుంగుకోలఁకెఁ
బాతాళములలోని లోఁతుఁ జూపి

మాటి కొకలీల నవలీల మనసుఁ దోఁచి
మనసు దోచంగ నీయఁ డుమ్మలికగొన్న
గోపికల తీపి కలలకు రూపమిూఁడు
నృహరి; యెపరిసంబరము వారిదియె కాదె? 48

అనుచున్ గమ్మనియెల్గుతో నిజమనోవ్యాప్తుం బ్రదర్శించు చ
వ్వనితారత్నము వాని పాదకమలద్వంద్వమ్ముపై వ్రాలి మ్రొ
క్కిన నద్దేవుఁడు లేవనెత్తి తలపైఁ గేల్దట్టి దుఃఖింపఁబో
కు నతాంగీ! యలదైవమే శరణు నీకున్ నాకు లోకానకున్!

నీజనకునకు వైరినై నెగడు నన్నె
యీశ్వరేశ్వరునిగ గణియించినావు;
ఆపదలయందు భక్తి యత్యధికమగుట
తెలియవచ్చిన దిపుడు నీవలన నతివ! 50

నీ యెడఁదలోతుల నెఱింగి నీయనుజ్ఞ
మీఁదఁ గదనముసేయుటో! మిన్నక చను
టో! గ్రహింపఁగ దొంగనై యొంటి నిట్లు
రావలసివచ్చె నాకు నోరాకుమారి! 51

నిన్నాత్మాలయమందు నిల్పుకొని నీస్నేహంబె వాంఛించి నీ
కన్నన్ మిన్నగ నేను నిందనుక ప్రేమావేశపూర్ణుండనై
యెన్నోరీతుల యాతనల్ పడితి తన్వీ! నేటితో దీరె నే
బన్నంబుల్ శిలవేసికొంచు నిలుచున్ బై క్రిందుగాకుండఁగన్!

కలలోన గనుపించి కనుదోయి దెఱవ నా
మూర్తి యదృశ్యమైపోవునాఁడు
ఇందువెన్నెలరేల నీపైని మరుఁడు నా
మరుగున విరికోల లఱుచునాఁడు
ప్రతిశబ్దమునను నారాకయే భావించి
హృదయాంబుజము జల్దరించునాఁడు
ప్రణయప్రపూర్ణవై పలువుఱలోన నా
ప్రతిమకే పూదండ వైచునాఁడు

ఏను నీచెంత లేనందు కెన్నిగతుల
దుఃఖపడినావొ! నన్నెంతదూరినావొ!
యాత్మవేదనానిర్గళితాశ్రువు లవె
చెప్పకయె చెప్పుచున్నవి చిగురుఁబోఁడి! 53

భండనస్థలిఁ గుంభికుంభములు వగుల
విజయశంఖ మొత్తిన వీరవిభుఁడ నేనె
యతను కుసుమాస్త్రధాటికి వ్యథలుపోతి
నబలసుకుమారి నీ వెట్టు లాగినావొ! 54

నాకై జీవితదీప మెత్తుకొని నానాకష్టముల్ చెందుచున్
నాకోసంబె చరించుచుండెదవు చానా! వేయిజన్మాలకున్
నీకల్పించినయీఋణమ్ము లవమేనిన్ దీర్పఁగో శక్యమే?
యీకాలంబున కీవెపో సతివి! నీవే గణ్య విల్లాంగ్రజలో!" 55

అనెడు నూత్నాగతుఁడు ప్రియుఁ డాట మెఱిఁగి
యధర మెత్తదు! తలయెత్తి యరయబోదు!
ప్రియులు దరిలేనియప్పు డాపెరిమ లేమొ!
చెంతనిలుచున్నయప్పు డీసిగ్గు లేమొ! 56

ఆనృపాలకుఁ డాతన్వి యందమునకు
సిగ్గు సింగారము మఱింత చెలువు నూప
మరుఁడు విరులేసె నేసిన మఱుక్షణంబె
కళవలముపోయి సన్నగా గళమునెత్తి 57

శ్రీకారమును బోలి లోకకల్యాణమున్
 విననొగ్గుచుండెడు వీనుదోయి
బహువినాశానైక్యభవతమోనైల్యమున్
 దబ్బిబ్బుపఱచెడు మబ్బుకురులు
ననిశంబుమాతృదేశాభ్యుదయమున క
 న్వేషించెడు విశాలనేత్రయుగళి
పావనత్వం బెల్ల భామరూపము నంది
 సొరులొప్పెడు దేహసౌష్ఠవంబు

కలిగి యసదృశ సౌందర్య మొలుకఁ జేయు
నిను గనుంగొని మనమందుఁ దనివినొందఁ
జాలకున్నవి నా నేత్ర జలరుహాలు—
ఎంత చక్కనిదానవే యింతినీవు! 58

నీముద్దునెమ్మోము నే మెచ్చుకొనుచుండఁ
 గవనంబు నానాల్కఁ గవతరించె
నీనుడితేనెల నాని యానినతోనె
 గానంబు నానోట గళలునేర్చె
నీరూపురేఖలనిర్మాణ మరయఁగా
 శిల్పంబు నా చేతఁ జెన్నుమీఱె
నీనడవడితీరు నియమంబు గమనింపఁ
 బ్రణయతత్త్వము లోన భద్రపడియె

నిన్ను సృష్టిచేసిన యామహోన్నతునకె
ఆహూహోలు నేరిపి తన్మయతఘూర్ణించు
భువనమోహన మూర్తివే ముద్దులాడి!
అబ్బనిదిఁ కేది నీవె నా కబ్బుచుండ? 59

నినుజూచి నినుమెచ్చుకొనుటకు నెవ్వాఁడు
వేయినాల్కలఫణిప్రియుఁడు గాఁడు?
నినుజూచి నీరూపు నిర్మింప నెవ్వాఁడు
తలలు నాల్గు ధరించి నలువగాఁడు?
నినుజూచి నీయశమ్మును బాడ నెవ్వాఁడు
గాయక గంధర్వఘనుఁడు గాఁడు?
నినుజూచి మఱిచూచి తనివొంద నెవ్వాఁడు
వేయికన్నులదేవ విభుఁడు గాఁడు?

నిన్ను గని పెంచి మనిపిననృపుఁ డెవండు
ధవళ నగరాజు, వాహినీధవుఁడు గాఁడు?
మానినీమణీ! నీవు నెమ్మనమునందుఁ
దలఁచి వలచిన నెవఁడు మాధవుఁడు గాఁడు? 60

తేరే చక్కనిచుక్క లీధరణిలో లేశంబు నిన్ బోలరే!
యేరత్నాంగిని జూచినన్ జెలియ! నిన్నీక్షించిన ట్లుండ దే
లా? రమ్యుం డగు స్రష్ట ముందరసి నీయందంబు నే నాయెదన్
మోరీగొట్టి సృజించి పెంచి నిను నే మోహించ నిర్మించెనో!

నిసులు పవళ్ళు నిన్ దలఁతు నిత్యము నీ వగుపించు చందముల్
విసరెద, వెప్పుడో! కనులు విప్పిన మూసిన నొక్కచందమై
మెసఁగుచు జెప్పపా టుడిగె- నిప్పుడు కన్నులు వేయివచ్చె నీ
వు సరస నుంటవల్లఁ; దపముల్ పెనుపొందెడి పెన్నిధుల్ సఖీ!

పోయినకాల మించుకయు ముందుకు రాదు సుఖింప నెచ్చెలీ!
రేయిఁబవళ్ళు లేములును శ్రీ లవుగాములు ఖేదమోదముల్
ప్రాయపుజంట! యేల తడబాటు? త్వరంపడుఁ డంచు కొక్కరో
కో యని కూయుచున్న దదిగో! తుదికోడి గరుత్తు లార్చుచున్ 63

ఈతుదికోడికూఁతలకు నింగిత మేమిటొ! నీముఖాంబుజ
ఖ్యాతికి సాటిరాక హరిణాంకుఁడు క్రుంకులు పెట్టుచుండ నీ
వాఁ తెలిమీఁది కెంజిగులఁ బైకొని తూరుపుకొండ·పై కొనల్
జ్యోతిలగాఁ దొడంగినవి చూచెతివే? మధురారుణాధరీ! 64

మృదుకిసలారుణాంఘ్రులు మఱింతగఁ గెంపిల స్వప్నవీధికిన్
వదలక యేఁగుదెంచి మెయివంపుల తోడుతఁ ద్రావఁ బెట్టెదే
హృదయపుగిన్నియం బొదలు ప్రేమమరందము మందగామినీ!
బ్రదుకులప్రొద్దు కింకఁ గనుపట్టవు దుఃఖపుటంధకారముల్ 65

రతిపతి జతలేనిసితిఁ జూచి నీపేర
విరితూపులను లెస్స కఱకు చేసి
తలిరువిల్తునిమామ చలువవెన్నెలలోనఁ
బొలయించు చంద్రునిప్పుకలఁ జెఱగి

వలపెంచి మోకరించి పట్టపగ్గములేక
మొగలిరేకులనుండి తగిలి పిచి
మాటిమాటలు మరిగొవ్వ మాటికి
వలచిన బ్రాలిపి కూఁతలను గూసి

నెనొక్కఁడ నాబ న న్నింద జేన్ని యిన్ని
క్రీడలవ్యాథల గొలుపుచున్నాఁడు లలన!
ఇట్టి లిమ్ము నీ యాలింగనేంద్రధనువు
నెక్కుపెట్టి యక్కందప్ప సుక్కడంతు 66

అలుకనలుకాని యలుగుదెబ్బలకుఁ జిక్కి
నీకునై నేను నాకునై నీవు నెపుడు
దిగులువడ నేల విరహాంపుఁ జెరలనడుమ?
హాయిగా నుండ మిఁకఁ జేయిఁజేయిఁ గలపి'' 67

అను చాభూపతి చేఁజా
చిన రాసుత చేయిఁగలపి చెలువుఁడు దానున్
మును పతి వచ్చినమార్గము
నన చని చెఱసాల దాటినపిదప నచటన్ 68

అరుదెంచెడి నూత్నవధూ
వరులకు నెదురేగి చిత్ర ప్రమదాన్వితమా
చిఱునగవు స్వాగతంబునఁ
జెరిమొక జాజిపిరిదండ చేతికి నిచ్చెన్ 69

ఇచ్చినన్ గోని సంయుక్త పృథ్వీరాజు
నేను సూ! ముందు నేను సూ! నేనె యనుచు
నౌకరి నౌకరు నలంకరించుకొని నాకు
దేవి దేవరవలె నుంటఁ దెలియ నరసి 70

"నేఁడుగదా కనంబడియె నేత్రము లున్న ఫలంబు? నేఁడెపో
పైఁడికిఁ దావి యబ్బినది, బ్రహ్మమహాద్భుతరమ్యసృష్టికిన్
బోఁడిమి నేఁడె హెచ్చినది పూవిలుకాని బెడంగుజంటకున్
నేఁడె యెసంగె జోడు తరుణీమణి! మీ జతమైన ప్రౌఢికిన్ 71

ఒక లేశంబుఁ బధంబు దప్పని ప్రపంచోద్దీపితార్కప్రసి
ద్ధకులోద్భూతవు గోరుకొన్న విలసత్ క్ష్మాభర్త సిద్ధించె, మీ
యకలంకాన్వయకీర్తి మిన్నులొరయన్ ఖ్యాతిల్ల వే యింక రా
జకుమారీ! యనసూయవై సుమతివై సావిత్రివై సీతవై 72

కలనైనం బతిభక్తి నేమఱకు మక్కార్యానసే యుక్కసె
న్గలతాలింపులవంట- కాలునియెడందన్ గాలమైయుంట- మం
టలకున్ గాలకయుంట-మింట రవియుంటన్ జేయు టిట్లైన్నో! నీ
జిలుగుంబైఁట చెఱంగు నుంట యగు వాసిన్ నూత్నసీమంతినీ!

పగతుని భూము లివ్వి మగువా! తెలవాఱఁగనుండె నుండగాఁ
దగ దిటఁ దప్పకోవలయు దాయలు మీసడిఁ గన్నుచుప్పలోఁ
దగిలిన పావురమ్ములవిధ మ్మగుఁ జల్లగఁ బోయిరండు! కన్
దగిలెడిపుల్ల నెప్పు డయినన్ గనిపెట్టి చరింపగా వలెన్! 74

ఏ నేమంటిని మిమ్ము-కాదు-నిను నేనే పోయిరమ్మంటినా?
నేనా!-నామన సొప్పి-నా పెదవితోనే! నిన్ను బొమ్మంటినా?
ఔ! నౌ! నంటిని- యన్నమాత్రమున కేనా పోవనున్నావు? చా
నా! నాజీవితజీవమా! మఱఁదలా! నన్నొంటరిన్ జేతువా? 75

తడబడుచుండె మాటలు పదంబులు తొట్రిలుచుండె గుండియల్
దడదడ కొట్టుకోఁదొడఁగెఁ దద్దయు నామెయినుండి యేదియో!
విడివడుచున్నయట్టు లౌదవెన్ నను వీడెద వన్నచింత నా
యెడఁదఁ బడన్; వియోగ మది యెంతటిదుర్భరమైనదే! సఖీ! 76

సం దిసుమంతలేని దృఢసఖ్యముచే నిను బాసియుండలే
నందుకుఁ గుందుచుంటి నది వ్యర్థము వ్యర్థము మేనమామకున్
నందననైన నిర్బలను నాకడ నిన్నెటు లుంచుకోనగున్?
సుందరి! పొందుపొం దొకరిసొమ్ము మఱొక్కరి కేలఁజెందెడిన్? 77

పరమశత్రువు మీతండ్రి మఱల మనము
కలసికోఁగలభాగ్యంబు కలదొ! లేదొ!''
అనుచు సంయుక్త నాశ్లేషమొనరుచుకొని
గుండెబరువున చిత్రవీడ్కో- లొసంగె 78

''దొంగలమా? భయపడిపో
వంగఁ బనే మిట్లు రాచవారికి?; మనయీ
సంగతి నెల్లరు విని మె
చ్చంగఁ జనుట లెస్స యనుచు సంతసపడుచున్ 79

అతిభక్తి విశ్వేశ్వరాలయమ్మునకు మో,
దమున ముమ్మారు ప్రదక్షిణించి
నగరమ్ము దద్దరిల్లఁగఁ గోటకొమ్మకు
వ్రేలఁగట్టిన రణభేరి గొట్టి
పట్టినచేపట్లు వదలక వాడవా
డలఁ బెండ్లి నడకల గలయఁదిరిగి
పరుసంబులాడుచు బంధింప నెగఁబడ్డ
శాత్రవనికరమ్ముఁ జానమోది 80

రాణిసంయుక్తతోఁ బృథ్వి రాజు తాను
వచ్చునపు డొక్కచో భద్రపఱచియున్న
యశ్వరాజంబు తీవిగా నధివసించి
యల్లనల్లన ఢిల్లీకి వెళ్ళుచుండె! 81

లతికామహీజదంపతు లతివృష్టిగా
వర్షించి రమలపుష్పాక్షతలను
శుకశారికాది ద్విజకులప్రసిద్ధులు
పలికి రాశీర్వాదభాషితములు
అళులేఱు లనువాద్యకులు మొరయించిరి
నవకీని శుభతూర్యనాదములను
కోకిల కన్యకల్ గొంతెత్తి తీయఁగాఁ
బాడి రాద్వాహకప్రణయగీతి

ప్రథితనూతాన్నవసీంద్ర దంపతులు వారు
దైవ మవలిపూజ్యనృపేంద్రదంపతులను
అదన కగుభాతి శక్తి సంపదలకొలఁది
నెవరు గారవింపకయుందు రిచ్చదీర? 82

బలుకొండసఖు నెక్కి గలగల ప్రవహించు
సెలయేటిప్రియురాలివలపుఁ జూపి
కొనఁదాక పెనవైచుకొనిపోయి యలరారు
నెలమావివిరితీవె వలపుఁ జూపి
కొసకొమ్మలవసించి గుసగుసల్ వోయెడి
బెళగువ్వజంటలవలపుఁ జూపి
ఆకాశవీథిలో నేకమై విహరించు
వెలిమబ్బు కఱిమబ్బు వలపుఁ జూపి

బిట్టుగా కౌగలింప నాబిడ యిదేమి
యనెడు కరణి వెన్కకు వదనాబ్జ మెత్తి
కనుగొనఁగ ఱేఁడు చుంబించుకొనియె నెవఁడు
దొరకునవకాశమును గడద్రోసికొనును? 83

"ఇచ్చోటనే యాజికేతెంచి వెనుకాడు
క్రీడికిఁ గృష్ణుండు గీతగఱపె
ఇచ్చోటనే శౌర్యమెసఁగించి యభిమన్యుఁ
డంబుజ వ్యూహామం దతనుఁడయ్యె

ఈచోటనే దురదృష్టవశమున, క
ర్ణుని రథం బవనికిఁ గ్రుంగిపోయె
ఈచోటనే కురువృద్ధుఁ డద్భుతలీల
నమ్ముల పడకపై నసువుఁ బాసె

అని కురుక్షేత్ర సంగరావనుల ఘనులఁ
గూర్చి నిజపత్ని కెఱిఁగించుకొనుచునుండఁ
జంకనుండిన పిడిబాకు జాఱిపోయె
జాఱిపోవుటే యెఱుగఁ డాత్మవరుండు.

"అయయో! యేమిటి యీసువేళ లనన్నై క్యాజ్యశుద్ధి వృత్తాంతః మ
ప్రియమా యోధులగాధః లాజుననినన్ భీభత్సమా?—యేదియో
భయమేపారుచునుండె!—నెందులకు?—చెప్పంజాల"—నం చాప్రియా
ప్రియులీరీతిఁ బరస్పరంబుగఁ దమిన్ బృచ్ఛించున్ కొంచుండఁగన్.

త దవనీశ సూత్ని సుమాస్త్ర దంపతులకు
వాహానంబైన యౌవన్న హారువంబు
రూపముంగొన్న గంధమారుతము కరణి
మెల్లమెల్లగ నరుదెంచె ఢిల్లిపురికి. ౮౬

కవులును చిత్రలేఖకులు గాయకులా నవరాజ దంపత
ప్రవరులఁ గన్నయూ పయిన వారలశాగము సౌష్ఠవమ్ముఁ వై
భవములఁగాక యన్యముల వ్రాయరు వేయరు పాడరల్ల త
మ్మివిరులఁగాకయన్యముల మేకొనకుండెడు తేఁటులంబలెన్. 87

ఢిల్లీపట్టణ మందు నేవల్ల వినిన
నేవలనఁ గన్న వేతేమి యెఱుక పడవు
ఆ విలాస దంపతుల ప్రస్తావనములె
ఆ పవిత్ర మూర్తులకు నాత్మార్పణములె! 88

ప్రాచీనార్య పవిత్ర వర్తన యుత బ్రహ్మాండ నిష్ఠాగరి
ష్ఠాచార ప్రముఖా! వినూతన విశిష్టాంగ్లాంధ్రగీర్వాణ భా
షాచాతుర్యఘనా! మహా సుమతి చంచచ్ఛిక్షితానేకశి
ష్యాచార్యప్రవరా! యశః ప్రథితభీష్మప్రజ్ఞ మార్గాకరా!

సహజప్రసిద్ధ మధురిమ
మహా విశాల స్వభావ! మంజులభావా!
బహుముఖ కవితాప్రజ్ఞా!
సహస్ర ఫణ్యేకవీర సద్గ్రంథకవీ! 90

మంజుభాషిణీవృత్తము.

పరమోపకార! రసభావభాసురా!
కరుణాంతరంగ! శిబి కర్ణ వర్తనా!
సరసప్రసంగ! వరసాహితీ సుధా
కర! విశ్వనాథకుల కంధినందనా! 91

ఇది బీర్నీడివంశ సంజాత సంతోష మోక్షకవి తనూభవ
ప్రసన్నకవి ప్రణీతంబయిన పృథ్వీభాగవత
ప్రబంధంబునందు ప్రణయస్కంధము.

# పృథ్వీభాగవతము

## రణస్కంధము.



కవిసమ్రాడ్బిరుద
స్వీకార! కళాప్రపూర్ణ బిరుదోదారా!
కాకవి మదగజహర్య
క్షా! వరలక్ష్మీమనోజ! కవనబిడౌజా!

బలియుఁడు పృథ్వీరాజు తనపట్టిని గైకొని యేగునాఁ డనిన్
నిలిచి మగంటిమిన్ నెరపనేరక దొంగలు వచ్చిపోవ నా
ర్నెలలకు నూరసింగములు రేగిన రీతిఁ గనోజిరాజు పే
రలుక వహించె ఢిల్లినగరాధిపుఁ డేగిన కొన్నినాళ్లకున్ 1

"వంటయింటికుందేలయి వచ్చిన యభి
యాతి నొక్కనిఁ బరిమార్పఁ జేతగాక
పోవనిచ్చిరి నను వేలుపుచ్చి రనుచు
సైనికులమీఁదఁ గఠినమహాచర్య జరిపె. 2

"హరిహరాదులకైనఁ జొర వీలుగాని నా
చెఱసాల కేరీతిఁ జేరగలిగె?
విచ్చుగత్తుల కోటపెట్టిన ట్లున్న ర
క్షకపాళి నెబ్భంగిఁ గన్నుమూసె?
చెఱసాల నొకచోట మఱుగున నుంచిన
సంయుక్త నేమాడ్కిఁ జాఱఁదీసె?
చనసీక చుట్టుముట్టినవారి నందఱ
నొక్కఁడే విధమ్మున నోటుపఱచె?

ఔర ! యెంత వింత నోరుండ నాలుక
దీసినాఁ డిఁ కేమి తీయలేఁడు
జమునినైన గెల్చు జమిలిగుండియవాఁడు
వైరి కలవిగానివాఁడు వాఁడు ! 3

పురములోఁ బడి కూఁతునే ముచ్చిలించె
మిన్నకుండిన నన్నేమి మిడుకఁనిచ్చు ?
నమ్మకూడదు వీని నన్నటికినైన
ప్రాణగొడ్డము సుమి వానిబ్రతుకు నాకు। 4

పెట్టినపేరుదక్కఁ గడుబెట్టుగ వర్తిలుచుండె నెట్టులో!
నెట్టితి నింతకాల మొకనేర్పున నేఁటికి నాప్రతాపపుం
గుట్టు బయిల్పడంగ నొనకూడె నిఁ కేమొనరింతు? వాని నే
నెట్టు జయింతు? నేపగిది నీపగఁ దీర్చుకొనంగఁ జాలుదున్? 5

ఘోరిమామూదు మును పేడుమారు లతని
తోడ సంగరమొనరించి యోడిపోయె
నతఁడు కుపితుఁడై పెద్దసైన్యంబుతోడ
నున్నవాఁ డిప్పుఁ డితని నోటుపుచ్చ ! 6

అతఁడె యీఁగక్రొత్తారాతివాస్తిమదము
నడఁపఁజాలిన పదునైన యంకుశంబు
పనసములు వోసి వైరమ్ముఁ బ్రబలఁజేసి
వానిచే వీని పొగరు కీడ్వఁబుతు" ననుచు. 7

"శ్రీమద్ఘూరీప్రభునకు
ప్రేమాదరణములతోడ వినతుండై మీ
క్షేమాకాంక్షి కనోజీ
భూమీశుఁడు వ్రాసిపంపు ముఖ్యాంశంబుల్ 8

ఆఱినదో! రాచఱికము
తీఱినదో! యుబుసు బలము తెలవాఱినదో!
ఘూరీమ్హామూదున్నృపా
లా! రావే మిపుడు ఢిల్లి నరయుటకైనన్ 9

నిను గెలిచినాఁడు నేఁడు నన్ జెనకినాఁడు
పృథ్వీరా జిర్వురకు శత్రువే సమముగ
అధిప! నీవు నే నొకరైన నతఁడు రెండు
బెబ్బులులకుఁ జిక్కినలేడి పిల్లగాఁడె? 10

చెనకక యే యుండవలయుఁ
జెనకిన దునుముటొ! మడయుటొ! చెల్లుంగానీ
వెనుదీయుట తగునా? మగ
తనమా? మనరాణ తగ్గదా యిటులైనన్? 11

ఈవు దండు నడుపుటే నెఱుంగుదుఁ గాని
పోరునడుపునాఁటితీ రెఱుంగ
అందుచేత "పాప"! మపజయ మపుడెద్యు
నేఁటినుండి జరుగనేర దటుల 12

ఇత్తూరి సెదె జయ మా
యత్తంపడి రమ్ము గెలుపునందగ నీకున్
సత్తా లేకుండిన నే
వత్తాసిగ వత్తు భయము వలదు నృపాలా! 13

అని కనోజీమహీనేత యాఖ్యానవని
పాలునకు ఢిల్లి భూతలేశ్వరుని పైకి
మరల దండెత్తి రమ్మని పురికొలుపుచుఁ
గమ్మ నొక్కటి వ్రాసి తత్క్షణమె పంపె! 14

మాతృదేశరక్షకుఁ దోడిమనుజపతిని
దునుమఁ బరదేశపతినిరమ్మని లిఖించు
టా? యకట! ముందు వెనుకల నరయరుగద?
కుటిల మతులు! దేశద్రోహికుజను లెపుడు! 15

జయచంద్రుఁడు వ్రాసి పనిపి
న యుత్తరమ్మును బ్రియమ్మునఁ గైకొని వి
ప్పి యుదంతము నెల్ల నరసి
నయనమ్ముల కద్దుకొని మనమున నుబుకుచున్ 16

"అచ్ఛాహో! జయచంద్రరాజ! తుము బౌతచ్ఛా! సెబాస్ భేష్ నినున్
మెచ్చా" నంచు బహూకరించి తలపై మేల్పట్టుకుల్లాయియూల్
కుచ్చుల్ దుంపెసలార మెచ్చుకొనుచున్ ఘోరీ పటాలమ్ముతో
విచ్చేయన్ సమకట్టెఁ బోరునకు నిర్వృతిన్ జయాపేక్షియై 17

సిగ్గెఱింగిన మగచిన్నవారల నెల్ల
వీరయోధులుగాఁ దయారుచేసి
మునుపట్టి రణరంగమున మొక్కవోయిన,
పటుశస్త్రముల కెల్లఁ బదనువెట్టి
రసపుత్రులనన్న మొగసని భటులకు "ఫ
ర్వానహీ" యంచు నిబ్బరము సెప్పి
ఈతూరి యెటుసేయ నెంచితో యని పలు
మాఱు లల్లాకు నమాజు చేసి

రణతరణియైన పృథ్వీరాజును జయింప
యుద్ధసన్నద్ధుఁడై శౌర్య ముట్టిపడఁగ
మండిమార్బలము దగుసిబ్బందితోడ
తురకయెకిమీఁడు ఢిల్లీకి నరుగుదెంచె! 18

రణభేరీనినదంబు పర్వెఁ బ్రళయారావైకసందేహ కా
రణ మై యాహవధీరవీరభటగర్జాసంభృతోత్సాహ మై
ధణధంధా మ్మనుశబ్దముల్ దివిఁ బ్రతిధ్వానంబు గావించు ప్రే
రణ ఢిల్లీ పురిమందర క్షుభితపారావారమైఘూర్ణిలన్ 19

నాఁడు ఢిల్లీశ్వరుఁడు నిజాంతఃపురాన
ననుఁగుపత్నితోఁ బాచిక లాడుచుండి
మామపనుపున నప్షన్ధరామహీశుఁ
డప్పుడు దండెత్తివచ్చిన యంశ మెఱిఁగి— 20

చెనఁట్రిబుణ్రవణారిజనశేషము ప్రాజ్ఞులు సిల్వఁ గూడదం
డ్రు నిజమె నాఁడు నే నది యెఱుంగకపోయితిఁ గాని లేకపో
యిన మొదలంట నారిపుల నెల్లరఁ ద్రుంపనె? నారు నేఁడుపో
రున కరుదెంతు రేఁ యనుచు రోష సమంచితరుద్రమూర్తియై 21

అనికి స్వేచ్ఛగాఁ బోనీక యడ్డగించు
ప్రేయసీప్రార్థనము ధిక్కరించి యామె
ప్రణయసౌధమహోన్నతావరణకుడ్య
ములఁ బగులఁ దన్నుకొని వెలుపలికి వచ్చె- 22

ప్రధనసన్నద్ధుఁడై పృథ్వీరాజుఁగూడ
ననికిఁ జనుదెంచె వీరవాహినులతోడ
సోమరులఁగాక యచ్చమౌశూరవరులఁ
బ్రణయదేవత యాటంకపఱుపఁగలదె? 23

ఇరువాగులవారికి న
ప్వరమున కటు సుంతదూరమునగల స్థానే
శ్వరమున సర్వవినాశన
కరముగ మిగులబెడిదంపు గదనమునడచెన్ 24

పగవాఁడై పగవారికున్న బలముం బట్టించి యారీతిగాఁ
బగసాధించెడు కన్నతండ్రి కడఁకన్ వారింపనై యత్తఱిన్
మగవేసంబున ఖడ్గపాణియయి కంఖాణంబుపై మెల్ల మె
ల్లగ సంయుక్త కనోజిఁ జేరె రవికిన్ లక్షింప రాకుండఁగన్ 25

చేరి హయంబు డిగ్గి పితఁ జేరి నమస్సిడి "(మోకనోజిధా
త్రీరమణా! రణాజిరవరిష్ఠనృపాభరణా। యశోఘనా!
భారతదేశమాతృవిభవ ప్రథితాఖిలకీర్తికారణా!
వైరివిదారణా! యని స్తవంబొనరించి వధూటి యిట్లనెన్॥ 26

"భవ్యభారతదేశ సౌభాగ్యవనము
దావపావకజ్వాల దందహ్యమాన
మానటుల శత్రుసైన్యంబు లాక్రమింప
అదిగో! పొగవోలె రేగె హాహారవంబు. 27

పృథ్వీరాజకాలాంబోధ మేచి యదిగో!
కుంభవర్షమ్ము చే శాంతిఁగూర్పఁ బోయె
దాతి కీవు ఝంఝామారుతమ్ము గాక
చెట్టసుడిగాలివై యగ్గిచెలిమి గొనుదె? 28

దేశముఁ గొల్లగొట్టి పెనుదేవళముల్ పడగొట్టి రత్నపుం
రాశినిఁ గొంచుఁ బోవుచు నరాతులు-చక్కని యైకమత్యమా
దేశముసేయుచుండినను దెల్వి జనింపకపోయె నేమి దు
ర్నాశము దాపురించినదొ! నాజనకా! మనజాతి కక్కటా! 29

మఱువన్ జాలగ నౌనె నాఁడు గజనీమామూదు క్రూరాత్ముఁడై
భరతక్షోణికిఁ జేసిపోయిన దురాపత్క్షోభముల్? వానిలోఁ
గొఱఁతల్ వడ్డ దురాగతాల కిపు డీఘోరీని రప్పించినా
వరెరే! చూచుచు గోతిలోఁబడిద వేలా తండ్రి యున్మాదివై?

చెడుగున్ మంచియుఁ బాఱఁజూడవలదా? చిత్రంబునం దీనుదుం
దుడుకున్ రేపుచు దానిఁదీర్పఁగ దెసుద్యోగంబునన్ జొత్తువా?
అడుగుల్ ముట్టిన నేను నీతనయఁ గానా? నన్ను గైకొన్న భూ
పుఁడు నీకల్లుఁడు గాఁడ? నీ కెవరు బాబూ! వైరు లివ్వారిలోఁ?

భువనభాంధవభాంధవుఁడ వీవు భూనాథ!
　భువనభాంధవ శాత్రవుం డతండు
స్వర్ణవిగ్రహసమర్చకుఁడ వీవు నరేంద్ర!
　స్వర్ణవిగ్రహవినాశకుఁ డతండు
గోదేవతారక్షకుఁడ వీవు రాజేంద్ర!
　గోదేవతాశిక్షకుం డతఁడు
తిలకశిఖాసముజ్జ్వలుఁడ వీవు మహేశ!
　తిలకశిఖాది విద్వేషుఁ డతుండు

వైరములు మాని పుర్వాశ పశ్చిమాశ
యేకమై నట్టులుండె మీ రేకమగుట;
ఏమి ప్రళయంబు మూడునో! యెఱుఁగరాదు
పుణ్యమూర్తికి! భారతభూమి కింక? 32

రాఁగల్గుదురె? యన్యరాజు లూరక మన,
　క్షోణిపైఁ గాలూన గుండె లుండి?
పోఁబోవునే మన మొహరీలు రతనాలు,
　పెఱవారిసిరులకుఁ బెంపుఁగూర్ప?

కాఁబోవునే మనకొన్ని తలమున్నన్ గుల,
మ్ములు మతమ్ములు నిన్ని మునురుకొనుచు
క్షోభించి యుండురే కోట్లకొలఁది భార,
తీయు లొండొరులకు దిక్కులేక

ఐకమత్యమ్ము లేకెకా యక్కటకట!
యిన్నియిన్ని యనర్థమ్ము లిన్నిపగలు
నెలవుకొనియెను సాయనా! నేఁటికైన
నెల్లరము తెల్విఁతోఁ జరియింపవలదె? 33

విడువని చెల్మిబల్మి నటవీస్థలి నెట్టిమృగాల కేనియున్
జడుపులు పుట్ట నిర్భయమునన్ జరియించుచునుండియుండి యే
వడువుననో! విభేదములు వచ్చి వికావికలౌచు వ్యాఘ్రిచే
బడి నశియించినట్టి వృషభంబులగాథ నెఱుంగ లేవకో! 34

పొఱయగ వృద్ధరాజు తనపుత్రుల నల్వురఁ బిల్చి కట్టెలన్
విఱువుఁ డటన్న వారికవి వేఱుగ పెళ్ళున నొక్కటొక్కటై
విఱుగుట మోపుగా విఱుగ వీల్పడకుండుటఁ జూపి నేర్పునన్
గఱపిన యైకమత్యకథ కన్నులఁగట్టకయుంటఁ జిత్రమౌ! 35

గాలికిపోవుగడ్డిపరకల్ సహితం బొకకొన్ని వెంటగా
దేలి మహాద్భుతంబుగ మదేభమునైనను గట్టివేయఁగా
జాలును సర్వసంపదకు సఖ్యమె కారణమౌను, సఖ్యమున్
బోలు బలంబు లేదెచట భూవర కావవె యీవసుంధరన్!

ఇంతకు నొక్కమాట వినుఁ డేఁ దమయల్లుని చేత నీకు బ్రమో
క్తిక్రొత్తుఁ, బ్రశస్తకీర్తి వెలిగింతుఁ, బ్రభుత్వము నెల్ల ధారవో
యింతు, సుఖంబు నింతు, పిత! యిప్పటికేనియు నైకమత్య మా
వంత వహింపుమయ్య! పగవారికి గుండెలు గూలిపోయెడిన్ 37

ఇంచుక భావభేదమున నే మెపుడేనియు నీకు నెగ్గుగా
వించినచో క్షమించుము క్షమించ ననర్హుల మైతిమేని శి
క్షించుము, చాలకున్న నరికించుము, మమ్ముల నంతెగాని క
ల్పించకు మ్లేచ్ఛుఁ గూడి మనవీరధరిత్రికి కష్టనష్టముల్. 38

ఆత్మకథఁ జెప్పికొను టది యఘమె కాని
నినుఁ బ్రబోధించుకొనఁ జెప్పికొనఁగవలసె
నకట! నీసమక్షమునఁ జెప్పికొనుట కిది
మొదటిదే యగునో! తుట్టతుదిదె యగునొ!

పృథ్వీరాజన వ్యర్థభూవిభుఁడు కాఁ డీభారతక్షాత్ర శుం
భద్వీరత్వము రూపనెత్తిన మహాత్మాజాని శ్రీజానియున్
పృథ్వీరా జన నర్థమున్నదికదా విశ్వంభరుం డంచు నేఁ
లా ద్వైతంబిఁక నిందు? కావలయునా యద్దంబు ముంజేతికిన్?

మదనాగంబుల చేతఁ దుత్తుమురుగా మట్టించి దట్టించినన్
గదలన్ గొట్టినఁ గత్తులన్ దఱిగినన్ బ్రహ్లాదు నావంతయున్
వదలంబోని హరి స్తవప్రమదముల్ నన్నుం బ్రబోధించెడున్
వదలంగానివి యే యగున్ గద పరంధామానురాగార్థముల్,

నీవుం దా నొకక్షాత్రజాతి నొకయోనిం బుట్టరే? యిర్వురం
శైవుం డెవ్వఁడు వైష్ణవుం డెవఁడు సచ్ఛౌర్యంబుతో నాతఁడే
నీవై యుందఱు నొక్కకుండకుడుపున్ మెక్కంగ సఖ్యంబుగన్
యావద్భారత మొక్కకేతనపుచాయన్ నిల్వఁగోల్వందుమా!

వెలగట్టన్ గొలపెఁ గాని మహిమన్ వెల్గొందు శ్రీవిష్ణు లీ
లలు ప్రహ్లాదున కమైనటుల లీలాభర్తకున్ గావొ! య
ట్టులె పృథ్వీశునిమేళ్ళ నాకయినయట్టుల్ నీకుఁగావో పితా!
తలఁపన్ మాప్రణయైక్యముల్ పదపదార్థబ్రహ్మసమ్మేళనల్ 43

నీదేహంబునఁ బుట్టి నీకు వ్యధగా నీదాయ నర్పించు ప్ర
హ్లాదన్ నన్ను క్షమించి మద్విభవసౌఖ్యాకాంక్షివై తొంటివి
యాదాసీన్యము నీహిరణ్యకశిపువ్యాపారముల్ మాని స
మ్మోదాంతంబగు నూత్నభాగవతమున్ బొల్పించి బుల్పించుమా!

సమరంబం దొకపక్షమీవు నొకపక్షం బాన్మపుం డుంట న్యా
య్యమ? నా కీ వొకకన్నుఁ దాను నొక కన్నోఁ గాదె? మీయిర్వు రే
సమయంబం దెటులైన నోర్తునె? పితా! చాలింపు మీయాజిఁ గో!
పమునన్ గోసిన ముక్కు శాంతమునఁ గూర్పం గాద దేనాఁటికిన్!

దేశద్రోహము భీకరాఘ మగు నేదేవుండు నీదోషమున్
నాశంబున్ బొనరింపఁజాల డిఁక జన్మక్షోణి కేపాతకం
బేశైలంబు భరంబుగొల్ప దెపు డీకృత్యంబు కంటెన్ బితా!
''దేశద్రోహినృపాలుఁ'' డన్న యపకీర్తిం బోకు మేదుస్థితిన్!

రాణన్ దప్పి తురుష్కరాజు ననికిన్ రప్పించి నీచేయు దు
ర్వాణిజ్యంబు కిరాతుఁ జేసినభయాస్త్రౌఘాతమై కృష్ణని
ర్వాణం బూరక జ్ఞాపకం బగుచు నత్యంతార్తి గల్పించు నా
ప్రాణస్వామి కదే యపాయము! తలంపన్ మేను గంపించెడిన్!

నాతండ్రీ! విన వెంత మొత్తుకొనుచున్నన్ నీతలం పేమిటో?
నాతోఁ జెప్పవు- నన్ను జూడవు వినన్ దాపా చవే భీకరా
రాతుల్ దూకులు పెట్టి చేయు ప్రధనప్రస్థానభేరీధ్వనుల్
చేతుల్ గాలినవెన్క నున్నె ఫల మిస్సీ! యాకులంబట్టినన్?”

అనుచు నెంత సెప్పిన వినఁడాయె నతఁడు
వినిచి వినిచి యామె తిరిగి వెడలిపోయె-
ఔను! పోఁగాల మాసన్నమైనయపుడు
హితవు చెవికెక్క దెట్టి సన్మతులకైన? 49

వీరహుంకారగర్జనల్ బూరటిలఁగఁ
గఱకుఁగత్తులమెఱపులు మెఱిసిపోవ
నుడుకునెత్తుటి జడివాన లొడ్డుచుండెఁ
బ్రధనరంగాన వాహినీవారిదములు 50

ఇరుపక్షంబులవారుఁ బ్రాణములపై నిచ్చల్ విసర్జించి సం
గరరంగంబున నుక్కునిప్పుకలు రేగన్ నెత్తురుల్ వోసి సా
గరముల్ ఢీకొని పోరుచందమున సంగ్రామంబుఁ గావించుచుం
డిరి మున్నెన్నఁడెఱుంగరాని పటిమన్ నిర్నిద్రరౌద్రాకృతిన్

ఆరణభూమిలోఁ దెగినహస్తపదమ్ముల నెత్తురోడఁగా
ధారుణిఁ గూలి యారని ప్రతాపకృశానుఁడు మిణ్గురింప వి
స్తారవిచారసాగరనదద్భ్రమదూర్మి నిమగ్నచిత్తుఁడై
భారతవీరుఁ డొక్కరుఁడు ప్రాణమువోక తపించిపోయెడిన్ 52

అతనికివలెఁ జరణహస్తముల్ దెగినట్టి
వైరివీరుఁ డొకఁడు వానిఁ జూచి
"నీకు నాకు మంచి నేస్తమ్ము సేకూరెఁ
గదలమెదలలేని కారణమున. 53

ఆలుంబిడ్డలఁ జూడ నాసపడియేనా? యశ్రువుల్ రాలఁగా
బాలప్రాయునివోలె నాజి విలపింపన్ సాగినా వక్కటా!
యేలా రావలె? యెందుకీ పగపులోయీ హైందవా! పో రనన్
బూలంబంతులయాటగాఁ దలఁచినావో! పాప మున్మాదివై. 54

ఇది మహాభయంకరమైన కదనభూమి;
ఇచటి కేతెంచు నేశూరు నేని నమలి
మ్రింగివేయక విడువదు మృత్యుదేవి
యతులశస్త్రాస్త్రభీకరాస్యమును దెఱచి. 55

అనినన్ భారతవీరుఁడు
కొనజుట్టున గొట్టుకాడు కొఱప్రాణములన్
వెనుకకు మరలిన మగఁటిమిఁ
దనువున నెగదట్టుకొనుచు దాయ మొగమ్మై. 56

"ఆలుబిడ్డలఁ జూడలేనందు కేడ్వఁ
బ్రాణములు పోవుచున్నందుకైన వగవ
నైకమత్యంబు మా కొకింతైన లేదు
తురకచెలికాడ! యందుకు దుఃఖపడుదు. 57

జనియించినాము స్వచ్ఛంబైన పౌరుష
ప్రథితప్రశస్తగర్భమ్ములందు
ఝుళిపించినాము రోషజ్వాల ఖడ్గముల్
ప్రతిపక్షసంతతుల్ వణఁకిపోవ
వరియించినాము నిర్భరవిక్రమము సూపి
వివిధాహవంబుల విజయలక్ష్మి
వెలయించినాము నిర్మలయశశ్చంద్రికల్
పున్నమరేరాజు చిన్నవోవ

ఎట్లు పుట్టి పెరిగి యెట్టు లుండిన నేమి?
క్షితిని బ్రాకులాడి బ్రతుకుచున్న
చిన్నచీమజాతికున్న యైక్యంబైన
లేకపోయె మాకు లేశమైన!. 58

లేదు లేదు! మా కైక్యము లేదు! లేదు; !
ఉన్నచో నిందు రా గుండెలున్నె మీకు?
సిరులదొరసాని మావీరభరతమాత
తమకపడునొక్కో! యెదురైనదాడి కెల్ల?" 59

అని వచియించుచునుండఁగ
వినుచున్నట్టులె తురుష్కవీరుఁడు గ్రుంగెన్ ;
మొనసిపడు రెండుదండుల
వెనకునఁ బడి భారతీయవీరుఁడు డిందెన్. 60

కరములు తెగిపడ్డ కరులఘీంకృతులతో
స్రవియించు నల్ల వెల్లువలతోడ
పదములు తెగినవార్వముల హేషలతోడ
గజిబిజియైన యంగములతోడ
చెలగాడు వీరులసింహనాదములతోఁ
దుమురుగైన కళేబరమ్ములతోడ
పాఱుబోతుల విహ్వలారావములతోడఁ
దరళించు వివిధాయుధములతోడ

బెట్టిదపు దవాగ్ని ముట్టి దహింపగా
నఱచుకొరవులాడు నడవిఁబోలి
యాటుపోట్ల కుఱుమునంభోనిధిం బోలి
యదరు లుమియుచుండెఁ గదనభూమి. 61

"కొఱప్రాణమునఁ గ్రింద దొరలుచుఁ జేయెత్తి,
శరణన్న పగవారిఁ జంపవలదు
ఊపిరి పోవుచున్నున్నప్పటికైన,
దాయజోధులకు వెన్నీయవలదు

పగతులఁ దునుమాడ మగఁటిమి నెత్తిన,
విచ్చుగత్తుల రిత్తపుచ్చవలదు
పుట్టి గిట్టుచునుండు బుద్బుదప్రాయమౌ,
తుచ్ఛజీవముమీఁద నిచ్ఛవలదు

శాశ్వతయశమ్ము గడియింప సమరమిదియె
పరువు విడనాడఁబోకుఁడు భయపడకుఁడు
అని జయించినఁ జచ్చిన మనకుఁ గలదు
వీరభోజ్యమౌస్వర్గ మోవీరులార! 62

భారతవీరశుంభత్ప్రతాపజ్వాలి
కలు జగజ్జ్యోతులై వెలుఁగవలయు
భారతకీర్తిప్రబంధంబు సురలకు,
నిత్యపాఠ్యంబుగా నెగడవలయు
భారతవిజయంపుబావుటాల్ ఖండఖం
డమున కొక్కొక్కటై నడువవలయు
భారతనామంబు వైరిసంతతికి గుం
డెలలోన గాలమై నిలువవలయు

పుట్టఁబోయి యీపేరితోఁ బుట్టబోరు!
చేయఁబోయి యీసమరంబుఁ జేయబోరు!
అని జయించినఁ జచ్చిన మనకుఁ గలదు
వీరభోగంబె భారతవీరులార!'', 63

అనుచు వినవచ్చె సింహగర్జనముపోలె
శత్రుసంహారిణావేశ జనితశౌర్య
ముఖరపదగుంభితాజి ప్రబోధ మొండు
కదనవీరుల నెమ్మనగుఱుపొడవ 64

ప్రక్కనే యున్న తాళ ంబుపైని నిలిచి
పగతుఁ డొక్కఁడు ఢిల్లీ భూవరుని పైకి
నాయుధముతోడ "ధీ మవ్రూలా!" యటం, చ
మాంతముగ దూకఁబోవు చున్నంతలోన 65

తలచుట్టున్ గను లున్నయట్లుఁ దను వాద్యంతమ్ముగా విచ్చుగ
త్తులతోఁ జేతులు వెల్గి నట్లడరి యెందున్ దూఁకుచున్ శత్రుసే
నల దూటాడుచు నెవ్వరో! యొక వినూత్నవ్యక్తి యవ్వీరు నా
దల నట్టే తెగవేసి ఢిల్లినృపతిన్ దక్కించెఁ జిత్రమ్ముగన్- 66

ఆవినూతనవ్యక్తి మహాద్భుతాజి
కౌశలమునను రెండుపక్షములవారుఁ
గదనముసు మాని యొక్కరగడియసేపు
బిచ్చపోయిరి రెండముల్ విచ్చిపోవ! 67

"అరరె! అల్లా! రహీముఖా" "మరగయారె!"
"ఔర! యావ్యక్తి సంయుక్త, వీరపత్ని"
అనెడి యార్తధ్వనులు- హర్షనినదములును
మిళితమై సుళ్ళు దిరుగుచు మిన్నుముట్టె. 68

తను నాఁగతిఁ గాచిన వ్య
క్తినిఁ గని యావ్యక్తి తనసతీమణియే యూ
ట నెఱిఁగి ఢిల్లీపతి మది
ననురాగాశ్చర్యసమ్ముదాయత్తుండై - 69

"నను బ్రతికించినావు ప్రధనస్థలి నేపున దూఁకివచ్చి ని
న్ననయఁగవత్తురే తమహృదీశుల కండగ నిల్చి పోరులం
బూనరిచి వీరపత్నులయి పొల్చిన కేకయదేశరాజనం
దనయు ధరిత్రిపత్నియు జనార్దనపత్నియు? శౌర్యవర్ధనీ! 70

అలసితివి చాల పోరాట మాపి పురికి
జను మనుచుఁ జెప్పి పృథ్వీరా జనికిజనియె
విభునియానతిఁ దలదాల్చి వీరపత్ని
పోరినుండి హయమ్మునుఁ బురి కదల్చె! 71

ఒక మార్తాండుఁడె చూచునెల్లరకుఁ దా నొక్కొక్కఁడై తోఁచుపో
లిక నొక్కొక్క విరోధియోధునకు ఢిల్లీనాథుఁ డొక్కొక్కఁడై
మొకమున్ జూపఁగనీక శత్రునికరంబున్ జీల్చి చెండాడు చుం
బ్రకటక్షాత్రముఁ జూపె నేనుఁగులఁ బాఱందోలుసింగం బనన్

పారిపో నుంకించుఁ బగతుల నదలించి
యెదిరించు దాయల గదిమి నఱికి
శరణని చేయెత్తు శత్రుల మన్నించి
సాహసించునరులఁ జావమోది

పరుసములఁ బలుకు వైరుల విదళించి
   పైఁబడుపగతురఁ బఱులఁ జఱచి
కరులమాటున నక్కి నరులపై లంఘించి
   కవియు విద్వేషుల గండడంచి

కదనభూమి నెల్ల గాలించి తురుమాడి
విడుపులేక రిపుల వేఁటలాడి
కొలుపుచేయుచుండె గెలుపులసత్తికి
వీరరసము లొలుక పృథ్వీరాజు! 73

"పులివోలెన్ జిననాఁటినుండి కదనంబుల్ మామహమ్మద్‌బలం
బులతోఁ జేయుచు వేఁటలాడి విజయంపుంబావుటా లెత్తఁగా
నలవాటైనది యీధరాధవున "కల్లా! క్యావురే!" యంచుఁ గ
త్తులఁ బోనాడి నుతింపసాగిరి విరోధుల్ జేనిశౌర్యోన్నతుల్ 74

ప్రథ్వీరాజు వీరవిజయ రథస్వామి
నానియెక్కి రింత పక్కి తేఁడు
వానినందకంబు వైకుంఠధామంబు
వానిఁ గెలుచుబలుఁడు వసుధఁ గలఁడె? 75

ప్రధనతలంబులోని యిరువాగులవారి రణంబుఁ జూచి యం
బుధరులకున్ బ్రతాపములు పుట్టి పరస్పర మేచి ఢీకొనన్
బృథులరవంబుతో మెఱపు రేగి కనుల్ మిఱుమిట్లుగొల్పఁగాఁ
బృథివిమహీధవుండు తనయెక్కినగుఱ్ఱముతోడ నిల్పుచుక్-

అసవుల దొఱఁగి యందందు నాజినిఁ బడ్డ
నిలువెత్తు పీనుగుగుట్టలను జూచి
ముఖ్యులెల్లరుఁ గూలిపోయిరి పోయి రన్
దివులు గొల్పు నులివుల్ సెవికివచ్చి
అనినిఁ గాల్వలు గట్టి దొణదొణఁ బ్రవహించు
నెఱ్ఱని నెత్తురుటేర్లు గాంచి
“ఏమి పాముకొన నీభీమమార్గణహోమ?”
మను పృచ్ఛ నెమ్మనమ్మునకుఁ దోఁచి

అశ్వమును డిగ్గి తలఁపుల కొద లొగ్గి
యేమి పాల్పోక కదల కానృపవరుండు
శాంతి రూపెత్తిన నృహరి స్వామివోలె
కలహభూమి నిల్చిన చోటె నిలిచి యుండె 77

ప్రమందిన యోధులన్ గుఱిచి మాటికి రేగుతలంపు టగ్నికిన్
డెందము కంది యుద్ధమున డీల్పడి యుండినఁ గ్రూరశాత్రవుల్
సుందరుఁ డంచుమిన్నకయె చూచుచునుందురె? నెమ్మితేఁకుకం
టం దడిపెట్టుకొన్న నెచటన్ దయపుట్టునె వేఁటకాండ్రకున్?

ఒక్కఁడు చేష్టదక్కి యట నుండుట యారసి యొక్కపెట్టునన్
రక్కసి విచ్చుగత్తుల నరాతిబలంబులు చుట్టుముట్టఁగా
నుక్కరి నట్టులై పృథివియోదుఁడు వారికిఁ జిక్కె నక్కటా!
చిక్కని రాహుదంష్ట్రలకుఁ జిక్కిన యక్కమలాప్తుకైవడిన్ 79

అవల నిమిషంబుక్రితము హైందవుల వలచి
ఖానుల కవోష్ణరుధిరంబుఁ గరఁగ త్రావి
తినిరి ఖానుల వలచి హైందవుల విడిచె
నెంతటి కిలాడి! కాలపులవింతలాడి! 80

చెట్టులోనిచేవ జీవమ్ముపోకడ
నీళ్ళలోనిజాడ నెలఁతులమది
గెలుపురంగసాని వలపులు తలఁపులు
తెలియ నలవియౌనె నలువకైన? 81

అక్కడనంబు మున్నిసుల దై శవపుంజెడుగాలు లెత్తనే
గొంకఁడు నక్క తుండుటకు నోర్వ కొకించుక కాల్గదల్చినన్
గ్రక్కున వచ్చి మూగినవి కాకులు గ్రద్దలు పెద్దబోరువల్
నక్కలుతోడెళ్ళుల్ శవములన్ దినఁ గుంపులుగుంపులై తమిన్.

పటపట పుర్రెలఁ బగలిచి మెదడుల
నెమకుచున్నవి సృగాలములగములు
వెలివడ్డ ప్రేవులఁ బొలుసు చిదపలకై
తాఁగుచున్నయవి గృధ్రములగములు
మూల్గలుగార నెమ్ముకలను గరకర
గముకుచున్నయవి వృకములగములు
ఒలికి పేర్కొనిన నెత్తురులఁ బొడిచిపొడిచి
కముకుచున్నయవి కాకములగములు

ఎఱ్ఱమట్టిచిప్పలును జల్లెచట వచట
పగిలిపడియున్న కుమ్మరావమ్ముపగిదిఁ
బుఱ్ఱెలును నెత్రుకండ లెమ్ముకలతోడ
సమరభూస్థలి యివ్వులహేయముగ నుండె. 83

లబ్ధానేక సుధీ సభాస్తుతి నృపాలాస్థానసత్కార! యా
రబ్ధాంధ్రాభ్యుదయోత్కవిశ్వపథ! గీరాణాంధ్రభాషా సుధా
శబ్దార్థాధిప! సద్విమర్శన కళేశా! విశ్వనాథాన్వవా
యాబ్ధిప్రోజ్వలసోమ! దీనజన రక్షాకాం కల్పద్రుమా! 84

వరలక్ష్మీ త్రిశతీశత
క రచయితా! రచిత బహుళ కావ్యపరిచయా!
విరచిత సహస్ర మధ్యా
క్కర పద్యేశా విమర్శకబుధదినేశా! 85

తోటకవృత్తము.

అసమాన వివేక దయా హృదయా!
రసకావ్యధురీణ! మరందవచః
ప్రసరప్రవరా! రఘురామనుతా!
వసుధామర పావన వంశశశీ! 86

ఇది బీర్నీడివంశ సంజాత సంతోష మోహనకవి తనూభవ
ప్రసన్నకవి ప్రణీతంబయిన పృథ్వీభాగవత
ప్రబంధంబునందు రణస్కంధము.

# పృథ్వీ భాగవతము

## నిర్యాణ స్కంధము



రామదేవ పాదాం
భోరుహ రసబంభరవర! పూర్వాపూర్వో
దార సుధా రచనోద్య
ద్గౌరీశంకర శిఖర! సుకవితాకారా!

అయ్యాపోరుల పృథ్వీభూవిభున కాయాఘ్నన్ధవుం జేడు ప
ర్యాయంబుల్ చెయిచిక్కిపోయి యుపు డారాజన్యుఁ డేకీర్తినో
మాయావాగురఁ బడ్డ వాని వధియింపంగా బూనుకొన్నాఁడిసీ!
న్యాయంబుండునె యన్యరాజ్యరమతృష్ణాసక్తరవ్యక్తికిన్!

"కనుగ్రుడ్లన్ బెకలింతుమా! కరకరన్ గంఠంబునన్ గోతుమా!
పునుకన్ లేపి వధింతుమా? నరనరమ్ముల్ పీకి బాధింతుమా?
తనువున్ ముక్కలు సేతుమా! నడిమికాద్యంతంబుగాఁ జీల్తుమా!
యని తౌరుష్కులు పృథ్వీభూవిభుని సంహరింపనైయుండినన్. 2

వసుధాభ్రంబులు దద్దరిల్లఁగ భయధ్వానంబు "ఘోషమ్మంచు న
క్రసుతో నీపుల బెల్లునన్ జఱచి యక్రౌర్యంబు నాకట్టు చో
నెసఁగన్ ప్రమాన్పడిపోయి రెల్లరట నల్లే; రత్నగర్భోర్వినే
దెసనేదైన విశేషమున్నదో! యరాతిశ్రేణి కెట్లర్థమా?

అనుతాపంబున నొక్క కోమల రుతం బచ్చోటి కేచుంచుచున్
క్షణముల్ హెచ్చుకొలంది హెచ్చుచు భిక క్వాణంబుగా వల్లకీ
ధ్వనిగా వీనులఁ జొచ్చి ముగ్ధమురళీధ్వానంబుగా గుండెకున్
జని యందుండి శిరస్సు కెక్కి తనరెన్ గాంధర్వసంగీతమై 4

ద్రాక్షాస్వాదపుమైకమున్ గొలుపు గీతాలాపకంఠాన రు
ద్రాక్షల్ సొంపెసలార దేహమునఁ గూర్పాసంబు 'లుంగీ' ప్రభల్
సాక్షాత్కారము సేయ హస్తమున భిక్షాపాత్రికన్ బట్టుచున్
జక్షుఃపర్వము చేసె నొక్కఁడు తురుష్కశ్రేణికిన్ ఘోరికిన్.

'అల్లాకీ దయయైతో మేరె ఉరుదయ్యాక్ సాఫ్ జఫా సాఫ్ జఫా
అల్లాహో బిసబిల్లా' యం చతఁడు నాట్యంబాడుచున్ బాడ న
'హ్లాహ్లా' యం చటనున్న యెల్లరున్ నాట్యంబాడుచున్ బాడి రా
ప్రహ్లాదుండు హరిన్ భజింప హరిసేవల్ సేయు దైత్యుల్ బలెన్ 6

పసరంబుల్ దలయూచి సొక్క పసిపాపల్ సొక్కి నిద్రింతు రా
విసనాగుల్ పడగెత్తి యాడు శిరములన్ బిఠెద్దు స్వాంతంబు సం
తసమందున్ గద గాన మొక్కటనః యింకన్ గాననాట్యంబు లే
క సమాసం బగుచోఁ దదర్థమును వ్యాఖ్యానింపఁగా శక్యమే? 7

కాఁబోల్ దా నల ఢిల్లిపట్టపుకవిడ్గణ్యుండు చాంద్భట్టు వే
కాబూల్ భిక్షుకవేషమే వదువునన్ గైసేసికొన్నాఁడొ "జీ!
మైబో లంసెహబాసుబాత్ అముకుకూబ్రాల్లుంఇనేచాప్కళా
మేబాత్ రుస్తుముహై దెఖో ఉసికి బాణ్మేదస్ దెఖో బా! దెఖో"

అను చాసత్కవి పృథ్వీరాజుశరవిద్యాకౌశలంబున్ గనుం
గొని హర్షింపను మూఁగవానికరణిన్ ఘోరీకి చేసైగలన్
బొనరింపన్ వెలయింపనాజ్ఞనిడెనా భూమీశుఁడోయంచుదత్
క్షణమే; యెవ్వరి నాశ పెట్టవు కాళాసందర్శనామోదముల్?

ఒగి భాషింపఁగ "ఉర్దు" రాక యరిగా నూహింపఁగానీక యా
నిగమాచార్యుఁడు భారతీయరఘుగాండీవ్యస్త్రగాథల్ విచి
త్రగతిన్ సంజ్ఞలతోనె తెల్పుచు సభాస్థానంబుఁ బడించెఁ ది
య్యగ; కారే కవితాకళాఢ్యు లుచితవ్యాపారపారాయణుల్?

ఆనూత్నాగతుఁ జిత్రసంజ్ఞలకు హర్షావేశుఁడై పాదుషా
యానన్ జేసెనొ! లేదొ! జాణసభ సేయన్ సైనికుల్ చెంతనై
దానంబందు మనోజ్ఞభూమికను సంస్థాపించి రొక్కింతలో
క్షాత్రనాథుల్ దలపెట్టుకొన్న వడి నేకార్యంబు గాకుండెడిన్?

శిలలన్ గట్టిన యామహోన్నతకళాసింహాసనంబందు రా
డ్బలవిధ్వంసి వసించియుండ నిరుతల్లన్ గుచ్చుటోపీల మం
త్రులు సామంతులు సైన్యసంతతులుపంక్తుల్ దీరికూర్చుండ మె
ప్పులకుప్పన్ సభయొప్పె వేల్పులసభాభూమిన్ విడంబించుచున్.

సరిగా ఘోరికిఁ గంటికబ్బెదుటగా చాంద్భట్టు పెంబెట్టుగా
వరుసన్ సప్తఘటంబులన్ నిలిపి శుంభద్వేశరా! శంబరా
హార! కుంభ్యుద్ధర! కుంభినీరసవిహారా! కానరా! యంచు నా
యరిదైత్యేశనృసింహు నాగమమునభ్యర్థించుచున్నంతలో

ఈడుఁజోడునులేనియంతస్సన్నృపాలేంద్రుండు నాఁడయ్యయో!
“చేడీలంబడి తేఁ డొకండు సభకున్ బిల్పింప విచ్చేయు చు
న్నాఁ డల్లల్లన, ఁ బువ్వులమ్మిన పురానన్ గట్టెలే మ్రబమా?
ఓడల్ బండ్లగు బండ్లు నోడ లగుచో మొన్నాలిన్ విధిప్రేరణన్

ఒక భూమీశ్వరుఁ డాలి నమ్ముకొని రుద్రోర్వీస్థలిన్ గాసె, వే
ఱొకఁ డశ్వంబుల వెట్టిచేసె, నుఱొకండుగ్రాటవుల్ పట్టె నిం,
కొకఁ డజ్ఞాతమునన్ దపించె, నొకరుండుక్కున్ గదన్ గూలె, నే
యెకిమీఁ డీయిల హాయిగా బ్రతికిపోయెన్ వానిచెయ్దమ్ములన్?

భరతక్షత్రియ తేజమెంతటి యశఃప్రజ్ఞాన్వితంబైనదో!
శరవిద్యన్ బ్రకటింపవచ్చు పృథివీశుమ్మభర్త కందున్నయె
ల్ల రయత్నంబుగ లేచి తొల్లిటిపగన్ లక్షింపకే నమ్రులై
కరముల్ మోడిచినారు డాచినను డాగంబోవు జాత్యున్నతుల్!

అటులేతెంచునృపున్ ఫకీరునటకుం డల్లంతగొంపోయి యు
చ్చటికుంభాలకు సూటిగానిలిపి చేసంకెళ్ళ ఛేదించి మీఁ
దటపుట్టంబున రెండుకన్నులకు గంతల్ గట్టి పృథ్వీశుఁడా
ఘటపంక్తిన్ దెగవేయ జాపమునొసంగన్ సంజ్ఞ గావించినన్.

భటులాసంజ్ఞ నెఱింగి తేనికి ధనుర్బాణంబులెన్నింటినె
న్నిటినో! యిచ్చుచునుండ నానృపుఁడు వేనిన్ దీసికొకుండి యా
దటస్వాస్త్రాదులనిచ్చినన్ బడసెఁ బూతంబైన వేగాళ యెం
తటియూపద్దశనైన నన్యముల నటంబోరు ధీరోత్తముల్. 18

"భరతక్ష్మాతలి నాశ్రితావళికి కల్పక్ష్మాజసంరక్షణం
బరులౌవారికి భూరిఘోరమరణంబం చెప్పుడున్ లోకముల్
గుఱుతింపన్ బ్రకటింపనై కృపను నాలో శక్తులఁ రేఁపి యీ
శరచాపంబుల నందజేసిన కపీశస్వామి కాత్మాంజలుల్. 19

కలుముల్ జృంభిల శౌర్యకీర్తులు వెలుంగన్ రత్నగర్భాఖ్యయై
నలువన్ మించి వెలార్చు సత్కళల విజ్ఞానంబుతో నొప్పుచున్
నఱసంతేనియు నైకమత్యము ను గానంబోని హిందూర్వికే
బలియైపోవుటయే శుభం బనుచు సంభావింతు నిప్పట్టునన్. 20

అనిలోఁ గూలిన సోదరప్రజలరక్తార్ద్రావనిన్ జూపి, కన్
గొనలన్ నీరము నింపి, గుండియలలోఁ గ్రౌక్రూరముల్ గొల్పి పా
పన్నృపాలత్వపుభ్రాంతులన్ దులిపి సద్వైరాగ్యముల్ జొన్పి యే
నినదంబో! ననురమ్మురమ్మనుచునుండెన్ మార్తునీపాత్రమున్.

ప్రభులెవ్వారలు? ఎవ్వరా ప్రజలు? చంద్రార్కానలాంభోనిధుల్
విభవప్రేమల నేక తత్త్వమున జీవింపించి పోషించు నీ
యఖిల [illegible] దగునెయీవ్యత్యాసముల్? కారె యీ
యుభయుల్ దేవునిముద్దుసంతు? శుభమే యుగ్రాహవోద్యోగముల్?

ఈతూఁపుల్ ననుజేరి శౌర్యమును రేకెత్తించుచున్ హింసపై
రోఁతల్ పుట్టిననాకు **నూత్న**సమరప్రోత్సాహముల్ గొల్పెడిన్
జేతంబూని త్యజింపనేమిటికి దుర్నీతుల్ నశింపై యహిం
సాతత్త్వంబు జగంబులేలి తనియింపన్ వీని సంధించెదన్" 23

అని ఢిల్లీ ధరణీధవుండు నిజనిర్యాణంబునున్ గూర్చి జ్యా
ధ్వనిగావించుచు నాలపింప "నవు!నీతెడుంన్ మహాగాయకుం"
డని యందెల్లరు మోదమందుచు శిరంబాడించి రేగాని మా
రణవృత్తాంతముగాన కైరి విషయ్యాప్రాజ్ఞుల్ సుమీ! తన్మయుల్

"క్షితినాథేశ్వర! వాలిజంపుటకు ముక్ శ్రీరామచంద్రప్రభుం
డతులప్రౌఢిమఁ దాళ్ళనేడిటినొకే యస్త్రంబునన్ గోల్చె నా
కతగానీవును నప్త శాండముల కేకాస్త్రించనె పాదుషా
కుతకంబార్చి భవన్మహత్వమున కుక్కుంగోటలం గట్టుమా!

రవియస్తాంబుధిఁ గ్రుంకనుండెఁ దిమిరవ్రాతంబు సర్వావనిన్
ఠవిక్రుంకన్ గబళింపఁ బొంచె నిశితోగ్రాస్త్రీయుదోపేతమృ
త్యువు నీయాదల నాడుచున్నది నృపాలోత్తంస! నీవీర భా
గవతంబీవిలువేటుతోడ ముగియంగా వచ్చు నంచెంచెదన్.

నేలాలించితి నీరసింతిదనుకన్ శ్రీభారతీయాస్త్రవి
ద్యాలావణ్య మహాద్భుతప్రతిభ నీయందం బ్రదర్శింప న
న్నేలీలన్ దనియింపఁ జేసెదవో! యేదీచూపు నీ ప్రౌఢిమం?
బాలస్వాదమృతం విషమ్మగు గదయ్యా! రాజకంఠీరవా!" 27

అనిచాంద్భట్టు విచిత్రవైఖరి మహాహ్లాదంబుతో భాండరా
జిని సప్తస్వరముల్ సెలంగ మొరపించెన్ తేఁడు గుర్తించి ని
క్వణపుంజాయనె దృష్టినుంచి చెవిదాఁకన్ నారి సారించు చో
య్యన నాకుంచితదేహుఁడై విడిచె దివ్యాస్త్రంబు బోపెట్టఁగన్.

ఢిల్లీభూధవు నంబు వ్రేటునకు చిట్చిట్చిట్టునన్ వ్రయ్యలై
డుల్లెన్ భూస్థలిమీఁదికా ఘటము లేదున్ ఘోరశీర్షంబు; న
ల్లల్లారావము మిన్నుముట్టె వెస నాయూష్షున్ బలం బీటెలుం
బల్లెంబుల్ గొని పృథ్వీపుంగ దిసె "మారాత్మ" రంచునొక్కుమ్మడిన్

దాయల్ డాయకమున్నె స్వాస్త్రములహృత్స్థానంబునన్ గ్రుమ్మ కాం
చాయాసంబున నెత్తురుల్ వెడల సాయంకాల రక్తారుణ
చ్ఛాయాసంధ్యలఁ గుంకిపోయెడి సరోజాప్తక్రియన్ క్షాత్రపృ
థ్వీయోషాపతి క్రుంకిపోయె సమయాధీనుల్ గదా సర్వులున్? 30

పృథివీగోళము గిఱ్ఱునన్ దిరిగెఁ గంపించెన్ గిరుల్, రాలెద్యో
పథమధ్యంబుననుండి రిక్కజత, భాస్వత్తుండు నీలాంబుద
శ్లథతీక్ష్ణప్రభుఁడయ్యె. వాయువులు సంస్తభించె స్వాస్త్రంబులన్
బృథివీరాజు కథావశేషుఁడగు నవ్వేళన్ విషాదంబుగన్. 31

స్ఫటికస్వచ్ఛతహైందవ ప్రణయదాంపత్యానుబంధంబుగా
నిట పృథ్వీనృపుఁడెప్పుడాయువుల నిఱ్ఱింకించుకొన్నాఁడొ! య
చ్చట సంయుక్తయు నప్పుడే చెలులపజ్జన్ సెజ్జలోనున్న దు
న్నటు జీవంబెడబాసె భాస్కరుఁడు క్రుంకన్ గ్రుంకదే ఛాయయున్?

మేఘమును విడనాడునే మెఱపుదీవె?
చంద్రు నెడబాయజాలునె చంద్రకాంతి?
విరినివిడి పిసాళించునే పరిమళంబు?
పతి గతించినచో వీర పత్ని మనునె? 33

హారి! హారి యంచు యోధుఁ డొకఁడా పృథివీపతిరక్తపుంగళే
బరమును లేవనెత్తి పెఱవారికిఁ గన్పడకుండ నెట్టులో
తురగము మీఁదఁ బెట్టుకొని తోడనె యంతఃపురమ్ముఁ జేరెఁ ద
త్తరుణులు భర్తృభీకరవధాకులతం బడి గూలిపోవఁగన్ 34

ఆవిభు రక్తసిక్తతను వారసి యారసవీరనారుల
య్యో! విధియంచు దుఃఖమెదనూనిన గద్గదికస్వరమ్ముతోఁ
గావని కేకవైచి తడికంట గుభిల్లునఁ గూలిరింట్లతోఁ
దావులుదప్పి ఝుంఝులకు ధారణిఁ గూలెడి తీవెలం బలెన్.

ధీర లగుటఁ గాఁబోలు నావీరనారు
లధరణీపు మృతికి హృదయములు వగిలి
పైకుబికివచ్చు సంతత బాష్పఝరులఁ
ద్రుళ్ళి పడనీక లోలోనఁ గ్రుక్కుకొనుచు. 36

ఈ సంయుక్త మహాపతివ్రతచుఁడీ పృథ్వీధరిత్రీధవుం
డా సంగ్రామములోన నెట్టి సమయంబం దాయువుల్ వాసెనో!
యీ సాధ్వీమణి యిందునా సమయమం దే యాయువుల్ వాసె నేఁ
డీ సౌభాగ్యపుఁజావు లేలొ! యరుదయ్యెన్ బూతహిందూర్వరన్.

అగుపించుటయె లేదు విగతజీవుల పున
ర్జీవింపఁ జేయు సంజీవకరణి
కనుపించుటయె లేదు కామ యానంబున
కుపకరించెడి దివ్యయోగవిద్య

అగుపట్టుటయె లేదు తగినట్టు లమరుల
మన్ననల్ గొనుమహామంత్రశక్తి
కనుపట్టుటయె లేదు ఘన మహత్త్వము లైన
దూరశ్రవణమునుదూరదృష్టి

సతత మోర్వని కాలకుత్సితుని చేతఁ
గబళితములైన భారత ఘనత లెన్నొ!
ద్విరదిమ్రింగి వెల్వార్చిన వెలఁగపండ్లు
కరణిఁ దోఁచెడు నిపుడుత్త గాథ లగుచు. 38

అద్భుతంబైన మహిమల ననుపమముగ
భరత ధాత్రిని సృజియించి పద్మభవుఁడు
మరల దరిగించు చున్నాఁడు మాన్పఁగలమె?
కంచెయే చేను మేసినఁ గలదె దిక్కు? 39

రాణికై యేడ్చుచుండంగ రాజు కొఱకు
నడలగావచ్చె మన కిఁ కేమనగ వచ్చు?
నీటి చాలులఁ బడివచ్చు నీళ్ళ పగిది
నాపదలవెంట నాపద లరుగు దెంచు. 40

నిండుగ మునిఁగిన జలియే
యుండదు కూర్చుండిన ఫలముండదు లెండీ!
రండీ! రాజ్ఞిని నిప్పుల
గుండమునఁబడి వడిఁ జేరు కొంద మటంచున్ 41

చితి పేర్చించుకొని ధరా
పతి సతి శవములఁ జితినిడి భగవతి! జయ పా
ర్వతి! శాంభవీ! యనుచు న
య్యతివగుమియు నందుదుమికి హుతమయ్యెఁ గటా!

బుగబుగ మని పొగ లెగయఁగ
ధగధగ మండుకొనుచుఁ జితి తత్పతుల నాగిన్
దెగ తిగుచుకొనియె గుణులగు
మగువ లన్నిన మక్కువేమొ! మంటలకైనన్!

వారి బంగారు తనువుల వారి హృదయ
తాపముల లెస్స తిన్న కతమునఁ గాక
యున్నచో వహ్ని కెక్కడి నుండి వచ్చె
నంతచక్కని కెంజాయ? అంతటి సెగ? 44

దినరాజు దివి నుండఁగనె ఢిల్లి పురమునఁ
జీఁకట్లు చయ్యనఁ బ్రాకిపోయె
జ్వలియించుచునె వీరపత్నీమనః ప్రణ
యజ్యోతి గప్పున నాఱిపోయె
వాసించుచునె రాచవారి పువ్వులతోఁట
మాటలో మలమల మాడిపోయె
సంతసించుచునె రాజాంతఃపురము దుఃఖ
వనధిని బోరున మునిఁగిపోయె

అయయొ! యెంతలో నెంత మార్పయ్యె ఢిల్లి
నగరమెల్లను నొక్కభూనాథుకతన
ఎప్పుడే వేళ కేయది యెట్టులగునొ!
యెఱుఁగజాలిన మహనీయు లెవరుజగతి? 45

అంతమహమ్మదీయులు రయంబున ఢిల్లినిముట్టగించి యం
తంతకు దేశమంత గొను నాశలతో జయచంద్ర మాంకువం
శాంతకమైననీచెలిమి యక్కఱలే దనుచున్ గనోజి భూ
కాంతుని గూలుపన్ దొలుతఁగాఁ గబురంపిరి ఖడ్గపాణులై. 46

అవనీపాలకులెల్ల నీకపటమంత్రాంగంబునన్ బోరి మృ
త్యువుపాలై నశియించిపోయిరి కులద్రోహీ! కనోజీమహీ
ధవ! ఛీ! నీ మొగమింకఁజూడ నను చందంబొప్పగా లోకబాం
ధవుఁడస్త్రాద్రికిఁ జేరెనంబరమునన్ ద్వాంతచ్ఛటల్ గ్రమ్మఁగన్

ఒకసేన నొకసేన యొడచితాకినభంగి
నొక మబ్బు నొక్కమబ్బొడిచి తాకి
ఒకకత్తి నొకకత్తి యొరయఁగాఁగల్గు ఘ
ర్ఘరములుం బోలె బెల్లుఱుము లుఱిమి
వలపించి కులికిన గెలుపుఁజేడియ సుమా
లపుజూపు లనఁ దటిల్లతలు మెఱసి
అసిఘాతములకుఁ గంగిసఁబడ్డ రుధిరధా
రలయట్లు కుంభవర్షంబు గురిసి

ఉఱిమి మెఱసి కురియుటకునిరువులైన
కారణమ్మైన గగన రంగస్థలాన
నాఁడుజరిగిన ప్రళయసంగ్రామదృశ్య
మును ప్రదర్శించినవి కాఱుమొయిలుగములు

పోరిలో రాసుతులఁ గోలుపోయి యంటుఁ
బడ్డ భారతాంబను శుచిపఱచిపోవ
నభ్రగంగయే దిగివచ్చినట్లు వెల్లు
వడరి యిలయెల్ల జలమయమ్మై రహించె. 49

అభ్రగంగాదయాసహాయంబు కతన
భరతమాత యాశౌచంబుఁ బాపుకొనఁగ
దానమాడిన దొడ్డ ముత్తైదు వట్లు
పొరలిపాఱెడి యన్నీట మునిఁగి తేలె 50

ఉఱుముఱిమిన యప్పుడుగ్రుఁడై పృథివిరా
జురికి మీఁదఁబడిన ట్లులికిపడుచు
మెఱసినయప్పుడెల్ల మరణించిన తనూజ
మఱలవచ్చినయట్లు వెఱపుగొనుచు
వలిగాలిచినుకుతుంపరసోఁక పచ్చిపీ
న్గులఁదాఁకుచున్నట్లు గలఁతపడుచు
ధణధణ పడువర్షధారల కరులెత్తి
వచ్చుచున్నట్లెంచివణఁకుకొనుచు

ఆప్తులు తన్ను గెలువఁగా నరుగుదెంచు
చున్నవార్తను జయచంద్రుఁడోడి వికలుఁ
డై తెలివిమాలిన స్వయంకృతాపరాధ
మునకుఁ దన్నుదా నిందించుకొనుచునుండె. 51

ఇటులుండఁగ నొకత్రుటిసే
పటి కలిఁకి భరతమాత బాష్పకణంబుల్
చిటిలి పడఁగఁ దనకతమునఁ
గటకటఁ బడుచున్నయటులఁ గని సల్లయ్యెన్. 52

తబ్బిబ్బు మాని మంచియు
సెబ్బర దెలియక మునుతన చేసిన పనికై
యబ్బిబ్బుఁ గొఱకుకొను చతఁ
డబ్బాష్పముఖిన్ దలంచి యార్తుండగుచున్ 53

తల్లీ! భారతమాత! వైభవసమేతా! చింతిలంబోకు ని
న్నల్లాడించిన తత్ప్రతిక్రియకు నాకై నేను హింసించుకో
నుల్లాసంబగునా? యయో! మఱచినానుల్లాస మింకెట్లగున్
ఛిల్లీత్మానపతి పుట్టిరాడు మఱలన్ నీపుణ్యగర్భంబునన్. 54

నీచద్వేషపిశాచి పట్టి మనలన్ గిట్టింపుచుండంగ నే
నాచాంచల్యతురుష్కునిన్ బిలిచి నీయౌదార్యసౌభాగ్యముల్
నాచేసేతులఁ గొల్లపుచ్చితి నెదో! నవ్యోన్నతిన్ గోరి క
ట్టా! చల్లారినవెల్లయున్నతులసూయావహ్ని దగ్ధంబులై 55

ఉన్నట్లుండి దురాయిఁ బెట్టిచను రాజ్యోత్కర్షముఁ గోరి నా
కన్నన్ శూరులె యెందఱో! మునుపు లోకవ్యాకులాభీలులై
మన్నైపోవుటెఱింగియున్ బరమ దుర్మార్గస్వభావుండనై
నిన్నీరీతికిఁ దెచ్చినాఁడ మధువుల్ నేనేవియో! జుట్రనై! 56

జననీ! మేరువువై పునుండి యిటురా సన్నద్ధమైయున్న యె
ఱ్ఱని గాడ్పున్ గని పైఁడిపుప్పొడిదుమారంబంచు భావించి నా
యనుఁగున్ సేలువనొడ్డ నద్దిసుడిగాడ్పై సేలువున్ గొంచుపో
యి ననున్ లేపఁజరించె నాయఘమునన్నే పట్టిభక్షింపఁగన్ 57

ఘనవిజ్ఞాన సురూప శౌర్యములకున్ గాణాచులై దివ్యకీ
ర్తిని జంద్రాతప మట్లుగాఁ బఱపు పుత్రీపుత్రులన్ గన్న భా
గ్యనిధానమ్మవు! దొడ్డతల్లివి! కులఘ్నుఁ గ్రామమూర్ధన్యు న
న్నునెటుల్ గాంచితివమ్మ! నీకడుపు నీనోముల్ సిరుల్ రూపఱన్!

దేశధ్వంసిని జ్ఞానహీనుఁడ కులద్వేషిన్ వినాశాత్మకా
వేశోద్రిక్తుఁడ నాత్మజాంతకుఁడ నావృత్తాంతమెల్లన్ జగ
ద్వైశాల్యంబున నింపుకొన్నది దురంతధ్వాంత సచ్ఛాయ స్త
లేశంబైన భరింపలేవు నను తల్లీ! యిప్పుడిన్నాళ్ళటుల్. 59

దేశద్రోహము భీకరాఘమఁట ఏదేవుండు నాదోషముల్
నాశంబుంబొనరింపజాలఁడఁట జన్మక్షోణి కేపాతకం
బే శైలంబు భరంబుగొల్పదఁట ఈకృత్యంబుకంటెన్ గటా!
దేశద్రోహ మదింత కిల్బిషమఁటే! దిక్కేది నాయునిక్కెన్?

నీశాంత్యున్నతు లన్నుబట్ట శనినెంతేఁబట్టినన్ బట్టనీ!
క్లేశబ్రహ్మకు కన్నుగుట్టి శ్రమలోలిఁ బెట్టినఁ బెట్టనీ!
నాశంబుల్ పలువెంటవెంట వెనువెంటన్ బుట్టినన్ బుట్టనీ!
దేశద్రోహులు పుట్టఁగూడదు సవిత్రీ! యెందు నెప్పట్టునన్. 61

సౌందర్యాతి వివేక సద్గుణ దయాసంయుక్త సంయుక్త నే
నెందానందన నందుకోఁగలను? నాయిక్కట్లకున్ గుందు నా
యందం బాకళ యావచఃప్రతిభ యాయౌదార్యవిజ్ఞానముల్
డెందంబందిరువొందుచుండి నను నేడ్పించున్ దివారాత్రముల్.

నాపాపిష్ట నికృష్టచేష్టలకె యానాబిడ్డ సంయుక్త గూ
పాపూర్వానుపమప్రభావిభవ దీపంబాఱిపోయెన్ మహా
కోపాటోప ఫలంబుఁగంటి మిగిలెన్ గోడొక్కటే యక్కటా!
ఏపెల్ విత్తిన దేవదారులెటులౌ? నేవిత్తు కాచెట్టుపో! 63

అదియచ్చంబుగ దాపతల్లిని ప్రభాఖ్యన్ జంపి యుద్భూతమై
నది తల్లిన్ మఱపింప నాసుతకు నిత్యం బమ్మనై యయ్యనై
హృదిలోఁ బెట్టుక పెంచి పెంచి తుద కేనేదాని భక్షించితిన్
గద! మాతా! నను బోలికూఁతుఁదిను కీనాశుండు లేఁడుర్వరన్

"పృథ్వీరా జనవ్యర్థభూవిభుఁడు కాఁడీ భారతక్షాత్రశుం
భద్వీరత్వము రూపనెత్తిన మహాత్మాజాని శ్రీజానియున్
పృథ్వీరా జన నర్థమున్నది కదా! విశ్వంభరుండంచు నే
లాద్వైతంబిఁక నిందు? కావలయునా యద్దంబు ముంజేతికిన్?

మదనాగంబులచేతఁ దుత్తుమురుగా మట్టించి దట్టించినన్
గదలన్ గొట్టినఁ గత్తులన్ దఱిగినన్ బ్రహ్లాదు నావంతయున్
వదలంబోని హరి స్తవప్రమదముల్ నన్నుం బ్రబోధించెడున్
వదలంగానివియే మగున్ గద? పరంధామానురాగార్థముల్?

నీవుం దానొకక్షాత్రజాతి నొకక్షోణిం బుట్టరే? యిర్వురున్
శైవుం డెవ్వఁడు వైష్ణవుం డెవఁడు? సచ్ఛౌర్యంబుతో నాతఁడే
నీవై యుండఱు నొక్కఁడుండకుడుపున్ మెక్కంగ సఖ్యంబుఁ గన్
యావద్భారత మొక్క కేతనపు చాయన్ నిల్వ గొల్వందుమా!

వెలగట్టన్ గొలపెఁ గాని మహిమన్ వెగ్గొందు శ్రీవిష్ణులీ
లలు ప్రహ్లాదునక మైనటుల లీలాభర్తకుం గావా! య
ట్టులె పృథ్వీశునిమేళ్ళ నాకయినయట్టుల్ నీకుగావో పితా!
తలఁపన్ మా ప్రణయైక్యముల్ పదపదార్థబ్రహ్మసమ్మేళనల్!

నీ దేహంబునఁ బుట్టి నీకువ్యథగా నీదాయ నర్చించు ప్ర
హ్లాదున్ నన్ను క్షమించి మద్విభవసౌఖ్యాకాంక్షివై తొంటి నీ
యౌదాసీన్యము నీహిరణ్యకశిపువ్యాపారముల్ మాని స
మ్మోదాంతంబగు నూత్నభాగవతమున్ బాల్పించి బుల్పించుమా!

అనుచున్ మాకథ నూత్నభాగవతవిఖ్యాతిన్ బ్రవర్తిల్లగా
నను నామూర్ఖతనుండి త్రిప్పుటకునై నాకూఁతు రానాఁడు చె
ప్పినయాయొక్కొకమాట నొక్కొకకనద్వేదోక్తియై యిప్పుడున్
ధ్వనియించున్ జెవిదోయిఁ గింగురులువోవన్ గుండె లల్లాడఁగన్!

కోపావేశములో శుభాశుభము కన్గొనలేక యేఁ బోయి నే
నీపాటుఁ గొని తెచ్చికొంటి ననలేదే? నాఁడు నాబిడ్డ "తం
డ్రీ! పోర్నష్టము పొందులాభ" మని నేనేమైన విన్నాఁడనా?
దీపంబుండఁగ కజ్క పెట్టుకొన నైతిఁ బుద్ధిమంతుండనై 71

జగమేలఁ గల శౌర్యశాలి పృథివీత్ర్యాత్మజాని తానాజిలోఁ
బగరఁ జీల్చుచుఁ జీల్చుచున్ నిలిచి ప్రాణాన్వాటొందినాఁడేల? క
ల్గగవచ్చుఁ రుధిరంబు గన్గొనిన వెన్కఁ జ్ఞానవైరాగ్యముల్
దిగినఁ లోఁతును దిన్నఁగోదె రుచియుఁ దేలున్ మహాజ్ఞానికిన్?

ప్రభుఁడంచున్ బ్రజలాదరించుకొనినన్ బాలింపనోఁగాని యా
రభటిన్ బోరుల పేర సాటి ప్రజనార్వఁ గుత్తుకల్ గోయు పెం
తభయోత్పాత పిశాచివాంఛ యది నాతల్లీ! యొకింతేని ముం
దు భవంబందున వద్దు! వద్దు! సమరోద్యోగంబు నావైకరికిన్!

ప్రభులెవ్వారలు? యెవ్వరా ప్రజలు? చంద్రార్కానలాంభోనిధుల్
విభవప్రేమల నేకతత్త్వమున జీవింపించి పోషించు నీ
యభిరామంబగు సృష్టిలోఁ దగునె యీ వ్యత్యాసముల్? కాదెయీ
యుభయుల్ దేవుని ముద్దుసంతు? శుభమేయుగ్రాహవోద్యోగముల్?

అయయో! యెందఱమాయిక ప్రజలు రాజ్యాశాపిశాచాత్తి ని
ర్దయశాతాయుధదంష్ట్రలన్ దగిలి యుద్ధక్షోణిలో నాశనం
బయిరో! సృష్టికిపుష్టియౌ పురుషశక్త్యైశ్వర్య మెంతెంత దు
ర్వ్యయమైపోయినదో! సతీజగతి రమ్యంబెంద వమ్మైనదో!

అనిలోఁ జచ్చిన స్వర్గమా? యవల రంభాశ్లేష సరంభమా?
అనురాగంబు వివేకమున్న ననియేలా? గొవ్వఁడా వెన్నఁ గా
దని యేనేతిక్రా! దేబెరించు నను బ్రహ్మజ్ఞాని? జన్మోర్విక
న్ననుస్వర్గంబును చేసికొన్నసతికన్నన్ రంభ వేఱున్నదే? 76

అరినాకున్ హరినాకుమారికకునై యాపృథ్వీపుండొప్పగా
సరవిన్ నేను హిరణ్యరాక్షసునిగా సంయుక్తప్రహ్లాదగా
జరిగెన్ భాగవతంబు నూత్నముగ నాత్మోజానిపైఁ గాని తా
నరసింహుండయి నన్ను జీల్చకె చనెన్ నాయంత్యమెట్లోకదే?

అరరే! యొందుల కావిరుద్ధకృతిసంహారంబు? శ్రీజానిచే
నరసింహాకృతినైన నన్యగతినైనన్ బుత్రిపార్శ్వమ్ముగా
మరినాకేకద? చావు రావలయునమ్మా! యట్లుగా కేడ నే
పరుఁడా ఘోరికా! లభ్యపడ్డదది దౌర్భాగ్యుండ నేనన్నిట్లన్

ఆపోరాటపు టుగ్రఝంఝ కనురాగాత్మీయ మిత్రాళి యన్
బ్రాపున్ గొమ్మలు నాకులున్ దునిగిపోవన్ వ్రేళ్ళతోఁ బ్రెవ్విమో
డై పృథ్వీస్థలిఁ బడ్డపాదపమునే యైనాఁడ పాడైన నా
యీపృథ్వీరుహ మేనుకోఁ గలుగునే యెన్నో వసంతాలకున్?

ఈభూమిన్ నరజీవితంబు మృదువౌమృత్పాత్ర తత్పాత్రలో
లోభక్రోధ మదాది షడ్గుణము లుల్లోలంబులై పర్వ నం
దే భావంబును నిగ్రహించుకొన లేకే యుండినన్ దల్లి! ఛి
న్నాభిన్నంబయిపోవునీబ్రతుకుభాండంబాఱునూర్వ్యుల్లన్.

నరజన్మంబున కెత్తి శ్రేష్ఠమగు కన్యాకుబ్జ రాజ్యేందిరా
వరనాథత్వ మొసంగి కంటికిని రెప్పంబోలె నన్నా పరా
త్పరుఁడీక్షించుచుఁగాచుచుండుకగునో! తత్స్వామిదాతృత్వపుం
బరమార్థంబు గ్రహించుకోనయితినంబా! యెప్పుడే ప్రొద్దులన్!

నరకంబే యొకటుండి యందు సరిగా నాకూౄర కృత్యాలకే
పరిణామంబులు శిక్షలే గలిగినన్ బాధింపఁగాఁ జాలునే
నరకంబున్ గిరకంబు? పెక్కుగతులన్ నన్నేఁచఁగా జాలియుం
దురె? మార్గాందురెయయ్యా ముందును గిముందున్? గింకరుల్ గింకరుల్

అదిగో! రాతిరివానపోతల ప్రవాహంబొత్త నువ్వెత్తుగాఁ
గదలంబాఱుచు స్వచ్ఛసుందర తరంగశ్రేణితో జాహ్నవీ
నది యుత్తుంగతరంగనాదముల కంఠంబెత్తి నన్ బిల్చుచు
న్నదితల్లీ! ముగియింతునందుఁ గడుహీనంబైన యీజన్మమున్

మేలౌఁగావుత! నీకు సోదరులకున్; మిమ్మెప్పు డేక్షించుచున్
మీలోనున్న విభిన్న భావములు భస్మీభూతమౌఁగాత! యీ
కాలంబందుమఱొక్కమాఱుదయతోఁ గంజాతుఁడుద్భూతుఁడై
శ్రీలోమ్మ దఁగొద్దుఁగాత! జనయిత్రీ! నేఁ బ్రయాణించెదన్»

అనుచు నాఱేఁడు పరువెత్తుకొనుచుఁ బోయి
వడివడిం బాఱు గంగాస్రవంతిలో గు
భిల్లునందూఁకె వానిఁ గోపించు పగిది
బుడబుడధ్వని నన్నది బుడగ లుఱిమె. 83

జలధరశ్రేణి యాడిన సమరనాటి
కకుఁ బ్రకృతికాంత యెత్తిన కప్పురంపు
టారతుల పళ్ళెరమ్ము నా నవఘళించి
భానుబింబంబు ప్రాగ్దిశఁ గానుపించె. 86

"తనభరియించు వ్యథాఘోరమునకు శి,
రముమీఁది తుహినపర్వతముఁ జూపి
తనరాల్చు కన్నీటి ధారలకు వదనా
నఁగల గంగాసింధునదుల జూపి
తనలోనఁ జెదరిపోయిన గుండియకు నోర
గ రహించు వింధ్యభూధరముఁ జూపి
తనపడ్డ తిలల్లోఁతు తలపోఁతలకుఁ జుట్టు
మొరయుచున్న లవణాంబుధులఁ జూపి

హైందవావని యైకమత్యంబు కొఱకుఁ
గన్నకొడుకుల కెల్లనుఁ గరముఁజాచి
యడుగు కొనుచున్న దిప్పుడు వరసినారె?
మీరు! మీరును! మీరును! మీరు! మీరు!" 87

అని జాత్యైక్యవిహీనఘోర రణ మందన్యాయపుఁ జావు చ
చ్చిన యాభారత వీరరాట్కులములో శ్రీవిశ్వనాథానుకం
పను శేషించిన చిత్ర దేశమున సంచారించుచున్ జాటెసా
గె నసైక్యంబిఁకనుండ దయ్యపర వాగ్దేవీప్రబోధంబువన్! 88

పరుషారిభ మదాంధ హృద్విదూర భాస్వత్కీర్తి కంఠీరవా!
హరినామస్మరణాతతానుపమ భక్త్యైశ్వర్య సంక్రందనా!
వరకావ్యాబ్జ సుధా మరందరస దివ్యాస్వాదనేందిందిరా!
యురుకారుణ్యసుధీ! ప్రసన్నసుకవిత్వోత్సాహకావ్యేందిరా 89

వాచా చాతుర్య వరా!
ప్రాచీనాధునిక గద్యపద్యాది సుకవి
త్వాచార్య! దీనకవిలో
కోచిత సహకారకార్య! యురుగుణవర్యా! 90

మదనవృత్తము.

విద్వత్కవీశ్వర! సుధీవినుతాకరా! సం
పద్విశ్వనాధ కులదివ్య విభూషణా! శ
శ్వద్విష్ణుదేవ సుయశో భజనాన్వితో దం
చద్వాక్సుధామృతఝరీ! జయ ధీవిహారీ! 91

ఇది శ్రీకొండవంశసంజాత సంతోషమోహకవితనూభవ
ప్రసన్నకవి ప్రణీతంబయిన పృథ్వీభాగవత
ప్రబంధంబునందు నిర్వాణసంధముతో
సర్వము సమాప్తము.



శారదాణీ ప్రెస్, నరసరావుపేట.